మతశబ్దానుశాసన*ప్రభృతిపూర్వ।కవిజనంబులకృతులల*క్ష్యములకలిమిఁ।
బదియు రెండువిధంబులై *పరగుచుండుఁ।దద్విధంబులు దెలియంగఁ *దగుము
కుంద॥౧౩౩॥క॥ క్షితినస్మద్యుష్మత్పద।యుతులనఁగావ్యములయుష్మ*దస్మచ్ఛబ్ద।
ద్వితయమునకుఁబైఁ బ్రాణము। లతికినసుభయంబుఁ జెల్లు*నభయవిహారా॥*

సాంబోపాఖ్యానమునందు.

క॥ చతురాననసందనది।వ్యతపోధనవర్యయుష్మ*దాగమనమునన్।కృత
కృత్యుఁడనై తినినే।నతిపావనమయ్యెనస్మ* దన్వయమెల్లన్॥ ౧౩౪

అధర్వణాచార్యులవిరాటపర్వమునందు

ఆ॥ధర్మతనయయుష్మ*దాజ్ఞానిగళవిని । బద్ధమగుచుఁజిక్కి వడియెఁగా
క।విజయమత్తగజము*విడివడ్డచోనడ్డ। పాటుగల దెవిష్ట*పత్రయముస॥

ఆదిపర్వమునందు.

క॥ ప్రస్తుతఫణిసత్త్రభయ । త్రస్తాత్ములమైనయస్మ * దాదులకెల్లన్ ।స్వ
స్తియనిపలుకనవసర।మ స్తీకునకయ్యెనిప్పు*డంబుజనేత్రా॥ ౧౩౫

వ్యాకరణసూత్రము.

సూ॥ అచోన్త్యాదిటి॥వృ॥ అన్త్యాచ్ప్రభృతిశబ్దష్టిసంజ్ఞస్స్యాత్॥ శకం
ధ్వాదిషుటే।పరరూపంవాచ్యమ్॥శ్లో॥ శకంధురథకర్కంధూఃకుద్దాలోలక్త
పర్కటీ॥ లాంగలీషాహలీషాచమనీషాచపతంజలిః । కుక్కిలోక్షిషమంజీర
మస్తిష్కకులటాదయః ॥ తథావృకంధుసీమన్తాశకంధ్వాదిగణేస్మృతాః॥

శకానాందేశానామంధుః కూపః శకంధుః । శకంధువనఁగా। శకదేశ
మందున్నబావి।కర్కస్యాంధూః । కర్కంధూర్బదరీకోలీత్యమరః।కర్కంధు
వనఁగారేఁగుచెట్టు।కంశిరః। ఉష్ణవీర్యత్వాదుద్దాలయతీతికుద్దాలకః ।కుంభూ
మిముద్దాలయతీతివా। దళవిశరణే । ఉదిత్యుపసర్గః॥ కుద్దాలోబహువారక
ఇత్యమరః॥ కుద్దాలమనఁగావిరిగిచెట్టు! పాదమలతీత్యలక్తః। అలభూషణే।
యావ్రోలక్తోద్రుమామయఇత్యమరః।అలక్తమనఁగాలత్తుకపేరు। పర్చ్యతే
పరస్పరంస్పృజ్యత ఇతిపర్కటీ । పృచిసంసర్గే ॥ ప్లక్షోజటీపర్కటీస్యాదిత్య
మరః॥పర్కటియనఁగా । జువ్విచెట్టు।లాంగలస్యేషాలాంగలీషా। ఈషాలాం
గలదండస్యాదిత్యమరః॥ హాలస్యేషాహాలీషా। ఈరెండునుఏడికోలబేళ్లు।మ
నసఈషాలాంగలదండవత్సంబద్ధామనీషా॥ బుద్ధిర్మనీషాధిషణేత్యమరః ॥మ
నీషయనఁగాబుద్ధిపేరు । పతత్ అంజలిఃపతంజలిః పతంజలియనఁగావ్యాకరణ
మునకుమహాభాష్యముచేసిననాగముపేరు। కోర్యాభమేరుక్కిలః। కుక్కిలః॥



అగకుక్కిలజీమూతసానుమన్నగపర్వతాఇత్యమరః॥కుక్కిలమనఁగా। గట్టు
పేరు।ఉష్ణస్య ఈషః।ఉషీషః॥ఉష్ణీషశ్శిరోవేష్టకిరీటయోరితినానార్థే॥ ఉష్ణీష
మనఁగాఁదలపాగపేరు।మంజురుచ్యమీరయతీతిమంజీరః।ఈరస్వనే॥ మంజీరో
నూపురోస్త్రియామిత్యమరః॥ మంజీరమనఁగాఁగాలిగజ్జె। మస్తంశిరఇష్యతి
ప్రాప్నోతీతిమస్తిష్కం । ఇషగతౌ॥తిలకంక్లోమమస్తిష్కమిత్యమరః। మస్తి
ష్కమనఁగా।దలమెదడుపేరు।కులంవిటకులమటతీతికులటా।అటగతౌ॥అసతీ
కుల-టేత్వరీత్యమరః॥ కులటయనఁగా- లంజెపేరుఆదిశబ్దముచేత వేదండసా
రంగములు-మొదలైనవిమఱికొన్నిగలవు-వేదఃసామవేదః-అండఃజననకా
రణంయస్యసః।వేదండః।సామోద్భవఇతిప్రసిద్ధిః॥ సామజస్సింధురోపిసఇత్య
మరః ॥ వేదండమనఁగానేనుఁగుపేరు । సారాణ్యంగానియస్యసః సారంగః
సారంగశ్చాతకేభృంగేకురంగేచమతంగజఇత్యమరః॥ సారంగమనఁగా ।జా
తకాదులపేరు।వృకస్యఅంధుః-వృకంధుః-వృకంధువనఁగా- వృకదేశమందు
న్నబావిపేరు। సీమస్యఅంతః-సీమంతః- సీమంతమనఁగాఁబాపటపేరు- ఇవి
శకంధుశబ్దముమొదలుగాఁగలవిగావునశకంధ్వాదిగణమనఁబడును॥ ౧౩౬
క॥ విరతికివ్యాకరణమునను। వరరుచిచేఁజెప్పఁబడిన*వాక్యమువలనన్।బర
రూపమునిత్యంబై।పరగుశకంధ్వాదులకును*భయముంజెల్లున్॥ ౧౩౭

వేదండశబ్దమునకునాదిపర్వమునందు.

మత్తకోకిల॥దండితాహితవీరసూరిని*ధానదానవినోదకో । దండపార్థ
పరాక్రమప్రియ*ధామదిక్పరిపూరితా। ఖండపాండుయశోనిధీపర*గండభై
రవవైరివే। దండమండలచండతుండవి* దారణాసిభుజార్గళా॥ ౧౩౮

భీష్మపర్వమునందు.

ఉ॥ పాండునృపాలనందనులు * పావనిమున్నుగనేచియుద్ధభీ । ష్మండుగ
డంకమైనడుచు * చోటికిఁజక్కటిగాఁగఁద్రోచియొం । డొండగడంగిసేనత
మ* యుబ్బునకుబ్బగనన్యసైన్యవే।దండముఖాంగముల్తృణవి*తానముఁగాఁ
గొనినిర్వికారులై॥ ౧౩౯

సారంగశబ్దమునకుఁజంద్రికాపరిణయమునందు.

ఉ॥ జంగమరోహణాద్రిసదృ*శంబులుతత్పురిఁగల్గుభద్రసా । రంగవరే
ణ్యముల్పయికి*హస్తములించుకసాఁచియువ్వియ ।ద్గాంగఝరంబుపీల్చిమఱి*
తద్వమథుప్రకరంబుదప్పివ్రా । యంగనెసంగురంగుగని * జాఖ్యవహించిన
చాతకాలికిన్॥ ౧౪౦

ద్రోణపర్వమునందు.

ఉ॥ అంగదనాథుఁ ద్రుంగినవృ* కావలిదన్వినఁ జుట్టుకొన్న స। ర్వాంగములుం జలింప బెగ* డందుచు దిక్కులు చూచుచున్న సా। రంగియపోలెనుం మొగఁ రు* రాజు భవత్సుతుఁ సేన భీష్మునా। జింగ బలించి పాండవులు * జృంభితవిక్రమ లీలఁ బొల్చుటల్॥ ౧౪౧

ఉపసర్గలు.

శ్లో॥ ప్రపరప్రతిపర్యత్యధ్యభ్యవానూపసంస్వప। నివినిర్దురుదప్యాజి త్యుపసర్గాస్తువింశతిః॥ ప్ర-పర-ప్రతి-పరి-అతి-అధి-అభి-అవ-అను-ఉప-సమ్-సు-అప-ని-వి-నిర్-దుర్-ఉత్-అపి-ఆఙ్-ఇవి యిరువదియును నుపసర్గలు॥

౧౪౨॥ ప్రకారోపసర్గలు బాదియగుటం జేసి ప్రాదులనం బడును. తే-గీ॥ ఆంధ్రిమునకుఁ జేరని పరా* జపులుమయాఁడు। గాక తక్కిన యుపసర్గ * కములఁ దెలుపు స్వరములతికినవానిక*వ్వలను నిలుచు। నచ్చుయిన హల్లులయిన ప్రా దీ*యతి యమంగ॥౧౪౩॥ తే-గీ॥ అబ్జయోని రజోగుణ * ప్రాప్తిఁదనరు। ఇద్మనాభుఁడు సాత్త్విక * ప్రాప్తిఁదనరు। రజతగిరిమందిరుఁడు తమః ప్రాప్తిఁదనరు। న నగ నిబ్భంగిఁ బ్రాదుల*కవంతయతులు॥ ౧౪౪

కడమ యుపసర్గముల కన్నిటికిని నిటువలనె
రెండు మంజెల్లునని తెలిసికొనునది.

తే-గీ॥ ఒక్కసమసనమున శబ్ద * యుగము గూడి। పదము లేర్పాటుగాఁ గానఁ * బడనిప్రాణ। సంధులకు నిత్యసమసన* ప్రాంతములును న॥ ఖండవిశ్రమములు నన*రెండు జెల్లు॥ ౧౪౫ ॥క॥ లోకంబున గర్ణాటవ। నౌకోద్వీపాంతరీప*నాస్తిపదార్థా। నేకాన్యోన్యజనార్ధన। నాకాదులు నిత్యసమస*నములం బ్రముబుధుల్॥ ౧౪౬

ఆదిశబ్దము చేత మందారనారికేళశబ్దా
దులు మఱియు ననేకములు గలవు.

కర్ణాటశబ్దమునకు రామాయణమునందు.

శా॥ లాటీచందనచర్చచోళమహిళా * లావణ్యసామగ్రిక। ర్ణాటీగీతకళాసరస్వతికళిం*గాంతః పురీమల్లికా। వాటీమంజరిగౌళవామనయనా *వక్షోజ హారావళిద్రావిళపాటలింపం దగునీదు కీర్తిరథినీ*పాలాగ్ర గణ్యసాహిణీ॥ ౧౪౮

శ్రీనాథుని వీథినాటకమునందు.

మ॥ కుసుమంబద్దిన చీరకొంగువ్రేలయం * గ్రొవ్వారు పాలిండ్లపైఁ। ద్రి



సరంబుల్ వ్రేలుపారవేణియువటూ * దేశంబుపై రాయఁగాఁ। బసనెవ్వాఁడో యొకండు రాత్రి రతులం * బల్గాసిగావించిన। న్వసివాళ్వాడుచు వచ్చుచున్న యది క*ర్ణాటాంగనం గంటిరే॥ ౧౪౯

వనౌకశ్శబ్దమునకు—వనే-కానసే-ఓకః-స్థానమస్యేతి వనౌకాః॥

అథర్వణాచార్యుల విరాటపర్వమునందు.

క॥ శ్రీకంఠుఁ డెదురునపుడు వనౌకోధ్వజ మింద్రమకుట*మర్జునతురగా। నీకము దివ్యశతాంగము। నాకవ్వడికిచ్చియున్న *నతఁ డేమగునో॥ దానికి యుందక॥ ఆకర్ణమృదు తాలాంకుడు। లాకర్ణింపఁగ ననవ్యా*మైద్రోణునితో। నాకసదీను తుఁడని యెవ। నౌకోధ్వజ మెఱుఁగ వచ్చు * నరుఁజూపితగన్॥ ౧౫౦

ద్వీపశబ్దమునకుఁ గావ్యాలంకారచూడామణియందు.

ఉ॥ ద్వీపులఁ ద్రుంచు విశ్వజగ*తీపతియుత్తమశక్తిజాంబవ। ద్వీపమునందు గోవులకు*నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నుడై। గోపతి దేనువవ్విభున * కుందనవై భవమిచ్చెఁ గాకయే। భూపతులీవదాన్యగుణ * బుద్ధిఁ బ్రసిద్ధి వహించిరుర్వరన్॥ ౧౫౧

నైషధమునందు. సీసపాదము.

వితతవదన్యయ* ద్వీపనానాజయశ్రీవధూటీసమా*శ్లిష్టభుజుఁడు॥

అంతరీపప్రతీపశబ్దములకును నిటువలనే.

నాస్తిపదమునకు శృంగారషష్ఠమునందు సీసగీతి.

గీ॥ తల్లియును దండ్రిదైవంబు* తలఁపగురుఁడ। కాఁడె యితఁ డేమి చేసినఁ గనలఁ దగునె। నాస్తికాధముఁ డోరియ*న్యాయవృత్తి। నాస్తితత్త్వం గురోః పర*మ్మనగవినవె॥ ౧౫౨

విష్ణుచిత్తీయమునందు.

శా॥ ఆనిష్టానిధి గేహసీమ నడురే*యాలించిన న్మ్రోయుచుం। దేనాగేంద్రశయానుపుణ్యకథలుం * దివ్యప్రబంధానుసం। ధానధ్యానము నాస్తిశాకబహుళా * నాస్త్యుష్ణతా నాస్త్యపూ। పోనాస్త్యోదనసౌష్ఠవం చకృపయా భోక్తవ్యమన్నల్కులున్॥ ౧౫౩

పదార్థశబ్దమునకు సాంబవిలాసమునందు.

తే-గీ॥ హాలికి నెదురేగి సకలప*దార్థములును। పాయసము పెట్టి నీ ముద్దు* పట్టితోడ। జాంబవంతుని దౌహిత్రు*శౌరిపుత్రు। సాంబు నెప్పించు బ్రతికించు*సకలజనుల॥ ౧౫౪

భాస్కరశతకమునందు.

ఉ॥దక్షతలేనియింటికిఁబ*దార్థమువేఱొకచోటనుండివే। లక్షలువచ్చునే నియుఁబ*లాయనమైచనుఁగల్లగాదు|ప్రత్యక్షమువాగులన్వఱద* లన్నియు వచ్చిన నీరు నిల్చునే। యక్షయమైన గండిదెగి * నట్టితటాకము లోనభాస్కరా॥ ౧౫౫

అనేకశబ్దమునకువిష్ణుచిత్తీయమునందు.

క॥ తునియలుతొమ్మిదియటపదు। నెనమండ్రటమోచువార*నేకపకిటి కూ|ర్మనగాహులేటిలావరు|లనితావకబాహువొకటి*యవనిభరించెన్ ॥

కాళహస్తిమాహాత్మ్యమునందు,

ఉ॥ తానుగుమారజంగమను* ధాకరమాళియుఁగూడిమాడియిం|పైనర తిప్రసంగముల*నర్ధనిమీలితనేత్రపద్మముల్। మానినిచుంబనంబలర*మాట సౌఖ్యలువీడివీడిపో। నీనికవుంగలింతలున*నేకవిలాసములుంజెలంగఁగాన్॥

కర్ణపర్వమునందు.

ఉ॥ప్రమొగ్గెడువాహనంబులును*మోములువాడఁగవాహనంబులన్। డిగ్గితొలంగుసైనికులు*నేలకుఁగష్టపుచొప్పుచొప్పడన్। దగ్గుసిడంబులుంగులముఁ* దన్నుదలంచిమెదిర్చియొంటిమై। ప్రమగ్గెడువారునైకురుధ* రావరుసైన్యమురూపుమాయఁగాన్॥ ౧౫౮

ఆముక్తమాల్యదయందు.

చ॥ మలఁచిపయోజకోశముల*మాడ్కి నొనర్చినపద్మరాగపుం|గలశపుబెజ్జదాల్చ్పమిడి*కంబులతోనపరంజియోడుబి। ల్లలనలవైజయంతముజ*లంబునగెల్వఁగదంశితంబులై|నిలిచినయట్లుమాడువుల*నేకములుల్లసిలుంబురంబునన్ ॥౧౫౯॥వ॥ అనాద్యనంతానంగానూరుశబ్దములు మొదలైననఞ్ సమాసములకన్నిటికినిటువలనె రెండునుం జెప్పవచ్చును॥

అన్యోన్యశబ్దమునకుంగావ్యాలంకారచూడామణియందు.

ఉ॥ ధన్యుఁడువిశ్వభూవిభుఁడు* ధారుణినేలఁగభూజనంబుల। న్యోన్యహితత్వసంపదల*నొందిరిదంపతులింపునింపన। న్యోన్యసుఖానుకూలతల*నొమిరివిప్రులువేల్పుపిండున। న్యోన్యసుపుష్టితుష్టికుశ* లాదులనొందిరినాఁడునాటికిన్॥ ౧౬౦

జనార్దనశబ్దమునకుసాంబవిలాసమునందు.

జనానర్దయతిసుఖయతీతిజనార్దనఃఅర్ధగతౌయాచనేచవిష్వక్సేనోజనార్దనఇత్యమరః ॥ చం ॥ శరధిసుతాకళత్రనవ * సారసనేత్రబలాంతకాదిని। ర్జరనుతనామపాతకవి * రామవిహంగమయానచారుక। ర్బురపరిధానపాండవవి * రోధివిభంజననిర్మలాత్మకా|యరుచిజితాభ్రభంజనజ*నార్దనకైటభదైత్యమర్దనా॥ ౧౬౧



ఆరణ్యపర్వమునందు.

చం ॥ నగినగివేమినియున్ననుజ * నార్దనమొన్నడుఁబొంకువల్కము|త్యగణితవిక్రమోరుబల * ధైర్యసమగ్రులమెల్లభంగిఁగా|లగతిదొలంగఁద్రోవఁగద * శంబగునేయగుఁగాకనీకుమెచ్చు। గనిదెప్రాణమిచ్చెదము*సుక్కము చావునకాత్మనేమియున్ ॥ ౧౬౨ ॥ నాకశబ్దమునకునవిద్యతేఅకందుఃఖమత్రేతినాకః॥స్వరవ్యయంస్వర్గనాకఇత్యమరః॥గౌరరాజుచాటుధార॥

ఉ ॥ ప్రాకటదర్పతన్ సకల * రాయనిలక్కనృపాలునాజిలో ॥ దాఁకువిరోధిసైన్యమును * దంబొదవన్వరియింపవచ్చుచో। నాకసమెల్లఁగ్రమ్మకొను * నంచితదివ్యవిమానసంచర। న్నాకవిలాసినీచరణ*హంసకభూరిఝుణంఝుణధ్వనుల్ ౧౬౩

విరాటపర్వమునందు.

క॥మును వెఱతు నేయమిారలు।నను నేసినగానియనుడు*నాకేశసుతున్।ధనురాచార్యుఁడుదెబ్బది।సునిశితబాణములనేసెఁ*జూపఱువొగడన్॥

కావ్యాలంకారచూడామణియందు.

క ॥ నీకరవాలముపాలై । నాకంబునకేగిరాజి * నారాయణరాయ।భూకాంతులెట్టిచనువో। నాకవిటోత్తములఁదూల*నడఁతురుకడిమిన్॥ ౧౬౪

నఞ్ సమాసశబ్దములెన్నియున్ననునన్నిటికిని నిటువలెనేయని తెలిసికొనునది॥వ॥విశ్వామిత్రశబ్దమునకురంగనాథునిరామాయణమునందు। ద్విపదము ॥ ఎక్కడాగురుఁడని*యెఱుఁగనినీకు। నక్కటాగురుఁడువి*శ్వామిత్రుఁడయ్యె॥

రామాయణమునందు.

మ॥హరకోదండవిఖండనుండుజనక * త్మాధీశుజామాతభా। స్కరవంశాగ్రణిజానకీప్రియుఁడువి *శ్వామిత్రయాగాహితా। సురసంహారివిరాధకాలుఁడుఖరా * సుధ్వంసిమారీచసం।హరుఁడస్యప్రమదాపరాఙ్ముఖుఁడయో* ధ్యానాయకుండాదటన్॥ ౧౬౫

ఆపోశనశబ్దమునకుఁజమత్కారరామాయణమునందు.

క ॥ ఓశశిముఖలోపాము।ద్రేశుఁడుకలశభవుఁడు * నిటనతఁడుతపో।రా

శిమహాత్ముఁడుమునుపా। పోశనముగఁగొనియెసాగ * రాంబువుతెల్లన్॥

శృంగారషష్ఠమునందుసీసగీతి.

తత్తరమునన్నాపోశన * మెత్తఁబోయి। భూసురుండెత్తునుత్తరా * పోశనంబు॥

స్వాంతశబ్దమునకునైషధమునందు.

గీ॥ అధికరోషకషాయిత * స్వాంతుఁడైన। నరపతికివిన్నవింపకు * నాయవస్థ
పైత్యదోషోదయంబునఁ * బరుసనైన। జిహ్వకునుబంచదారయుఁ జేఁదుగాదె॥

విరాటపర్వమునందు.

ఉ॥ స్వాంతముబాహుగర్వఘన * సంతమసాంధముగాఁగశంకయా। వం
తయులేకఁగీచకుఁడ * హంకృతిమొంగలినాగమంటపా। భ్యంతరసీమఁజొచ్చి
దరి * యంజనియారసిసెజ్జఁగాంచియు। త్యంతముదాపహంబగుడు * నంధుర
యంబునఁగేలుసాఁపఁగాన్॥ ౧౭౧

ఏకాంతశబ్దమునకుఁబారిజాతాపహరణమునందు

ఉ॥ అంతటనొక్కనాడుధవ * ళాంబుజనేత్రుఁడువచ్చిరుక్మిణీ। కాంత
గృహంబులోనశశి * కాంతశిలామయవేదిమీఁదనే। కాంతమునందుఁగొంద
ఱుమ్మృ * గాయతనేత్రులుగొల్వఁజూదము। త్యంతవినోదకేళిమెయి * నాడుచు
నుండఁగనద్భుతంబుగాన్॥ ౧౭౨

ఆదిపర్వమునందు.

తే-గీ॥ కామసుఖసంగములకునే * కాంతగృహము। పోలిపొలిచియుధర్మ
ర్థ * ములకునిదియ। యాస్పదంమనవర్గత్ర * యాచరితులై। నజనులకునెంత
యునొప్పు * నప్పురంబు॥ ౧౭౩

సిద్ధాంతరాద్ధాంతలతాంతప్రాంతనిశాంతాది
శబ్దములకన్నిటికినినిటువలనెరెండునునడుచును॥

నారాయణశబ్దమునకు—నారాఃఆపఃస్థానమస్యనారాయణః

ఆదిపర్వమునందు.

ఉ॥ పాయకపాకశాసనికి * భారతఘోరరణంబునందునా। రాయణున
ట్లుదానునధ * రామరవంశవిభూషణుండునా। రాయణభట్టువాఙ్మయధు *
రంధరుఁడీకృతికిష్టుఁడున్నవా। ధ్యాయుఁడునైనవాఁడభిమ * తంబుగదోడయి
ర్వహింపగాన్॥ ౧౭౪

వాతాయనశబ్దమునకు—చాటుధేన్ణచరిత్రమునందు.

గీ॥ అచ్చగలునందనంబునఁ * దెచ్చుకొనుసు। రాగసుమములుహార్మ్యవా *



తాయనముల। చెంతగాలూఁదితత్పుర * స్త్రీలకొసఁగివేడుకొనిపోవుదురుక
ప్రపీడియములు॥ ౧౭౫

విరాటపర్వమునందుసీసపాదము.

తరుణులుఁబతులుహా * తాయనమ్ములనల్లమలకలై వేఁబోక * మలయపవను॥

ఉపాయశబ్దమునకుసుదక్షిణాపరిణయమునందు.

చ॥ వలఁబడియున్నజక్కవక * వంబురణించుచునన్నపైఁటలో। పలబిగిగుబ్బ
దోయికను * పండువుసేయఁగమోడ్పుచేతులా। దలనుఘటించిమొక్కిడిప *
దంపడిమెల్లనడాయఁబోయితో। య్యలివిరిబంతిదోయిటను * పాయనమా
యనకిచ్చియిట్లనున్॥ ౧౭౬॥

అష్టమహిషీకళ్యాణమునందుద్విపదము.

ఇంతులమేల్బంతి * యిడినసేవంతి। బంతిచేదోయిను * పాయనమిచ్చి॥

రసాయనశబ్దమునకునంతునిఛందమునందు.

ఆ॥ నాస్తియనకమహిన * నంతసంపదలునా। రాయణుండొసంగు * రమ్యమగు
ర। సాయనంబుబుధుల * కతఁడనిత్యస। మాసయతులురెంటి * నంటియుండు॥

జైమినిభారతమునందు.

గీ॥ మత్తిమాత్రంబెపిల్లల * మత్తిపేరు। పేరువలెఁగామశారదా * పీఠకంబు। వా
రిలోపలపినవీరు * వాక్యసరణి। సరసులకునెల్లఁగర్ణర * సాయనంబు॥

రామాయశణబ్దమునకురాఘవపాండవీయమునందు.

ఉ॥ ఏమెఱనర్థగౌరవస * మృద్ధియుశబ్దవిశుద్ధియుందిరం। బైయనవద్యతంబర
గ * నంధ్రివచస్థితిభారతంబురా। మాయణముల్రచించినమహాత్ములనాత్మఁ
దలంచెదజ్ఞగ। ద్గేయులనన్నపార్యునిని * దిక్కనసెజ్జనభాస్కరాఖ్యునిన్॥

జైమినిభారతమునందు.

తే-గీ॥ మానిజల్పితమైనరా * మాయణంబు। స్వరనయగ్రామమూర్ఛ
నా * సరనులెఱఁగి। గానశక్తులమెఱసినా * కౌతుకరింపఁ। బాడిరాలాపము
లఁద్రిదస * ప్తములుముట్ట॥ ౧౮౧

పరాయణ-పలాయణ-బాదరాయణ-సాంఖ్యాయనశాకటాయన-కా
త్యాయన-వాచ్యాయన-బోధాయన-దక్షిణోత్తరాయణాదిశబ్దములకును
నిటువలెనేరెండునుగలవు॥

మార్తాండశబ్దమునకుశృంగారషష్ఠమునందుసీసగీతి.

తే॥ వలపదుభయంబువారెంత * వారలైన। నట్టివారలుమనకగ్గ * మైన

వారు ॥ వారునిరయంబునకుఁగాఁపు * వచ్చువార । లనుచుబుద్ధిగఁజెప్పె మా*ర్తాండసుతుఁడు॥ ౧౮౨

ద్రోణపర్వమునందు.

మ॥ ధరణీచక్రముదిర్దిరందిరిగెమా*ర్తాండుండుగుంఠీభవ । త్కిరణుండయ్యెదిశావితానమువడం*కెన్మిన్నుభ్రమోసెన్మహీ ।ధరసంతానములోనగ్రిక్కదలెను*ద్భ్రాంతంబులై యంబుధుల్ ।పొరలెన్గట్టులమీఁదబెట్టుపిడుగుల్* ప్రోద్యన్నితాంతధ్వనిన్॥ ౧౮౩

బ్రిహ్మాండాదిశబ్దములకునునిటువలనే.

యచ్చునుహల్లునుజెప్పదగును.

ఉపసర్గసంధికి.

చంద్రికాపరిణయమునందు.

ఉ॥ అంతటరుక్మబాహువసు*ధాధిపనందనయొక్కనాఁడుశు* ద్ధాంతగృహంబువెల్వడివి * హారగతింజనుదెంచెనెచ్చెలుల్ ।చెంతలఁగొల్వఁజంచదళి* శింజితరంజితకుంజమంజుల. । ప్రాంతగిళత్ఫలానవర * తాంగజఘోటికిఁబుష్పవాటికిన్॥ ౧౮౪

కవిజనాశ్రయమునందు.

ఉ॥ మానుగవిశ్రమాక్షరస*మంచితమైస్వరమూఁదినందదీ । యానుగుణాక్షరంబుకొని * యైననుజెప్పఁగనొప్పునీక్రియన్ । భానుసహస్రభాసివృష* భాధిపుఁడన్నటులర్థయుక్తమై। పూనినచోనఖండవళి * పొల్పగునాదికవిప్రణీతమై॥ ౧౮౫॥ ద్వారశబ్దమునకు । ద్వేఅరేపార్శ్వేయస్యతత్ ద్వారం । పృషోదరాదీనియథోపదిష్టమితిసూత్రేణద్విశబ్దాంతస్యఅకారాదేశః ॥ ఉ॥ వారకవారకామినుల*వర్తులచారుకుచోపగేహముల్ । గోరకకోరకోల్లసితకుంజములంజిగురాకుపానుపుల్ । చేరకచారుకేరళక * ళింగకుళింగనరేంద్రమందిర । ద్వారవిహారులై సిరుల * నందకనందకపాణిగొల్వరో ॥ ౧౮౬

హల్లులకునుత్తరరామాయణమునందు.

ఉ॥వారలువారిభూరిపరి*వారముతోడవిమానమెక్కిరాఁ । గారఘునందనుండరిగి*కాంచనతోరణచిత్రమైనత।ద్వారనికాయమైననిజ * పట్టణముత్సుకవృత్తిఁజొచ్చెనిం। డారుముదంబునస్భరతు * నాకృతిబాలిశవృత్తిగ్రాలఁగన్॥ ౧౮౭



కుమారవదాచరితాశక్తిః కుమారయితశక్తిః - కుమారాయితయాశక్త్యాశాలతయితికుమారాయితశక్తిశాలీ॥కుమారసమానపరాక్రమవానిత్యర్థః॥

ఆదిపర్వమునందు.

ఉ॥ ఆయముగర్వమున్విడిచి * యన్యపతుల్పనిశేయనిట్లుగాం। గేయభుజాశ్రయంబునని*కృత్తవిరోధిసమాజుఁడై కుమా।రాయితశక్తిశాలిధృత*రాష్ట్రుఁడురాజ్యముచేయుచుండెన । త్యాయతకీర్తితోఁదనకు * హస్తిపురంబదిరాజధానిగన్॥ ౧౮౮

భద్రవదాచరతామూర్తిర్యస్యతత్ భద్రాయితమూర్తిః

శోభనమూర్తిమదితియావత్ । అయమపిక్యఙ్ ప్రత్యయాన్తః॥

విరాటపర్వమునందు.

ఉ॥ శ్రీయనగౌరినాఁబరగు * చెల్వకుజిత్తముపల్లవింపభ । ద్రాయితమూర్తియైహరిహ * రంబగురూపముదాల్చివిష్ణురూ । పాయనమశ్శివాయయని * పల్కెడుభక్తజనంబువైదిక । ధ్యాయితకిచ్చమెచ్చుపర * తత్వముఁగొల్చెదనిష్టసిద్ధికిన్॥౧౮౯॥ వ॥ ఈరెండుపద్యములయందునన్నయతిక్కనకుమారభద్రశబ్దములుక్యఙ్ ప్రత్యయాంతములుచేసిసంయుక్తవిశ్రామంబులుగాబ్రయోగించిరి। అదిగానఁగొందఱారెండుశబ్దములమీఁదను। అకారములున్నవి।నిత్యసమాసవిశ్రాంతులనిభ్రమింతురు। శబ్దసూత్రమువలనవానికేదీర్ఘములువచ్చినవిగాని యందులోనత్తులులేవు॥

దేశ్యనిత్యసమాసవిశ్రాంతులు.

తే–గీ॥ శబ్దానుశాసనముఖకవీ* శ్వరకృతప్ర । బంధములలక్ష్యములఁగను*పట్టుకతన । దేశ్యనిత్యసమాససం * ధికిఁబొసంగు । వడిస్వరంబై నవ్యంజన*వర్ణమైన॥౧౯౦॥క॥ రూపఱఁబెంపఱఁబెల్లఱ । నేపఱచుటగ్రిక్కిఱియుట*నిలగ్రచ్చఱయుం । జూపఱయుక్కఱమొదలుగ । ద్యాపతిదేశీయనిత్య* సమసనపదముల్॥ ౧౯౧

కొందఱువీనిపేరేదేశ్యాఖండములందురు

అనంతునిఛందమునందు.

తే–గీ॥అఱనసంగనుబోవుట*కర్థమైన । సంధినిత్యసమాసోక్తి*జరుగురెంట। నసురవీరులనెల్లను * కఱవధించె । భానుకులుఁడురావణునినే * పఱిచెననఁగ॥

మాఁడవపర్వమునందు.

క॥ ఎఱకలుగలకుశైలము। తెఱఁగునమైరయము మెఱయ*దివికినెగసిబి।
ట్టుఱుముజలధరముక్రియను। క్కఁ—అఁదద్వనమెల్లనద్రువనార్చుచుఁగడిమిన్॥

యుద్ధకాండమునందు.

చ॥ ఎఱిఁగియెఱింగిమున్నతఁడె* యెగ్గొనరించినదానికైకదా। చెఱఁగో
నివచ్చితింబిదప * శీతవృథాకథలింక నేల పెం।పఱ బ్రతికింతదీయనెఖ*రాదు
లచావునకేమిచింతనీ। మఱఁదలిబన్నమేపగిది*మానినినీగుదుసంధిఁజేసినన్॥

వశిష్ఠరామాయణమునందు.

ఉత్సాహ॥ మఱియుఁబెక్కుయోనులందు * మహితచిత్రగతులఁబెం।ప
అజనించిదుఃఖభాజి * యైచరించివెండియున్ । వఱలువిప్రవరునియింట*
వాసుదేవుఁడనఁగఁదా।నెఱుకగలిగిపుట్టివేల్పు* లేటితీరభూములన్ ॥౧౯౬॥

విరాటపర్వమునందు.

చ॥ చిఱునగవొప్పగాండివము * చెచ్చెరసజ్యముఁజేసి సేనలు । క్కఁ—అర
భసంబుమైనడరఁ * గవ్వడిద్రోణియునీడఁబోకయ। త్తఱిఁదఱుమంగనస్త్రి
ములు * దండడిదార్కొనిమండుచుండెఁజి । చ్చఱపిడుగుల్వడింద్రోరఁగు।
చాడ్పునసంబరవీధినుగ్రమై॥ ౧౯౭

లక్షణసారసంగ్రహమునందు.

చ॥ ఎఱుఁగవుగాకభోగముల * కెల్లనునెచ్చెలిజవ్వనంబుని । త్తఱినుడి
వ్రోవకుండనుచి * తంబుగజక్కవదోయిఁబోలిక్రి।క్కిఱిసినచిన్నిచన్నుఁగవ।
యిం పెసలారఁగనాడుచిత్తమ । న్వఱలుసరోవరంబునన *వారణకేళియొన
ర్పవేకోమలీ॥ ౧౯౮

ఆరణ్యపర్వమునందు.

చ॥ ఎఱిఁగితినిన్ను నేనువిబు* ధేంద్రుఁడవీవుజగత్రయంబుగ।చ్చఱభవ
దీయరక్షణము * నంద వెలుంగుచునుండునట్టిని । న్నుఱువుగనేను వేడుకొన*
నొప్పనుగాకమొఱంగినన్ను।నక్కఁ—అపడినీవు వేడుటిది * కర్జమెనిర్జరదైత్యచె
ప్పుమా॥ ౧౯౯

ఉద్యోగపర్వమునందు.

చ॥ తఱియగునంతకున్నిపును * దగ్రతసైచుటనీతినీవునా।కఱపినయట్లు
సేయుముత * గంజనియాతనిఁగాంచినిన్ను నె। త్తెఱఁగుననైనఁబొందఁగమ*



దిం* గలదేనియునింతయేల క్ర।చ్చఱమునివర్గవాహనుఁడ* వైచను దెమ్మను
నంతదీఱెడున్॥ ౨౦౦

ఉ॥సన్నయముఖ్యసత్కవిజ।నంబులకావ్యములందులేఖకుల్।గొన్నియుఁ
బారకాధములు * గొన్నియుఁబోకడఁబెట్టిరక్కవై । యున్నెడఁగాంచిజా
నపదు*లోడకదిద్దిరతప్పుతోవలె। ల్లన్నిజమంచుఁగైకొనిన*లక్షణవేత్తలు
సమ్మతింతురే॥ ౨౦౧

వ॥ అదియెట్లనిన సులక్షణసారంబునందులింగముగుంటతిమ్మన వ్రాసిన యప్రశస్తంబులగులక్ష్యంబులకునాశ్చర్యంబునొంది బహుపుస్తకంబులు నిరీక్షించివానినెల్లను బ్రక్షిప్తంబులుగానెఱింగినవాఁడనై లక్షణవంతంబులగు పురాతనకవిప్రోక్తంబులువివరించెద॥ ౨౦౨

ఆదిపర్వమునందు.

క॥ నావచనముననపత్యము । గావించుననీకుగొంతి * కడునెయ్యము
నన్।నీవగచినయాయర్థము।నూవెమనంబునఁదలంతు*సుందరియెపుడున్॥

ఉద్యోగపర్వమునందు.

క॥ తమతండ్రిభంగినీకును । సముచితముగభక్తిఁజేసి * సజ్జనసుతమా।
ర్గమునను జరియింపంగా। నమలమతినిగన్నకొడుకు* లట్లరయఁజనున్ ॥౨౦౪

ఆనుశాసనికపర్వమునందు.

క॥ అతిథినినుఁగోరెనేనియు।మతిఁగింకిరిపడకయోల*మానసపడకనీ।వత
నికిఁబ్రియంబుసలుపుము । సతికింబతిపనుపు సేయఁ * జనునెల్లెడలన్॥ ౨౦౫

రామాయణమునందు.

ఉ॥ అన్నవుతండ్రియట్లవిను*మంతియకాదటమీఁదరాజవే। మన్నఁగొ
అంతలేదుమణి * హారములాదిగఁబెక్కుకానుక । ల్మున్నగసీతనిచ్చిజనలో
కపతింగనిమ్ముఁబ్రోవుమీ । సన్నపుకార్యముల్వలదు * సంధియమేలటు
నాకతక్కినన్॥ ౨౦౬

యుద్ధకాండమునందు.

ఉ॥ ఓకపివీరులారనుగు * ణోదధినీరఘురాముసర్వలో । కైకశర
ణ్యునింగొలువ* నిప్పుడువచ్చితినొండుగాదునా।రాకమహాపరాధియగు*రా
వణుతమ్ముఁడనేవిభీషణా । ఖ్యాకుఁడవీనునాసచివు * లర్కకురాగ్రణితో
డఁజెప్పరే॥ ౨౦౭

దేవకీనందనశతకంబునందు.

మ॥ చతురంభోధిపరీతభూవలయరా * జన్యాలికోటీరరం । జితమాణి
క్యవిరాజితచ్చరణరా * జీవుండుధర్మాత్మజుం । డతికార్పణ్యముతోడమత్స్య
పతిఁదా * నాసింపఁడేతావకా । యతకారుణ్యముగల్గునం * తకునుగృష్ణాదే
వకీనందనా॥ ౨౦౮

ఆరణ్యపర్వమునందు.

చ॥ ఉరమునరెండుగన్నులుపృ*థూదరదేశమునందునోరుప్ర । స్ఫురిత
భుజద్వయంబునుస * ముజ్జ్వలదున్నతభావముంగరం । బరుదుగనుగ్రమైన
వికృ * తాకృతితోడనశేషసత్వసం । హరుఁడగుచున్నవానిదివి* జారిఁగబం
ధునిగాంచిరచ్చటన్ ॥ ౨౦౯

ఉద్యోగపర్వమునందు.

చ॥ అనిమదినిశ్చయించితగ* నందఱఁబిల్వఁగఁబంచివారితో । ననిచిన
మాటలాడివిన* యంబునఁబ్రార్థనచేసిమీరుమా । కొనరినసైన్యముల్పదు
ను * కొంటికిఁబ్రాభవమాచరింపఁజొ । చ్చినసకలంబునొప్పనభి* షేకము*
గై కొనుఁడుత్సవంబునన్॥ ౨౧౦॥ వ॥ దీని మూఁడవపాదంబునందుఁ బదును
కొంటికిననియున్నచోటసంధిగూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులు
ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్యసమాస
వడియని యనుకొందురు॥ ౨౧౧

నిత్యయతులు.

ఏనియనునాంధ్రశబ్దము।తోనదికినపూర్వపదము*తుదిఁవ్రాయికిన।చ్చె
ననువ్యంజనవర్ణం।బై నరచింపుదురునిత్య*యతులనుచుఁగవుల్॥ ౨౧౨

శేషధర్మములయందు.

క॥ పెట్టఁడునారకమార్గం । బెట్టిమహాక్రూరకర్ముఁ * డేనియుఁదుదని *
ట్టట్టనకనెమ్మనంబున।నెట్టనహరిఁదలఁపఁగలిగె*నేనిమహాత్మా॥ ౨౧౩

రాగమసంధివళులు.

తే॥ ఆలనుపదంబుమొదలను * రాగమంబు । వచ్చుసంధికినుభయంబు*
వళికిజెల్లు । నతివజవరాలుబాలింత * రాలుముద్ద । రాలుధర్మాత్మురాలన*
రాఘసారి ॥ ౨౧౪



మనుచరిత్రమునందు.

ఉ॥ ఇంతలుకన్నులుండఁదెరు * వెవ్వరివేఁడెదుభూసురేంద్ర । యేకాంత
మునందునున్నజవ*రాంద్రనెపంబిడిపల్కరించులా।గింతియెకాకనీవెఱుఁగ*
వేమునువచ్చినత్రోవచొప్పనీ। కింతభయంబులేకడుగ * నెల్లిదమైతిమెమా
టలేటికిన్॥ ౨౧౫

చారుదేష్ణచరిత్రమునందు.

క॥ ఈలలనవేలుపుంజవ । రాలోయచ్చరయొకిన్న * రవధూమణియో ।
వ్యాళాంగనయోకాకీ । భూలోకస్త్రీలకిట్టి * పొంకముగలదే॥ ౨౧౬

విభాగవళులు.

క॥ తులసీభూషణసంక్యరుఁ। దెలుఁగునఁబరిమాణసంజ్ఞ * దేటపఱచు
బ।ట్టులనేసియనుపదమునకు । నలరువిభాగవడియనఁగ*నచ్చునుహల్లున్॥

కాశీఖండమునందు.

గీ॥ అప్పటికినియ్యకొంటిఁగా * కంబుజాక్షి । ఋషులపాలిటివేయింత *
లేసిపనులు । కొదుకకాఁబోతునాబోతు*గుమ్ములాడ । నడిమియాఁబెయ్యదె
సవచ్చె*నాకుఁజూడ॥ ౨౧౮

కావ్యాలంకారచూడామణియందు.

ఆ॥ కృష్ణుఁడిచ్చునాలు*గేసిచీరలుకూర్మి*నింతులకునునాలు* గేసిమణు
లు। శివితోడదోసె*డేసిమాడలుకడు । నింపెసంగగంపె*డేసిసొమ్ము ॥

నామాఖండవిశ్రమములు.

ఆ॥అప్పయయ్యయన్న*యరసవ్వయమ్మక్క । యాయియనుపదంబు*ల
నుకుసంధు।లుభయమునకుఁజెల్లు * చుండునామాఖండ । వళులనంగనూఁ
దఁ*బడకనైన॥ ౨౨౦

అప్పయనుటకునందితిమ్మన.

క॥ ఇప్పటిదాతలసరిగాఁ। జెప్పకురాభట్టకర్ణ * శిభిఖేచరులన్ । జెప్పుము
మూర్తిఘనునివెం। కప్పకుదానమునవిర్భ*యంబునసభలన్ ॥ ౨౨౧

హుళిక్కిభాస్కరుని చాటుధార.

క॥ అప్పలిఘనతఁడుఘనుఁడా।యప్పడొసఁగిమరలఁజెందు * నాతఁడురా
జా।చెప్పఁగవలెసాహిణిమా । రప్పనుదానమునఘనుఁడు*రాజనటంచున్ ॥

అన్న అనుటకు పొట్టూరిగోపన.

క॥అన్నలుఁడురూపమునసిరి। యన్నగళాయుక్తిభరతు*నన్నకరుణచే। నన్న

సముద్రపు పెదచిన్నన్నకుమారుండు వెంగళామాత్యుఁడిలన్ ॥

తెనాలి రామకృష్ణమ్మ.

క॥ చిన్నన్న ద్విపద కెరఁగును। బన్నుగఁ బెదతిరుమలయ్య* పదమున కెరఁ
గు। న్మిన్నంది మొరసె నరసిం। గన్న కవిత్వంబు పద్య*గద్యశ్రేణిన్ ॥ ౨౨౪॥

తేలఁ బలుకుటకు విక్రమార్కచరిత్రమునందు.

చ॥ అనఘుఁడు సింగనార్యునకు * నబ్బయ గోపయమంత్రి చిక్కనా। రన
యుసుగల్గి రాత్మజులు- రాము బుముప్వురు దోఁచినట్లు పెం। పున వెలయంగ న
బ్బయకు*బుత్రులు పుట్టిరి రామరాజు గే। సనయును బాచిరాజుగుణ*సంగుఁడు
లింగనయుంగ్రమంబునన్ ॥ ౨౨౫

ఊఁదంబడక యన్నందుసకునసంతు నిఛందమునందు.

తే-గీ॥ ఒరులనమ్మయ్యయను చోట*నూఁదఁబడక। ద్విధమగుఁ బ్రభునా
మాంత*విరమణంబు। మహినయోధ్యకు రాజు రా*మయయసంగ। సతని పట్ట
పుదేవి సీ*తమయనంగ ॥ ౨౨౬

రుక్మాంగదచరిత్రమునందు ద్విపదము.

శ్రీకరగుణసాంధ్రి*చిరయశోరుంధ్రి। ఆకారచంద్ర రా*మయభాస్కరేంద్ర॥

అరుసు అనుటకు నాంధ్రకవితాపితామహుఁడు.

క॥ చేపట్టిన ధుర్విపుల గుదురు। కోపించిన రంభ గూఁడు*కొండరు జగతిన్। స్థా
పింపఁ బొడవఁ జాలని। యాపంలు దసాల్వకోన* మరుసున కెనయే ॥ ౨౨౭

పలకలూరి గోపన.

తే-గీ॥ గోలకొండ మలక*గోవుల భక్షించు। కొండవీటి విప్రకులము నెల్ల।
బాచమరుసు చేరి*భక్షించుచున్నాఁడు। మలక మేలొ బాచ*మరుసు మేలొ॥

అమ్మయనుటకు ఈవని పెద్దరాజు రామరాజు చాటుధార.

క॥ ఇమ్మహిలో మహనీయగు। ణమ్ములనీ సాటిగలరె* నానావిధదేశ। మ్ము
లశ్రీరామునిసీ। తమ్మా మాయమ్మ నిత్య * హర్షములిమ్మా ॥ ౨౨౯

క॥ ఇమ్మా మధభీష్టంబులు। కొమ్మా మాౘ్రమొక్కు లెల్ల*గురుమతితో మా।
యమ్మా రఘునందనుసీ। తమ్మా సౌభాగ్యసిద్ధి* దాయినివమ్మా॥ ౨౩౦

అక్కయనుటకుఁ జాటుధార.

క॥ ఇక్కలియుగశక్తులలో। లెక్కింపకు భట్టశంక*లేక ధరిత్రిన్। మిక్కిలి
మల్లేశునియం। బక్కకు సరి వేల్పుగల దె*యవనీస్థలిలోన్ ॥ క॥ చొక్కపు శ్రీగిరి
నిలయుని। మక్కువమదిలో నెఱెంగి*మనుజులఁ బ్రోవన్। దిక్కయి నిల్చిన మా



యం। బక్కకు సరిగల దెసకల*భాగ్యస్ఫురణన్॥ ౨౩౨

ఆయియనుటకు రాచపూడి వెంకటయ్య చాటుధార.

క॥ వ్యాయామజనితమాయో। పాయసమస్తాఘములు ని*వారణమగుదు।
ష్కాయంబు పూతమగుగం। గాయిని బొడగన్నఁదా * నమాడినమాత్రన్॥

వణుకూరి గుర్వరాజు శమంతకమణిచరిత్రమునందు.

ఉ॥ కాయవచోమనస్స్ఖలన*కల్పితదోషము లెల్లఁ బాయఁగా। నాయెద
లోననిత్యమున * నాతనధర్మముఁ బూనినర్మిలిన్। బాయక కొల్తు రామసర
పాలనిరంతరసౌఖ్యదాయిసీ। తాయిసమస్తశోభనవి *ధాయిమహాఫలసిద్ధి
దాయిగన్॥ ౨౩౪

పంచమీవిభక్తివిరామము.

ఆ॥ తత్సమంబుఁ జేయుఁ* దఱిని బంచమి నన్న। నంతెనబు విభక్తు*లధ్యను
సంధి। మెలఁగుగృతులఁ బంచ *మీవిభక్తివిరామ। మనఁగ నచ్చునకును*హల్లు
చమత్కారరామాయణమునందు. [నకును॥ ౨౩౫॥

క॥ నిన్నుఁ జెఱఁగొన్న హైహయు * కన్నన్ దోర్వీర్య మెక్కు *డగుభార్గ
వులీ। లన్నిర్జించిన రాముని। కన్ననుశూరుండు ముజ్జ*గంబులగలఁడే॥ ౨౩౬

ఆదిపర్వమునందు.

చ॥ వితతమఖప్రయోగవిధి*విత్తములుత్తమధీయుతుల్జగ। న్నుతసుమహా
తపోధనుల*నుగ్రహనిగ్రహశక్తియుక్తులీ। క్రతువునబుత్విజుల్కమల*గర్భ
సమానులు పూర్వదిక్పతి। క్రతువునయాజకోత్తముల*కన్నఁబ్రసిద్ధులు సర్వ
కామసు స్వరవళులు. [విద్యలన్॥ ౨౩౭

క॥ పలుకుల తలఁగలద్వాలకు। వలనగుచోఁ బ్లుతము నిలిపి*వానికి రెండున్।
వళులుగఁ జెప్పినఁ గావ్యం। బులనదిగాకుస్వరంబు*ప్లుతవళియనగున్॥ ఆ॥ ఏక
మాత్ర హ్రస్వ*మినుమడించిన దీర్ఘ। మయ్యె మూఁడు మాత్రలైనఁ బ్లుతము। భీ
తిశోకతర్క* గీతదూరాహ్వాన। సంశయార్థములను* జరుగు బ్లుతము॥ ౨౩౮॥

భాస్కరుని రామాయణమునందు.

ఉ॥ ఏజనకాత్మజం దశర *థేశ్వరుకోడల రాము భార్యఁ జం। డోజనులార
యడ్డపడ * రోసురలార సురారికంచునం। భోజదళాక్షి శైలవన *భూములు
దాఁటుచు భీతి నేగుచో। నీజలరాశిఁ జూచి మది * నెంతదలంకెనొయేమి సేయు
మనుచరిత్రమునందు. [దున్॥ ౨౩౯॥

ఉ॥ ఎవ్వతెవీవు భీతహరి * ణేక్షణయొంటిఁ జరించెదోటలే। కివ్వనభూమి.

భూసురుఁడ * నేఁబ్రవరాఖ్యుఁడఁద్రోవదప్పితిం । గ్రొవ్వుననిన్న గాఁగ్రము
న * కుంజను దెంచిపురంబుఁ జేరనిం । కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగద * వే తెరు
వేదిశుభంబునీకగున్ ॥ ౨౪౦

శోకప్లుతమునకు రామాయణమునందు.

శా ॥ అన్నా లక్ష్మణనీన్నుఁ బుణ్యనిధినే * నజ్ఞాన నైపల్కితి । న్నన్నా పాప
మువచ్చిముట్టుకొనియె * నాపాలిదైవంబువై । యిన్నిచుఁ బరిమార్పవేఁగ బ
అతే * వేనన్ను రక్షింపువిూ । యన్నం గ్రక్కునఁ జీరవేయరుగ వే*యత్యుగ్ర శో
షుచింబునన్ ॥ ౨౪౧

తర్కప్లుతమునకు హరిశ్చంద్రోపాఖ్యానమునందు.

శా ॥ ఓరీ రాజకులాధమా నృపులు లే * రో వేఁ(?) రా రో మద । క్రూరాభీ
లమృగావళిం దునుమరో * ఘోరాటవుల్లేవొనా । యారామంబుగ లంచి జం
తుతతిమా*యం జేసి యస్మత్కుమా । రిరత్నంబులు వేడవచ్చినను వా*రిన్నొం
చినా వేమిరా ॥ ౨౪౨

శాంతిపర్వమునందు.

మ ॥ అనుమానింపక తోడఁబుట్టులనె * కాదా దున్మి తూటాడెనం । దునుం
గొన్నెత్తురులేటులై పఱవనిం * ద్రుండుగ్రతన్ దైత్యులన్ । మునులవ్వీరుభ
వింపరో క్రతువుల * మోదంబుతో నమ్మహా । త్ముని నిర్జింపరొ యూర్ధ్వలో
కమునకా*దో నాకమూహింపుమా ॥ ౨౪౩

రంగనాథుని రామాయణమునందు ద్విపదము.

అట్టినామీఁద నీ * వా యొకింగెదవు । పట్టిచెట్టలు వాపి * పాఱవై చెదను ॥

ఆనుశాసనీక పర్వమునందు.

ఉ ॥ ఆనరనాయకుండొకమ * హాధ్వరమెంతయు వేడ్కఁ జేయఁగాఁ । బూ
నిమహీసురావలికి: * బూజయొనర్పఁగఁ దానుబ్రాహ్మణుం । డైనయమా
రఁగాననలుఁ * డాతని పాలికి వచ్చినాఁ డునీ । వే నృపనీదుపుత్త్రిఁ గృప * యేర్పడ
దానముగాఁగ నావుడున్ ॥ ౨౪౪

దూరాహ్వానప్లుతము.

తే ॥ ఆదితేయార్చితాంఘ్రిప * ద్మాయనంగ । ద్వారకాపురమధ్యస*
ద్మాయనంగ । నసురకులవైరి వీరులా * రాయనంగ । రచికసిత్తాబ్జవాసులా*
కళాపూర్ణోదయమునందు. [రాయనంగ ॥

మ ॥ అకటా యేమని దూరుదాననినునా * థా వేఁగుజామయ్యెఁ బాం । దిక



గాఁ బాధములో త్తరమ్మనుటగా * నీయొంటియే మోకదా । నికటస్థోణికిఁ జేర
రమ్మనుటగా * నీకొంతనెయ్యంపుపూ । నికతోఁ గన్నులవిచ్చిచూచుటయు
కా * నీ లేదొకింతేని యున్ ॥ ౨౪౬

సంశయప్లుతము.

ఆ ॥ హరియసంగనాతఁ * డానిన్నగంసున । డంచు గృష్ణుఁడీతఁ * డాయ
శోద । కెంతభాగ్యమబ్బె * నేబోటినాబోటి । నెలఁతకట్లుగలుగు * నేతలంప ॥

రామాభ్యుదయమునందు – సుగంధివృత్తము.

అంగనాలలామఁగాన * వాలతాకుడుంగమా । తంగమాభుజంగమా
ప * తంగమాకురంగమా । లుంగమాలవంగమాతు * లుంగమాధవీనట ।
ద్భృంగమావనీరమాక * రీరమాసమీరమా ॥ ౨౪౭

విజయసేనమునందు.

ఉ ॥ వల్లభుఁడే గుదుర్లభుఁడు * వానిదెసందగులూఁదియిమ్మెయిన్ । దల్ల
డమందె దేలయుచి * తస్థితికిన్ననుఁ బాపఁ జూపినన్ । దల్లియు బంధులోకమును *
దండ్రియు నేమను వారెటింగిరె । నుల్లమునిట్లు నీకుఁదగు * నోతగదో పరికిం
చిచూడుమా ॥ ౨౪౮

రామాయణమునందు.

క ॥ జనకజకుసుమిత్రానం । దనునకుఁ బ్రణమిల్లి పముచి * తస్థితిదర్భా । సన
మునను డఁగ రఘుపతి । యనుజన్ము నిజూచి నేమ * మాజనపతికిన్ ॥ ౨౫౦

ప్లుతయుగవిశ్రామములు.

క ॥ తామేవర్ణములై నను । త్సామండలమునను బ్రాణ * మైత్రిగలిగినన్ ।
దామోదరప్లుతయుగవి । శ్రామములనఁగాఁ బ్లుతాఖ్య * రద్వయమమరున్ ॥

వజ్రపంజరశతకమునందు.

శ్రీగజగామినీమణిని * సీతనుగా నిరపాయిగాఁ ద్రిలో । కీగృహమేధిగాగ
రుడ * కేతనుఁ గాభవరోగవైద్యుఁగా । నాగురువానని న్నెమది * నమ్మితి వే
ఱొకవేల్పుఁగొల్వనీ । వేగతి కావవే రఘుప * తీశరణాగత వజ్రపంజరా ॥

వ ॥ ఈపదునొకొండునునుభయవళిభేదంబులింకఁ బ్రాసయతులెట్టివనిన ॥

గీ ॥ గీతములసీసములనుసం * గీతములను । విరతివిడనాడియొక్కొక్క
చరణమునను । రెంటికిని బ్రాసవర్ణంబు * నంటబలుకఁ బ్రాసవిశ్రాంతుల *
ద్రుకబ్బములవాని ॥ ౨౫౩

ఆ॥ దేవకీకుమార * గోవర్ధనోద్ధార । తోయజాక్షపాండ * వేయపక్ష ।
ఘనవినీలగాత్ర*మునిజనస్తుతిపాత్ర।యదుకులాబ్ధిసోమ*కదనభీమ॥ ౨౫౪

అగ్రాహ్యవిరామంబులు.

ఆ॥ వికటకవులు*వింతలుగల్పించి।కవిజనాశ్రయమునఁ*గలిపినారు । వానికై కొనంగ * వలదప్రయుక్తంబు । లేలసెప్పభీముఁ*డెఱిఁగియెఱిఁగి॥ వ॥ అవియెవ్వియనిన॥ క॥ వెలయఁగకారాదులుభూ। తలమునన్లై దైదువళులు* దామగుననుచున్। లలనామదనుఁడు రేచన। నలినభవనిభుండుగుణవ * తంసుండనఁగన్॥ ౨౫౬॥ వ॥ ఈపద్యములోఁజెప్పినయయిదువర్గములయందును మొదలివర్ణములు నాల్గింటికివర్గువల్లుగనుకఁ జెల్లుబడియవియన్ని యుదాపలఁబూర్ణబిందువులేకుండిననునాసికములకుంజెల్లవు - ఆబిందువులున్నట్టాయెనాబిందుయతులుగనుకనవిచెల్లును. ఈభేదముచెప్పనందుచేతనీపద్యమప్రగ్రాహ్యము॥ ౨౫౭

అగ్రాహ్యసంబంధవళులు.

క॥ దడలకుభేదముతెంచక। వడియునుప్రాసంబునిలువ* వచ్చునుగృతులం దదియెట్లన్ననుశ్రీహరి । తొడిబడిదానవులఁజంప*థులియాయెనన్ ॥ వ॥ ఈచెప్పినదడలకుంబదాదినున్నచతుర్థవర్గసరళమాదేశమైవచ్చునప్పుడాదేశయతిగాఁజెప్పవచ్చునదియుఁగాక యారెంటికిని దాపలించినెఱసున్నలున్నప్పుడనుస్వార సంబంధయతులుగనుక నటువలెను జెప్పవచ్చునవిగలుగఁజెప్పలేదుగాన నిది సమ్మతముగాదు॥ ౨౫౮

అగ్రాహ్యవర్ణచతుష్టయపదంబు.

క॥ యరలవలనునీనాల్గును।వరుసందమలోనవళ్లు*రయమునజెల్లున్ । ధరశషసహావర్ణంబులు।సరవినొకటికొకటిచెల్లు*హరినిభచరితా ॥ ౨౬౦

వ॥ ఈమొదలనుజెప్పినయరలవలకునాల్గిటికినిజెల్లుబడిగాదు-శషసహాలలోపలనుదొలుతటివిమూఁడును నూష్మవిశ్రాంతులుగనుకఁజెల్లును వానికి హకారముచెల్లదు ఇవి తెలియకచెప్పినకతంబున నివియు నగ్రాహ్యంబులయ్యె॥

అగ్రాహ్యభేదవర్గయతులు.

క॥ధరఁబఫబభమాక్షరములు।బరువడినీయేనుగూడ*వాతోఁజెల్లున్।సరిసంభావనవడియన।మరుదీమములేమకీర*వాణియనంగన్॥ ౨౬౧॥ వ॥పంచమవర్గాక్షరములైదింటిలోనువబలకభేదయతిగానఁప్రథమద్వితీయచతుర్థవర్ణములు వకారమునకునభేదవర్గయతులుగాన నవినిలుచునుమకారమునడవ



దు- ఇదివిచారింపక చెప్పినాఁడుగాన నిదియునయుక్తమని తెలిసికొనునది ॥ తే॥ భరితభువనార్ణవంబుతో*ప్రవంతసరియె। రమ్యమణిరాజరాజుతో*లక్కసరియె। లలితవీణారవంబుతో * ఢక్కసరియె । యనఁగఁజెల్లునభేదాఖ్య * నమరువళ్లు॥ ౨౬౪॥ వ॥ ఈమూఁటిలోపలనుభకారవకారములకు నభేదవర్గవిరతిగనుకఁ ప్రయోగింపవచ్చును-లవర్ణఢవర్ణములకును భేదవర్గయతులును గావుగావునఁ ప్రయోగింపరాదు రవర్ణమునకును లకారమునకునగ్రాహ్యంబుగాదువానికిని లక్షణవిలాసమువారు తెలియక కొన్ని యుదాహరణంబులువ్రాసినారు అవియును వివరించెద॥ ౨౬౫

నైషధమునందు.

క॥ కైలాటకాయయభినవ।లీలామకరాంకచంద్ర*లేఖాంకురచూడాలంకారపదాంబురు।హాలింగితసుఖితనిర్మ*లాంతఃకరణా॥ ౨౬౬

రామాయణమునందు.

క॥ దానవసుందరులత్తఱి। జానకినందలముమీఱఁర * సమ్మదమొదవన్। గానిలుపశారదాభ్రవి। లీనతనేపారుచంద్రలేఖయపోలెన్॥ ౨౬౭॥ వ॥ సంస్కృతమునందు రేఖాలేఖాశబ్దములు రెండునుగలవుగాననీరెండుపద్యములయందును జెప్పిన లేఖాశబ్దము మొదలిదిద్వితీయాంతస్థమని యెఱుఁగునది ॥

హరిశ్చంద్రునికథయందు-ద్విపదము.

చీఁకటివిరియించుఁ*జిఱునవ్వుపసిఁడి। రేకులతోనెది*రించుచెక్కులును ॥ వ॥ కొందఱు రేకులతోముఱాళించుచెక్కులును అనిచదువుదురు-అదివ్రాతతప్పుగాని కవిహృదయముగాదు॥ ౨౬౮

వసుచరిత్రమునందు.

శా॥ ఓలంబాలకయోలయోలయననో*లోలంచుమేలంబునన్।లోలంబాలకయోర్తుగ్రుంకిబిసవల్లుల్దున్మితూటాడికెం। గేలంబూనితటాలునన్నెగసెన * క్షీణాంబునాథాంబుజా । క్షీలోకంబుజయించివారలయశః *శ్రీఁదెచ్చుచందంబునన్ ॥ ౨౭౦॥వ॥ ఈపద్యము రెండవచరణము మొదలనులోలంబాలకయనికవిహృదయముఇటిగానకకొందఱిందిందిరశ్చంచరీకోరోలంబోలంబభరోపిచఅనియున్నదనిరోలంబాలకయనిచదువుదురు-ఇటనిరామరాజభూషణకవితలంపుగాదు॥ ౨౭౧॥క॥ నణలను రెండక్కరముల।కునువడిప్రాసంబుబెట్టు*కొనవచ్చుఁగృతిన్।వినుఅరలకిట్లపెట్టం।జనులళలకభేదమరయ*

సర్వజ్ఞనిధీ॥ ౨౭౩॥వ॥ ఈచెప్పినమూటిలోపలను మొదలఁజెప్పిననణలకునుసర సవడినికడనుజెప్పినలళలకభేదవిరతియుఁగనుక నీరెండునుగూర్పవచ్చునునడుమనుజెప్పినరజలకురయోస్తునిత్యంస్యాత్ అనిశబ్దశాసనసూత్రముకలిమిఁజేసియేకతరయతులగుటనుంగూర్పరాదుఁఅటుగాననీపద్యమునుప్రశస్తముగా

వ॥ ఇవినలువదియొక్కటియుయతిభేదంబు. [దు॥

లింకఁబ్రాసస్వభావంబెట్టిదనిన.

శబ్దానుశాసనమూలసూత్రము.

ద్వితీయోవర్ణఃప్రాసోత్రపాదపాదేషు-కించ-ప్రాసస్సర్వేషు-

చైకఏవస్యాత్.

తే-గీ॥ ప్రథమపాదద్వితీయాక్ష*రంబుప్రాస । మయ్యెఁబదబద్యములనడు* గడుగునందు । నదియురెండవవర్ణమై * యమరుసీస । గీతదండకమంజరీ * కృతులఁదక్క॥ ౨౭౪॥

ప్రాసపూర్వాక్షరనిర్ణయము.

క॥ గురులఘువులలోనెయ్యది । మురహరతొలిచరణమునకు*మొదలనిలుచుని । ధ్ధరనాపైనిడుప్రాసా । క్షరములఁబూర్వమునసదియ*కదియింపనగుౕ॥ ౨౭౫॥ఆ॥ దాసపారిజాత * వాసవావరజాత । ఘనఘనాఘనాంగ*దనుజగర్వ।భంగయనుచునిట్లు*ప్రాసాదులనుగూర్ప । వలయునొక్కభంగి*ప్రాలుగృతుల॥ ౨౭౬॥ఆ॥క్రిందజడ్డలునుబి*ఱుందబిందువులును। నూఁదిప్రాసములకు*నుండెనేని । ప్రాస్వమొకటినిడుద*యక్కరంబొక్కటి।వానిమొదలనిలుప*వచ్చునెందు॥ ౨౭౭॥ఆ॥ పక్షిరాజపక్షరాక్షసత్రుణదాత్ర । దంతిభయవిరామ * శాంతిధామ ।యింద్రనీలమూర్తి*సాంద్రపాండురకీర్తి।యనఁగఁబ్రాసమాత్ర*కాదులోప్ప॥ ౨౭౮॥ఆ॥ వేదవేద్యయసమ*వృత్తపాదములను।బ్రాసనియమరహిత*పాదములను॥ వలసినట్లుమొదలి* ప్రాలుసెప్పఁగనొప్పు । నొక్కదానగురువు*నొకటలఘువు॥ ౨౭౯

స్వస్థానార్ధసమవృత్తోపజాతివృత్తము.

క్షమాకళత్రుౕ*వనజాతనేత్రుౕ । గామేపలీశుంద్రిజ* గత్విరికాశుౕ। దమాలనీలున్నము*దారశీలుౕ । హేమాక్షవైరిన్భజి * యింతుశౌరిౕ॥ఆ॥ వారిజాతగర్భ*వాసుదేవసహస్ర ।నయనముఖ్యపుణ్య*నామయనుచుఁ।బ్రాసనియతిలేని*సీసాదిపదముల । మొదలరెండునిట్లు*గదియుచుండు॥ ౨౮౧



ప్రాసాక్షరస్వరమైత్రి.

తే-గీ॥ ప్రాసములకెల్లఁదుల్యాక్ష*రంబులైన । జాలుస్వరభేదమైనదో*షంబులేదు।చరణములకడఁగూర్చుప్రా*సములకెల్ల। నన్నియుసమస్వరంబులై*యమరవలయు ॥ ౨౮౨॥ఆ॥ సరసిజాతనేత్ర*దురితగుల్మలవిత్ర । హరితనూజమిత్ర*గరుడపత్ర। ధారుణీకళత్ర*నీరదాసితగాత్ర । యనుచుఁగూర్పవచ్చు*నచ్చులెల్ల॥ ౨౮౩॥క॥ దురితద్విపహర్యక్షా । నరకమురాసురవిపక్ష*నాళీకాక్షా ।శరధిసుతాలయవక్షా।కరినాయకరక్షహరము*ఖసురాధ్యక్షా॥ తే-గీ॥ వర్ణువయుద్విత్వమునుగల * వ్యంజనంబు । ప్రాసమైయుండునెడఁబెఱ*ప్రాసములకు । వ్యంజనంబుసమాక్షరం* బైనఁజాలు । వానిపైనేస్వరంబైనఁ*బూనవచ్చు॥ ౨౮౫॥ఆ॥ సకియపూర్వజన్మ*సుకృతఫలంబునఁ। గాకతనువిబాని*రాకృతాభుని । నిక్కృపాపమోధి*దక్కఁగఁగొనుటకు । దరమెభోజసుతకుఁ*దక్కననఁగ॥ ౨౮౬

కర్ణపర్వమునందు.

క॥ చావరునెవ్వరుపాండవు । లేవురుననినీవుసెప్ప * నిప్పలుకులుదుః । ఖావేశకరములై చే । తోవృత్తిఁగరంపఁజొచ్చె*దుర్భరభంగిౕ॥ ౨౮౭

కవికర్ణరసాయనమునందు.

మ॥ అమరీవిభ్రమరీతిలోలనయనా*హస్తాబ్జదోధూయమా। నమణీదండకచామరాగ్రపవమా*నాస్పందనాందోళన। క్రమశోభాన్నపకుంతలప్రకరముత్కర్షామయ్యెందదీ । యమ్మృదుస్పర్శసుఖోన్నతింబరవశం* బైతూగుచందంబునౕ॥ ౨౮౮॥క॥ విరమముస్వరప్రధానము।ధరఁబ్రాసమువ్యంజనప్ర * ధానమునగుటౕ । స్వరసంధిఁజెందునపుడును। బ్రరుచిరముగహల్లుదాన*ప్రాసములమ్యౕ॥ ౨౮౯॥క॥ ఆనలుబెట్టిననిలువకఁ।దానూరకయల్గియాసు*దంతినిజేరెౕ । దానవసంహరుఁడేక్రియ।చేనిఁకఁజనుదెంచునాకుఁ*జెప్పవెయనఁగౕ॥ ౨౯౦

ప్రాసభేదంబులు.

సీ॥ అర్ధబిందుసమాహ్వ*యముఁబూర్ణబిందుఖండాఖండములుసంయు*తాక్షరంబు।ధరసంయుతాసంయు* తమురేఫయుతలఘుద్విత్వవికల్పముల్*వెసనుభయము।ననునాసికప్రాస*మునుబ్రాసమైత్రియుఁబ్రాసవైరంబుస్వ*వర్గజంబు।ఋప్రాసలఘుయకా* రప్రాసములునభేదంబునుసంధిగ * తంబుననఁగ।బదియునేడుదెఱంగులఁ*బరిఢవిల్లు।బ్రాసములుపూర్వసుకవిప్ర*బం

ధముల్లను।గ్రమతలక్షణలక్ష్యయు* క్తంబుగాఁగ।దేటపఱిచెదవానిని*శౌట
దమన॥౨౯౧ సమప్రాసములు.

తే॥ పూర్వమునసర్థమైనను*బూర్ణమైన। దిగువజడ్డకక్కరంబైనఁ * దగిలి
మొదలి । ప్రాసముండినయెడసమ* ప్రాసమనఁగఁ । బిదపనన్ని యునట్లన*
గదియవలయు॥ సమప్రాసములందర్థబిందుప్రాసము. ౨౯౨

ఆ॥ వీఁకఁబ్రజ్ఞ్కిముఖుని*దాఁకికోసలవల్ల।భుఁడుబలాసురాంత*కుడుసె
లంగ।నవనిఁగూల్చెనసుట*నర్థబిందుప్రాస । మిట్లుగూర్పవలయు*నెల్లకడల॥

పూర్ణబిందుప్రాసము.

క॥ పొందింపవలయునెల్లెడ। బృందావనచారిపూర్ణ*బిందుప్రాసం।బిందీ
వరాక్షిభీష్మక । నందనఁజేకొనియెనంద * నందనుఁడనఁగన్॥౨౯౪॥ నిడుపు
లునరసున్నలుదమ । కెడమనుగలకచటతపల*కిలఁబ్రాసములై ।దొడరును
నిర్బింధువులొ। క్కెడఖండాఖండసజ్ఞ * నినశశినయనా॥ ౨౯౫

ఆదిపర్వమునందు.

క॥ వీఁకఁబఱతెంచినల్లడ।దాఁకినఁగడునతిగిఘోర*తరశరహతిన। మ్రూఁ
కలువిరియఁగనర్జునుఁ। డాకరముననేసెనుగ్రుఁ*డై రణభూమిన్॥ ౨౯౬

విరాటపర్వమునందు.

క॥ నాకోఱఁతదీర్చివచ్చితి।నీకొఱఁతయయింకనూతు*నిద్దెగఁజూడ। న్లో
కమువంచింపఁగఁదగు।చీఁకటిరెయొదవెనేమి*సేయుదొచెపుమా॥ ౨౯౭

ద్రోణపర్వమునందుసీసపాదము.

మ్రూఁకలువిరియించి * వీఁకనాచార్యాదియోధుల కెల్లను * నొక్కదెనసు॥

రుక్మాంగదచరిత్రమునందు.

ఉ॥ ఓకరుణాకలాపవిక * చోత్పలలోచనయిప్పుడియ్యెడన్।గాకులుచం
పకుండననుఁ* గైకొనిగాచినసీకృపాగుణం।బేకలిగెన్వసింపఁదగు*నేతొలిపు
ట్టువునందుభర్తపైఁ। గాఁకలుసేసినట్టిఘనకల్మషముల్వినునీకుఁజెప్పెదన్॥

ఆదిపర్వమునందు-మత్తకోకిల.

తీఁగయుయ్యెలనూగుఁజల్లని*తియ్యమామిడిమోకలం।డాగుపువ్వులతే
నెసోనలఁ*దారుఁగేతకిఁజేరుఁబు। న్నాగపూగమహాగవీధుల*నాట్యముల్పచ
రించునా।భోగనాగలతాగృహంబుల *భోగముల్గనువేడుకన్॥ ౨౯౮

రామాయణమునందు-ద్విపద.

మ్రూఁగిచరించున*మ్మొకరితుమ్మెదలు। బాగొప్పఁగొప్పునఁబరగినదాని॥



వరాహమునందు.

క॥ ఆచింతామణిమునితన । పీఁచమడఁచుదాఁకనింక *బృథుఁలోభము
చే।దాఁచుకొనుఁగాకనాచే।నీచేనిఁకమోసపోవు*నేనరనాథా॥ 300

ఉద్యోగపర్వమునందు.

క॥మీఁటుగతిరథికులనునొక।నాటికివేవురవధింతు*నరుశరములునో।నా
టిపడవైచునంతకు।వేటాడెదఁబ్రతిబలంబు*వీరులనెల్లన్॥ 30౧

ఆ॥ బోటియొకతెపెండ్లి* పాటపాడఁగఁజొచ్చె।నాపరానివిరహ*తాప
మునసుఁబేసుగూర్చితాను.* బెండ్లికూఁతురుగాఁగ। గోత్రధరుఁడుపెండ్లి
కొడుకుగాఁగ॥ 30౨

ఆదిపర్వమునందు.

క॥ ఆపన్నగముఖ్యులఁదన। వీఁపునఁబెట్టుకొనిపఱచి*విపినములుమహా।ద్వీ
పములుగిరులుసకలది। శాపాలపురములుఁజూపెఁ * జనివారలకున్॥303

సంయుతాక్షరప్రాసము.

తే-గీ॥ సంయుతాక్షరప్రాసమై*జగతివెలయు।గర్గుఁడర్చించుదైవంబుఁ
భర్గుఁడనఁగఁ। బక్ష్మలేక్షణకౌనతి*సూక్ష్మమఁనగఁ।జంద్రవంశ్యుఁడుభోగదే
వేంద్రుఁడనఁగ॥ 30౪

సంయుతాసంయుతప్రాసము.

తే-గీ॥ రలలుతమక్రిందనుండఁబై * గ్రాలువ్రాలు। ప్రాసవర్ణంబులై
వానిఁ * బాసియైనఁగూడియైనను బెఱయుదు * గులనునిలుచు ॥తే-గీ॥
పాఁడిద్రచ్చఁగనిమ్మునా * తంద్రికృష్ణ। వేడుకొనియెదనందాఁక*బండ్లుదిను
ము। దుండగపుచేష్టలుసునోటి * గాంద్రతనము.। మెండుగాఁజొచ్చెనీకునై
దేండ్లుగనుక॥ 30౬

రేఫశ్లిష్టమునకునాదిపర్వమునందు.

ఉ॥ క్షత్రియవంశ్యులైధరణిఁ * గావఁగఁబుట్టినవారుబ్రాహ్మణ। క్ష
త్రియవైశ్యశూద్రులనఁ* గాఁదగునాలుగుజాతులన్నవిచా।రిత్రముఁదప్ప
కుండఁగఁబరి * క్షితుకాచినయట్లురామమాం। ధాతృరఘుక్షితీశులుమ*
దంబునఁగాచిరెయేయుగంబునన్ ॥ 30౭॥ వ॥ మాంధాతృశబ్దముబుకా
రాంతముగను కఁదకారము క్రిందనున్నది వట్రువసుడిగాని క్రారవడిగాదు
అంచునకుఁ గవికర్ణరసాయనమునందుసీసగీతి॥ గీ॥ దానగుణశాలిభూసము

ద్ధరణదక్షుఁ । డనిశమఖదీక్షితుండువు* త్తారిహారిణ।విఖ్యాతినిరతుఁడుయు వనాశ్వ * విభుసుతుండు । ఘనుఁడుమాంధాతనృపుఁడై న * కాలమందు॥

సోమునిహరివంశమునందు.

శా॥ నాతోమార్కొ-నలేరునిర్జపురీ *. నాగేంద్రబృందారకా । రాతుల్మున్నుగ దేవసంఘములుబో * రన్ధీరసంగ్రామకుం । డీత్రైలోక్యమునందుఁ గల్గ * డురణంబెచ్చోటలేకుంటఁగాఁ । జేతుల్వేయువృథాభరంబగుచువ * చ్చెన్దైవయామేనికిన్॥ 3౧౦

దేవీవిజయమునందు.

తే ॥ వాక్త్రినేత్రాంగనాశచీ*శక్తులధిక । సంభ్రమంబునగుంభని * కుంభదైత్య । హంత్రిబూజింపుదురుత్రయీ * మంత్రములను । స్తోత్రములుచేసిమంగలా*రాత్రికలిడి॥ 3౧౧

పద్మపురాణమునందు.

క ॥ శ్రీకరచంద్రాంకితులగు ।లోకులుశుద్ధులుసుబుణ్య*లునునగుదురువా।రీక్రీడలులేకయుండిన।బ్రాకృతులనఁబతితులనఁగ*బడుదురుజగతిన్॥

లకారశ్లిష్టమునకురాఘవపాండవీయమునను.

శా॥లోకత్రాణరతిందదాదిమమహీ*లోకప్రవేశోత్థభా।పాక్లప్తప్రథమద్వితీయపదగుం* జన్మంజమంజీరగ।ర్జాకల్పామలరామభారతకథా*సర్గంబులన్మించువా।ల్మీకివ్యాసులఁగొల్చెదందదుభయ*శ్లేషార్థసంసిద్ధికిన్॥

రేఫయుతప్రాసము.

ఆ ॥ నుడులుతెలుఁగులందు * బొడమవాకై వడి। వ్రాలుకొమ్ముక్రార*ఫణులుగాన । రేఫయుతసమాఖ్య * గృతులఁబ్రాసములగు । సొరిదిఁదమకుఁదాము * నుడులఁబాసి ॥ 3౧౪ ॥ క॥సంగ్రామరంగమునఁజెల్వంబు।గ్రమ్మెచున్నసాల్వ * జగతీవరుమే। నంగ్రుచ్చిపారనాటిం । చెంగ్రుఁరాస్త్రము బునాల్గు * శ్రీకృష్ణుఁడొగిన్ ॥ 3౧౫ ॥ క॥ఈక్రారపలుకునకుమొదలై క్రాలుచుదేలిప్రాస * మగుఁదనతనకె । శ్రీక్రొమ్ముడిసౌందర్యము । వాక్రువ్వందరమెయురగ*వరునకునైనన్॥ 3౧౬

లఘుద్విత్వప్రాసము.

తే॥భువిలఘుద్విత్వసంజ్ఞికం*బులయికొన్ని।యూఁదఁబడనిక్రారలతోడ



నొకటికొకటి । ప్రాసములకగుఁదమలోన * బత్రయుగము । విద్రుచివినతాత్మజుఁడుదిక్కు-*లద్రువననఁగ॥ 3౧౭

వికల్పప్రాసములు.

గీ॥ పంచవర్గంబులను*గనుపట్టునట్టి।పొల్లులనునాసికాక్షరం* బులనుగదిసి।తమకుఁబంచమములుదృతీ* యములునగుచు । నమరుఁబ్రాసంబులకువికల్పావహ*యములు॥ 3౧౮ ॥తే॥ ప్రాజ్ఞగసమానధృతిసుధా * రుడ్నిభాస్య । స్రజ్నిచయసత్కకంఠదా * వాగ్నిపాయి । దిఙ్మహితకీర్తియుర్జున * యుగ్మభేది । వాఙ్మనోహరనుతయసు*దృఙ్మహాత్మ॥ 3౧౯

ఉభయప్రాసము.

ఆ॥ ధాత్రిబాణినీయ*సూత్రములనుదృదీ ।యోష్మమునుద్రుతంబు*నొక్క-చోటఁ । గ్రమతపాక్షరమున * కారమునై ప్రాస । ములకునుభయసంజ్ఞఁబొసఁగురెండు॥ 3౨౦

త్రైశంకోపాఖ్యానమునందు.

క॥ ఋషకేతుద్విషునకుఁగి । ల్బిషపర్వతవృషునకమృత*విషనిధిజామా।త్రిషునకుఋషిపూజితునకు।విషమాక్షునకింద్రముఖది*విజపక్షునకున్ ॥

సాంబవిలాసమునందు.

క॥ వసుధాకళత్రునకుసా । రసదళనేత్రునకుమరుద * రాతిమదతమో । విసరాంబుజమిత్రునకు । న్విషమశిలీముఖసహస్ర*నిభగాత్రునకున్॥ 3౨౧

తే-గీ॥ ప్రాణములఁబాపెనాహవ * క్షోణియందుఁ । బ్రాణవల్లభఁగొనిఛన్నదానవేంద్రుఁ । దమ్ముఁడనుదానుగిశజా * తమ్ములోడ । శరధిబంధించిదాఁటుదా*శరథియనఁగ॥ 3౨౩

ఉద్యోగపర్వమునందు.

ఉ॥ ద్రోణుఁడుభీష్ముఁడుంగృపుఁడు * ద్రోణసుతుండునుగర్ణశల్యులున్ । బ్రాణనులాసుయోధనుని * పాలివియంద్రునిజానుజన్ములు । క్షీణపరాక్రమల్బుతుల*జేయులుబాహ్లికసోమదత్తులా।స్థానునకైనసోదరువ* శంబెజయింపఁగవారినేరికిన్ ॥ 3౨౪

కాళహస్తిమాహాత్మ్యమునందు.

మ॥ ప్రణతుల్సేయుచుఁగాంచెఁగుంభజుఁడులో*పాముద్రతోఁగూడిదక్షిణ।కైలాసమునంబికాహారకృత * శ్రీపాదుకాన్యాసముకా । మణిమంత్రౌషధ

వాసముద్భవమహా * మాయావిపర్యాసము। గణనాతీతనటీవిలాసము
సమ* గ్రాసముల్లాసముఁ॥ ౩౨౫

కాశీఖండమునందు.

క॥ త్రిణయనునిరాణివాసము। నణిమాద్యైశ్వర్యవితర * ణామరతరు
వుఁ। మణికర్ణికము క్తివధూ। మణికర్ణికదలఁచెమాని* మానసవీధిఁ॥

రామాయణమునందు.

చ॥ రణమునను గ్రసాయకప* రంపరభానుకులంబరామల। క్ష్మణముజగం
బవానరము* గావిలునేర్పునుమద్భుజావిజృం। భణమునుజూపితం డ్రిమదిఁ*
బట్టినచింతదొలంగఁబెట్టిశూ। ర్పణఖకునిట్లుబాటిలిన * బన్నమునీఁగుదు
నేనవశ్యముఁ॥ ౩౨౬

మధుసేవనమునందు.

క॥ పోనుద్యోగముజేసిన। ప్రాణంబాయింకనీకుఁ* బాధేయంబీ। మానిని
మందస్మితమధు। రాననచంద్రికలు గ్రోల * యరుగుముపిదపన్॥ ౩౨౭

శృంగారషష్ఠమునందు.

క॥ అనుటయుగృష్ణద్వైపా। యనతనయుండిట్టులనియె* ననహితమతియై।
వినుమతిగుహ్యమునారా। యణకవచముభ క్తవాంఛి* తార్థప్రదముఁ॥

ఆరణ్యపర్వమునందు.

చ॥ కనకగిరీంద్రదక్షిణము * గాశశిభాస్కరతారకాగణం। బనవర
తంబుదిమ్ముఖము * హాముపిసప్తకమండలంబుతో। ననఘతదీయశైలశిఖ
రాగ్రమునందుఁబయోరుహాసన। త్రిణయనవిష్ణులుండుదురు* దేవగణంబు
లుగొల్చుచుండఁగన్॥ ౩౩౦

అనునాసికప్రాసము.

తే॥ తమకుఁదాముద్విత్వంబులై * తనరునవియుఁ। బూర్ణబిందులుడాపల*
బొరయునవియుఁ। గలసియనునాసికప్రాస* ములనుపేర। నమలమరుఁగావ్య
ములయందుఁ * దమకుఁదాము ॥ ౩౩౧ ॥ క ॥ మిన్నేఱుపాదమునఁధా। త
న్నాభినిగునుమశరునె * దంగాంచిననీ। సాన్నిధ్యముదొరకుటకై। సన్ను
తిసేయుదురునిన్ను * సనకాదులజా ॥ ౩౩౨ ॥ తమ్ములనుమల్లికాకుసు। మ
ములమరువాదిపత్ర * మాలికలనుభ। క్తిమ్మునసంహారుపూజలు। సమ్మద
మునసలుపగలుగు* సకలార్థంబుల్॥ ౩౩౩



ప్రాసమైత్రిప్రాసము.

తే-గీ॥ గట్టిబిందువుమీఁదిబ * కారమునకు। జమిలిమాప్రాసమైత్రినా*
జరుగుచుండుఁ। గమ్మతావులువెదచల్లు * సంబుజములు। శంబరారాతిచే
తివా*లమ్ములనఁగ॥ ౩౩౪

ప్రాసవైరము.

తే-గీ॥ కబ్బములురేఫమునకుఱ * కారమునకు। మైత్రిగలుగమిగఁవిశిఖా
మణులుప్రాసఁ। వైరమనుచునుగలపరు * వానినెందుఁ। గూర్తురారెండు
నెఱుఁగకఁగుకవిజనులు॥ ౩౩౫

స్వవర్గజప్రాసము.

తే-గీ॥ గ్రంథమంథశబ్దంబులఁ * గలద్వితీయ। వర్ణములురెండునున
ఘోష * వర్ణములగు। నైననిజవర్గభవచతు * ర్థాక్షరములఁ। గలఁయుబ్రా
సంబులనుస్వవ * ర్గజములనఁగ॥ ౩౩౬॥ వ॥ శ్రంథగ్రంథసందర్భేయనుధా
తువువలననుశాస్త్రి। ద్రవిణయోర్గ్రంథః-అనినామలింగానుశాసనమునందు
నానార్థవర్గములోపలను దవర్గద్వితీయాంతములయందే అమరసింహుఁ
డుచెప్పుటచేతను గ్రంథిశబ్దముతనయందురెండవ్రాయి* తవర్గమునందుద్వి
తీయాక్షరమైనను బ్రాసములయందుజతుర్థాక్షరములకుమహాకవిప్రయోగ
ములుగలుగుటంజేసిచెల్లును॥ ౩౩౭

ఆరణ్యపర్వమునందు.

ఉ॥ అంధకవృష్ణిభోజకుకు * రాన్వయభూపతులెల్లనీదెసన్। బాంధవ
సౌహృదప్రణయ* భక్తివిశేషములొప్పనీమనో। గ్రంథియడంగఁజేయునె
స * ఖ్యంబునఁబూనినవారులోభమో। హాంధులుధార్తరాష్ట్రులున * య
మ్మమెయిన్మనకుర్వియిత్తురే॥ ౩౩౮

విరాటపర్వమునందు.

ఉ॥ బాంధవశాత్రవాకలిత * భావభవాభవపాశబంధనం। బంధవిరా
మకామపరి * పక్వవివేకనిరూఢభక్తహృ। ద్గ్రంథివిభేదనాపరమ * కా
రుణికాపరిమాణదూరదుః। ఖేంధనపావకాయితస * మీక్షణశైత్యమహా
ద్భుతాత్మకా॥ ౩౩౯॥ వ॥ మంథవిలోడనే -యనుధాతువుకవికల్పద్రుమ
మునందుదవర్గద్వితీయాంతధాతువులలోనుబరిగణితమైనదిగినుకమంథశబ్ద

ములోని రెండవ వ్రాయిత వర్గమునందు ద్వితీయాక్షరమైన నుబ్రాసముల పట్ల ను బూర్వకవిప్రయోగములు గలుగుటచేతను జతుర్థవర్ణములకుఁ జెప్పవచ్చును॥ ౩౮౦

ద్రోణపర్వమునందు.

క॥ సింధురముమదోద్రేకమ। దాంధంబై వచ్చునోజ*నాచార్యునిపై।గం
ధవహసుతుండుగవయఁగ। మంధరగతినెవ్వఁడాగు*మనయోధులలోన్॥

అముక్తమాల్యదయందు.

ఉ॥ కంధరనీలవర్ణమధు*కైటభనాగసువర్ణయోగిహృ। ద్గ్రంథిభిదోద్ధన భోగివని * తాస్వనవచ్ఛనస్రవచ్ఛిర । స్పంధివసన్నిశాపతిర * సస్రుతిదుగ్ధపయోధివిచికా। మంధరకేళికాధగస*మాశ్రితపక్షికిశిరోధిసోదరా॥

వ॥ బుధ అవగమనే—అను ధాతువువలన నుబుధశబ్దములోని రెండవ వ్రాయిత వర్గమునందు జతుర్థాక్షరమైన నుబ్రాసముల పట్లను బూర్వకవిప్రయోగములు కలుగుటచేతను ద్వితీయ వర్ణములకుఁ జెప్పవచ్చును సుధాశబ్దము మొదలైనవానికి నినిటువలెనేయని తెలిసికొనునది॥ ౩౮౩

ఆదిపర్వమునందు.

ఉ॥ కాదనకిట్టిపాటియప * కారముతక్కుఁ డేకవిప్రసం। బోధనఁ జేసిచే సేన్నృప * పుంగవనీవునేకభూసురా । పాదితసర్పయాగమున * భస్మము సేయుముతక్షకాదికా । కోదరసంహతిన్ హుతవ*హోగ్రమహోగ్రశిఖాచయంబులన్॥ ౩౮౪

నృసింహపురాణమునందు.

క॥ వేదములాదిగఁ గలయ। ష్టాదశవిద్యలకునీవ*స్రష్టవృత్తి। దోర్భద్రకులు
నుభవదాజ్ఞా। పాదకులుసమస్తధర్మ*పాలనచతురా॥ ౩౮౫

విరాటపర్వమునందు.

క॥ ముదమొదవరమ్యహర్మ్యము।తుదినిలువుననిష్టసఖుల*తోడవిహారా।
స్పదమగునెలవునమెలఁగెడు । సుధేష్ణతజ్జాలకములఁ*జూచెంబ్రీతిన్॥

ద్రోణపర్వమునందు.

క॥ వింధ్యాద్రిప్రాలెనాప్రతి ।వింధ్యుఁడచలితోగ్రమూర్తి*వెలయునిలిచిగ
ర్వాంధ్యమలరఁగనుదీప్తా । వంధ్యాస్త్రములక్కుమారి *వరుసైఁబఱపెన్॥



విరాటపర్వమునందు.

ఉ॥ ఎండకువానకోర్చితన*యిల్లుప్రవాసపుచోటనాకనా । కొండునలంగుదున్నిదుర * కుందతి దప్పెనుడప్పివుట్టెను । కండనునెట్లకోయనకఁ* గార్యముగల్గినవేళ నేలినా। తండొకచాయఁజూపినను * దత్పరతంబని సేయుటొప్పగున్॥ ౩౮౭

ఋప్రాసము.

తే॥ గీ॥ స్వరములెల్ల నుబ్రకృతిభా* వంబులందు । రావెనుకవ్రాలయ గురుస్వ * రంబొకండు । తగుయణాదేశమున రేఫ * మగుటఁ జేసి । ప్రాసములకట్లయగువళి*పట్లగాదు ॥౩౮౯॥ క॥ ధారుణిఋప్రాసమునం । గారేఫాక్షరమునకుఋ * కారముచెల్లున్ । నారికినైనాకకుజం। బాఋభుపతిఁ గెలిచి తెచ్చె*నచ్చుతుఁడనఁగన్॥ ౩౫౦

ఆరణ్యపర్వమునందు.

క॥ ఆఋషిపుత్రుడుఁ గట్టిన।నీరలు మృదులములునవ్య*శిషములుమనో।హా
రులునాతనిపృథుకటి। భారంబుననొక్కకనగ * పట్టముద్రేలున్॥ ౩౫౧

లఘుయగారప్రాసము.

గీ॥ ప్రకృతిభావంబుఁ జెందిన*ప్రాణములకు। మొదలియంతస్థములుప్రాసములకునిలుచు।నఱమఱలు లేక లఘుయకా * రాహ్వయములు। నాయుజుని తండ్రిఫణిరాజ * శాయియనఁగ॥ ౩౫౨

కళాపూర్ణోదయమునందు.

ఉ॥ ఏదొమెడనెన్నడుంగనని * యింపులుగుల్కెడుగద్దశ్వనం। బాయతమైనకౌతుకము * నచ్చుతముస్మొలపింపనెయ్యదె । ద్దీయిదిచాలగ్రొత్తబళి* యింకొకమాటకొక నొక్కమాటటం ।చాయలనీలవేణినల*కాధిపసూనుఁడు వేఁడెవేఁడినన్॥ ౩౫౩

అభేదప్రాసము.

తే॥ రేఫమునకుబైనుండుమా * తృకకుబెద్ద । శాయభేదాహ్వయప్రాస*మైయెసంగు । ఖలజనవిపక్షజలరుహ * దళనిభాక్ష,। కాళియోరగమదవన * కేళియనఁగ॥ ౩౫౪

రాజశేఖరునిచరిత్రమునందు.

శా॥ కేళీకాంచనసౌధవీధికలచ* క్కిన్ దొట్లలోఁ బెట్టియో। ప్రాలేయాచలకన్యకాధవకృపా* పారంగతానిద్రవ్రొ। వేలావణ్యపయోనిధీయనుచు

నావిర్భూతమోదంబుతో । జోలల్పాడుమురక్కుమారకునకుఙ్ * శుద్ధాంత కాంతామణుల్॥ ౩౫౫

రామాభ్యుదయమునందు.

ఉ॥ పాలునునీరు నేఱుపఱు*పంగలమావుల వేగవీథివా । హ్యాళియొనర్చునే యలికు*లాలకతాసితవర్ణయయ్యునే । బాలసువర్ణదేహమున* భాసిలునాన లుమోము వెల్బుఁ బ్రో । యాలుఁ బ్రవీణమామకమ * హాకృతినాథుఁ గృతా ర్థుఁ జేయుతఙ్॥ ౩౫౬॥ త్వే॥ పెద్దళాకునుదనకునభేదమగుట। లళలకునభేదమట్ల ను* గలుగుకతన। క్షితినిమూఁడవసరళంబు*యతులఁ బ్రాస। ములనులఘ్వల ఘులకార*ములకునిలుచు॥ ౩౫౭

ప్రభావతీప్రద్యుమ్నమునందు.

క॥ జడనిధియను తెరమఱుఁగటు। వెడలినిలిచినట్టియాట* వెలఁదియపోలెఙ్। గడునింపులుగులుకుచువన । రెడుపురలక్ష్మియవధ*రించి తెయధిపా॥

భీష్మపర్వమునందు.

క॥ కొడుకులుదానునుగుజ్జపు । దడములుకరిఘటలుభటర * థవ్రాత ములుం। బుడమిచలింపఁగ ద్రుపదుఁడు। గడువేడుకఁ దోడుసూపెఁ * గౌర వ్యులకుఙ్॥ ౩౫౯

నైషధమునందు.

చ॥ చిలుకల్మగూయునోచెవులు*చిల్లులువ్రావఁగనంచు నెన్నడు। వ్వెడల డునందనోపవన*వీథులకై యటమాళిభాగని। మఙలశశిరేఖచేయునప*రా ధమనఙగజదైత్యశాసనుం । గొలువఁడుపాకశాసనుఁడు *కోమలినీదెసఁగూ ర్మియెట్టిదో॥ ౩౬౦

కూర్మపురాణమునందుదోఁటకవృత్తము.

తాలిమిదూలిన*తాపసపత్నుల్ । వ్రీడమనంబున * వీడ్కొనిజాఱుఙ్ ।లో లమదాలస * లోచనపఙ్క్తిఙ్ । జాలదలిర్చిరి*శంకరులీలఙ్॥ ౩౬౧

సంధిగప్రాసము.

తే॥ సంధిగూడినప్రాలుపారి * సంబులైన । నవియెసంధిగతాఖ్యల*న మరుచుండు । దివిజులాశ్చర్యమొందఁగా * రివడవైచెఁ। జెంగిపోసీకమధుర లో*నంగరినన॥ ౩౬౨

తృతీయాశ్వాసము.

శల్యపర్వమునందు.

క॥ కవదొనలునుగాండీవము । నవలనిడంబనుపుముంద*రరదముడిగుమే। నువిదపడిగియెదశుభకర । మవునివ్విధమిట్లు సేయు * మనుఁడునతండుఙ్॥

కళాపూర్ణోదయమునందు.

శా॥ ఆవాలుంగనుదోయియానగు మొగం * బాగుబ్బపాలిండ్లపెం । పా వేణీభరమాతనూవిలసనం* భాయొప్పలేఁ జెప్పినం । గైవారంబగుఁగాదెకే వలశిరః*కంపంబుగల్పించియా । హావృట్టింప దెయిక్షుధన్వునకున * య్యబ్జా క్షినీక్షించినఙ్॥ ౩౬౪

విరాటపర్వమునందు.

శా॥ సింగంబాఁకటితోఁగుహాంతరమునఙ్ * జేట్పాటుమైనుండిమా । తంగస్ఫూర్జితయూథదర్శనసము * ద్యత్క్రోధమైవచ్చునో। జంగాంతారని వాసఖిన్నమతినస్మత్సేనపై వీఁడెవ । చ్చెంగుంతీసుతమధ్యముండుసమర * స్థేమాభిరామాకృతిఙ్॥ ౩౬౫

లకారప్రాసము-కాకుత్థ్సవిజయమునందు.

శా॥ మారుండద్భుతశంఖమొక్కటినిసం* పాదించిదోర్మధ్య। కస్తూరీచ ర్చనెపంబువందనదుకే * ల్దోపఙసువర్ణత్వరే । ఖాలిప్సఙశశికత్రిజాపసతిఁ డు * త్కంఠోద్ధుఁడై చేరనిం। పారఙబట్టుటదోఁచెఁదద్గళముకే * శాఘుంబు మోముంగనఙ॥ ౩౬౬॥ వ॥ ఈపద్యములోను రేఖాలిప్సననుచోటరథరభస్యే యనుధాతువువలనఁబుట్టినది లిప్సాశబ్దముగనుక సంధిగతప్రాసమాయెను॥

అప్రశస్తప్రాసము.

ఆ॥ అప్రశస్తములగు * ప్రాసజాలములలం। కారవిస్మితములు*గావుగా నఁ। దివిరిధూర్తులైన* కవులుకల్పనఁ జేసియొప్పిదంబులనుచుఁ * జెప్పరాదు॥

వీధినాటకమునందు.

ఉ॥ కంమక కేళిసల్పెడుప్ర*కారమునంబురుపాయితక్రియా। తాండవ కే ళిసల్పెడువి* ధంబునఁ బాపరభామలేఁతనీ । రెండఁ బ్రభాత వేళరచి* యిం చెనుగుబ్బలమీఁదిహారముల్। కుండలముల్బుగుల్గదల*గోమయపిండములిం టిముందటఙ్॥ ౩౬౯

రామాయణమునందు.

చ॥ కడుకొనివేడిబాష్పములు*గ్రమ్మిపయింబడిపర్వభీతిమై। నడదుచువిన్ననై నహృద * యంబునఁబొల్పగుహారయష్టిప। య్యెదదడియంగఁగానఁబడి*యుం

చితనిర్మలరత్నభూషలఁ । దఁగుచితదృశ్యమానమణి* ధామసముజ్జ్వలభాతిదోఁపఁగన్ ॥ ౩౭౦ ॥ వ॥ ఇవిపదియేడునుఁ బ్రధాన ప్రాసంబులింకశబ్దాలంకారంబగు విశేషప్రాసంబు లెఱింగించెద ॥ సీ ॥ ప్రాసంబుసులభాఖ్య * రంబైనసులభంబు మర్లభంబై నను* దుష్కరంబు। తగ రెండుమూఁడునాఁలుగు వర్ణములపదంబుల నెల్ల నొకభంగిఁ * బొసఁగనేని । వరుసఁగావ్యములద్వంద్వప్రాసములు త్ర్యక్షరప్రాసమును జతుః * ప్రాసమునగుఁబదములఁదుదినొక్క* పగిదియక్షరములు దనరునంత్యప్రాస*మునకు నెందు॥ తే॥ బడిబడి నివర మొక్కఁడు*కడకు వెడలఁ । బలుకఁబడు నేనియదియను * ప్రాసమయ్యె। గంజలోచనయవియలం*కారశాస్త్రి । కథితములువీనినేడింటిఁ * గానవలయు॥ ౩౭౩॥

సుకరప్రాసము.

క॥ కమలదళనయనసకలా। గమవేద్యపురాణపురుష*కరుణాకరమ । ద్రమసీశప్రియతనయా। రమణయనుచుఁబలుకసుక * రప్రాసమగున్ ॥

దుష్కరప్రాసము.

క॥ దుష్కృతగిరివజ్రాయుధ । పుష్కరసదనాధినాథ*బుధనుతదవశో । చిష్కశాహరయనన్ । దుష్కరమనిదీనిపలుకు * దురుప్రాసజ్ఞుల్ ॥ ౩౭౪॥

ద్వంద్వప్రాసము.

క॥ వ్యాసమునివినుతగోపస్త్రీసముదయమానహరణ * శృంగారరసా। వాసముగనిట్లుద్వంద్వ । ప్రాసముగావ్యములఁజెప్ప * బడునెల్లెడలన్ ॥

త్ర్యక్షరప్రాసము.

క॥ తిరమగుఁద్రిప్రాసమునుం। దరమగుమురవైరిరూపు* తరుణులకుమనోహరమగుదానవులకుభీ। కరమగుతపసులకుముక్తి*కరమగుననిన్ ॥

చతుష్ప్రాసము.

క॥ ధీరుఁడుకమసీయశుభా । కారుఁడుకమలావధూటి * కామృదుహృదయా। ధారుఁడుకుమతిజనాధిక। దూరుఁడుకమలాక్షుఁడనఁజ*తుష్ప్రాసమజా॥

అంత్యప్రాసము.

క॥ తొలుతనుగురులఘువులలో । పలనెయ్యదిపదముదుదిని*బ్రాసము నకుడాఁ । పలనిల్చునదియునాల్గడు। గులకడఁబ్రాసముల మొదలఁ*గూర్పఁగవలయున్ ॥ తే-గీ॥ అంఘ్రితుదిఁద్రావాయిడాఁపలి*యక్షరంబు। గురువైనఁ బ్రాసమొక్కయ * క్కరమయగును । గాకలఘువైనవర్ణయుగ్మంబునడుచు। స్వరవిభేదంబుగాకకా* వ్యంబులందు ॥ ౩౮౦॥ క॥ నందాంగనాకుమా

రా। మందరగిరిధీరదనుజ * మదసంహారా । బృందాగహనవిహారా । కర్ణ్యాకారరాధి* కాస్త్రీజారా॥ ౩౮౧॥ క॥ గోపవధూజనమదనా । గోపాలనచతురకుంద* కుట్మలరదనా। గోపారివిజితకదనా । గోపతివాహోత్థధవళ*గోసమవదనా॥ ౩౮౨॥

అనుప్రాసము.

క॥ నందసుతపురందరముఖ । బృందారకవంద్యదాస* బృందావనగోవిందయననుప్రాసం । బదంబగునెందుఁగృతుల*యందుముకుందా॥ ౩౮౩

క॥ వడులకుఁబ్రాసంబులకును । విడువకఁజెల్లుబడులెల్ల*వివరించితిఁబాల్పడివీనిలోనసత్కవు । లొడబడికావలసినవిప్ర* యోగింపఁదగున్ ॥ ౩౮౪

వృత్తకందగీతగర్భసీసము

సీ॥ వినయసాపన్నర* విప్రభూతరమణినాథాపయోజేక్ష * ణానరాత్తవిభయదాకారహ* విర్భుగాయతరిపుప్రాణానిలాహీశ్వ* రారమేశ । విలయకాలానల* విక్రమప్రథితసాల్వగ్రావవృద్ధశ్ర* వావరేణ్య । విజయశీలాయమ*వీరకౌస్తుభధరాచక్రియశోదాత్మ * జాముకుంద॥ తే-గీ॥ కరివరదపూతనాంతక* గరుడగమన । సత్వసహితకామజనక* శంకరసఖ । కనకవసనసుందరదేహ * వనధిశయన । సనకమునివినుతచరణ* సరసిజయుగ॥ ౩౮౫॥

గర్భమత్తేభము

నయసంపన్నకవిప్రభూతరమణీ*నాథాపయోజేక్షణా । భయదాకారహవిర్భుగాయతరిపు * ప్రాణానిలాహీశ్వరా । లయకాలానలవిక్రమప్రథితసా*ల్వగ్రావవృద్ధశ్రవా । జయశీలాయమవీరకౌస్తుభధరా*చక్రీయశోదాత్మజా॥

గర్భకందము.

కరివరదపూతనాంతక । గరుడగమనసత్వసహిత*కామజనకశం । కరసఖకనకవసనసుం । దరదేహావనధిశయనస*నకమునివినుతా॥ ౩౮౬

ఆశ్వాసాంతగద్యము.

శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కామెపల్లిపుర మందిరనందనందన చరణారవిందవందనాభిలాషమనీషాప్రాభవవేంగనార్యతనూభవవిద్యావిశేషసూరాచార్యకాకు నూర్యప్పకవివర్యవిరచితంబైనయాంధ్రశబ్దచింతామణియనువ్యాకరణశాస్త్రంబునందువళిస్వరూపంబును నేకచత్వారింశత్సంఖ్యవిశ్రామంబులును బ్రాసనిర్ణయంబునుంగలవళిప్రాసపరిచ్ఛేదంబను తృతీయాశ్వాసము సంపూర్ణము॥





శ్రీరస్తు.

# అప్పకవీయము - చతుర్థాశ్వాసము.

శ్రీసహ్యప్రత్యంతో । ర్వీసంభృత్ప్రభవకృష్ణ * వేణీతటభూ । వాసైవేశ్వ రపూర్వా । శాసప్తమయోజనప్ర*సన్నమస్తే॥క॥ అవధారుశబ్దశాసను । డవనిఁగలియుగమునకాది * నారాజమహేం । ద్రవరంబునఁ జెప్పినయం ద్రవచోవ్యాకరణసూత్ర * తతిఁదెనుఁగింతుర్॥౨॥ తే-గీ॥ ఘనుఁడువాగను శాసన * కవివరుండు। మునువర్ణపరిచ్ఛేద*మునకుఁదుదినిఁబద్యలక్షణమె ల్లనే*ర్పడగఁజెప్పె సారదిసంక్షేపముగనైదు*శ్లోకములను॥

## ఆర్యావృత్తశ్లోకంబులు.

శ్లో॥ వృత్తంజాతిశ్చేతిద్వి విధంపద్యంగణైర్నిసర్గాఖ్యైః । సంబద్ధంవృత్తంస్యాదుపగణమాత్రాభిరన్వితాజాతిః ॥౧॥ శాస్త్రారపకమాత్రాంలఘో ర్ద్విమాత్రేగురోరితివదన్తి।గలౌగగలలసంజ్ఞౌగ్లోహగణోలఘుగురూలగోవ గణః ॥౨॥ గత్రితయంలత్రితయంమనసంజ్ఞావాద్యమధ్యమాన్త్యగ్నాః।గు రువశ్చేద్భజసగణాలఘువ్రాయదియరత సంజ్ఞికాఃక్రమతః ॥౩॥ మిత్రౌనగ లావింద్రానలనగసలభరతాశ్చంద్రామలఘుః । రలరగతలతగనవనహాభల భగసలల నలల నగగసవసహాః ॥౪॥ దీర్ఘస్సంయుక్తాద్యః పూర్ణానుస్వార పూర్వవర్ణశ్చ।ఏతేగురవశ్శేషాస్సర్వేలఘ్వక్షరాఇతిజ్ఞేయాః॥ ౫

వ॥ ఈశ్లోకంబులైదునుందొమ్మిదిసూత్రంబు లయ్యెనవిమెల్ల నింబువివ రించెద ॥ఆ॥ సకలభాషలందు * ఛందంబుదెలియక । పద్యములురచింపఁ* బాడిగామిఁ । దద్విధంబెఱుంగఁ * దగుఁగావ్యములుసేయు । తలఁపుగలిగి నట్టి*ధన్యమతులు॥౫॥మ॥ హరభక్తుండగుభీమసత్కవిననం*తామాత్యునిం బెద్దన । ద్వరునిందాతనఁగాచిరాజుబసవ*ప్పనైభరవుస్సీరిధరుం । బరమో త్సాహమునందగందలఁచిచె* ప్పంబూనితిన్వారిచే । తరచింపంబడునట్టిఛం దములచం*దంబెల్లనందంబుగార్ ॥౫॥క॥ భువినీఛందముఁదెలియక । కవి త్వమురచింతుననుచుఁ* గడగుటలెల్లర్ । వివరింపనీతనేరక। తవిలియమున దాఁటిపోవఁ*దలచుటగాదే॥ ౬



## ఛందఃప్రభావము.

తే-గీ॥ ఆదిమూలస్వరూపుఁడై *నట్టివేద । పురుషుఁడాఱుప్రధానాంగ* ములవెలుంగు । వానినెఱిఁగింతుఁజేదిభూ * నరకృతాంత । తంగెడాహ్వ యదేశమ*ధ్యమనిశాంత ॥౭॥ తే-గీ॥ శిక్షనాసనిరుక్తంబు * చెవులుఛంద మంఘ్రియుగ్మంబుకల్పంబు*హస్తయుగము । జ్యోతిషమునేత్రయుగళంబు* శబ్దవిద్య।సురుచిరాననమామ్నాయ*పురుషునకును॥౮॥తే॥ వేదములకుఁబా దంబులై*వెలయుకతన । ఛందమన్నిటిలోఁ బ్రశ*స్తంబుగాదె । పురుషుఁ డఖిలాంగయుతుఁడయ్యుఁ* జరణయుగము । లేకనడవసమర్థుఁడే * లోక మునను॥౯॥క॥ ఛందస్సూత్రంబులచే।తందఁగఁగూర్పంగఁబడిక*దావాక్యమ ణుల్ । చెందుజతుర్దశవిద్యా । సుందరహారంబులైయ * జనిసతిగళముర్॥

## ఛందోవ్యాపకసంప్రదాయము.

తే॥ అట్టిఛందంబునందిదా*నందెముందు । శివునిచేనంతనొక్కని* చేత నొకరు । వడసిరిసనత్కుమారకుం * భజగృహస్ప । తీంద్రవాసుకిపింగళా* హిప్రముఖులు ॥౧౧॥క॥ కరుణనుబింగళకాకో । దరపతివెసజెప్పెమాని* దానవవిద్యా। ధరనిర్జరగంధర్వా । ప్సరోభుజగయక్షసిద్ధ* సాధ్యులకెల్లర్॥ వ॥ తత్స్వరూపంబెట్టిదనిన॥క॥ ప్రేమమునబ్రహ్మగాయ । త్రీమహిమగ్రం థకథిత*దివ్యచ్ఛందో । నామములింకనుదెలిపెదఁ । గామెపలీపురనివేశ* కంసవినాశా॥ ౧౩

## అనుష్టుప్ఛ్లోకత్రయము.

శ్లో॥ ఉక్తాత్యుక్తాతథామధ్యాప్రతిష్ఠాన్యాసుపూర్వికా । గాయత్ర్యుష్ణిగనుష్టుప్చబృహతీపఙ్క్తిరేవచ ॥౧॥ త్రిష్టుప్చజగతిచైవతథాతిజగతీమతా। శక్వరీచాతిపూర్వాస్యాదష్టి రత్యష్టిరేవచ॥౨॥ ధృతిచ్చాతిధృతిశ్చైవకృతిః ప్రకృతిరాకృతిః । వికృతిస్సంకృతిశ్చైవతథాభికృతిరుత్కృతిః॥ 3

## పదవిభాగ గద్యము.

ఉక్తా – అత్యుక్తా – మధ్యా – ప్రతిష్ఠా–సుప్రతిష్ఠా- గాయత్రీ–ఉష్ణిక్– అనుష్టుప్–బృహతి–పఙ్క్తిః–త్రిష్టుప్–జగతీ–అతిజగతీ–శక్వరీ–అతిశక్వరీ– అష్టిః–అత్యష్టిః–ధృతిః–అతిధృతిః–కృతిః-ప్రకృతిః–ఆకృతిః–వికృతిః–సంకృ తిః–అభికృతిః – ఉత్కృతిః ఏతానిషడ్వింశతిఛందోనామాని ॥ క॥ యదుతి లకకామెపలిపుర । సదనాయివియిదువదాఱు * ఛందంబులకుర్ । మొద లుగానివరుసవెంబడి । సదములనామములువీని*జనుఁదెలియుంగార్॥ ౧౪

ఇతిహాసాదిస్వరూపము.

ఆ॥ కవితయనుచు నొకటిఁ గల్పించివాల్మీకి । చెలఁగి రామకథర * చించె మొదల । నతనిఁ జూచి చెప్పి * రామీఁదికవులెల్లఁ । గామెపల్లి గోప * కామినీశ॥

వ॥ అదియెట్లనిన.

తే-గీ॥ ఎఱుకుమును క్రౌంచమిథునంబు * నేయఁగాంచి । వగచి వాల్మీకిదాఁ బల్కు * వాక్యములును । బద్యమైనను నేర్చిచె * ప్పంగఁదొడఁగె । బూర్వరామాయణమునాఁడు * పుట్టెఁ గవిత॥ క॥ వినుమితిహాసముగావ్యము । ననద్వివిధంబయ్యెఁ గవిత * యందితిహాసం । బనుపమ చాతుర్యపురా । తనవృత్తంబయ్యె భార * తంబది యకదా॥ ౧౬॥ క॥ ఫుషమునిగవిచేఁ జెప్పం । బడునది కావ్యం బటంచుఁ * బలుకుదురార్యుల్ । తొడిబడనది యొకదాయి । ప్పుడు రామాయణమనంగ * భూనుతచరితా॥ ౧౭॥ ఆ॥ ద్వివిధమయ్యెఁ గావ్య * మవని సంగీతసా । హిత్యసంజ్ఞలనుమ * హేంద్రవంద్య । సప్తతాళభవము * సంగీతమాజయ । దేవకావ్యమదియె * పోవచింప ॥ ౧౮॥ మ॥ ధరసాహిత్యము గద్యపద్యములనం * దా రెండుభేదంబులై । పరగు నన్గద్యమునందుఁ బాదనియను * ల్భావింపఁగా లేవువా । క్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువనొ * ప్పంగావ్యుఁ డెంతేనియుఁన్ । మరుతండ్రీ మఱిదీని కేవచననా * మంబయ్యె నాంధ్రింబునన్॥

గద్యము॥ శ్రీవిలాసినీవక్షోరుహాద్వయగిరిదుర్గసర్వాధ్యక్ష – పద్మజాండానేకభరణదక్ష – దక్షజామాతృధాతృప్రథమవిశాలనేతృప్రముఖ – నిఖిలబర్హిర్ముఖప్రస్తూయమానశుభశీల – ధరణీతనూజాదిదైత్యకాలకాలయవనజరాసుతప్రభృతిదుష్టక్షితిపతినిగ్రహోపాయపారీణ – సౌందర్యవిజితారవిందబాణ – బాణాభిధానపూర్వగీర్వాణేంద్రసహస్రబాహుదర్భాస్తంభసునిశితకుఠార – ద్వారకాపట్టణవిహార – హారాంగదవలయమకరకుండలకిరీటాద్యశేషభూషణభూషితగాత్ర – భూమిధరారాతిపుత్రమిత్ర – మిత్రకుమారకాంతికకాంతారాంతరలతానిశాంతసంచరణసముల్లాస – యోగీంద్రహృదయపయోజవాస – వాసవరత్నాభ – వారిజనాభ – నాగారిస్యందన – సందగోపనందన – కరుణాలవాల – కాంచనచేలఁ భుజగేంద్రశయన ఆర్తరక్షణపరాయణ – గోవింద – ముకుంద – నమస్తే నమస్తే నమస్తే॥

వ॥ అనియివ్విధంబున గద్యరూపంబుగా నాదిమధ్యాంతశూన్యుండును సకలసద్గుణసంపన్నుండును సజ్జనాసన్నుండును – భవబంధమోచనుండును – బంకజలోచనుండును – గామెపల్లినివాసుండును నను చు గోపాలు బాలువి



నుతించు జనంబులకు ధర్మంబు కరతలామలకంబు – అర్థంబు ముంగొంగుబంగారంబు – కామంబు తంగేటిచెట్టునం బెట్టినజుంటితేనియపేర – మోక్షంబంగణంబునంగల వేల్పుటావిదినిశ్చయం బనివిపశ్చిద్వచనంబులు ప్రచురంబులై వెలయుచుండు॥ ౨౩॥ తే॥ క్రొంగను నిషాదుఁ జేయఁగ * న్గొనిన వాము । లూరు భవునిశ్లోకంబుల * కారసహిత । మైకదిశ్లోకమయ్యెఁ బ * ద్యబునండ్రి । దానిగొండఱు నాల్గుపా * దములకలిమి॥ ౨౪

శబ్దానుశాసనమూలసూత్రము.

ఆర్యావృత్తశ్లోకము.

వృత్తంజాతిశ్చేతిద్వివిధంపద్యం గణైర్నిసర్గాఖ్యైః । సంబద్ధంవృత్తంస్యాదుపగణమాత్రాభిరన్వితాజాతిః ॥ తే॥ పాదనియమంబుగలయట్టి * పద్యశమితి । వృత్తములు జాతులు ననఁ * ద్వివిధమయ్యె । నిట నిసర్గగణంబుల * వృత్తములగు । జాతులుపగణమాత్రల * జరుగుచుండు॥ ౨౫

ప్రథమప్రత్యయోద్ధారణక్రమము.

క॥ అత్యాశ్చర్యములగుష । ట్ప్రత్యయములు దాననైన * ప్రస్తారాఖ్యా । ప్రత్యయమువలనగణములు । దైత్యాంతక తెలియఁ జెప్ప * దనదెట్లన్నన్॥

శబ్దానుశాసనమూలసూత్రము.

శాస్త్రారపకమాత్రాంలఘోర్ద్విమాత్రేగురోరితివదన్తి ॥ క ॥ భరితేందిరకామెపలీ । పురమందిర యొక్కమాత్ర * భువిలఘువునకున్ । గురువుద్విమాత్రాయుతమిా । యొరపువలనరెండులఘువు * లొకగురువునకున్॥ ౨౬

తే॥ మహిని లఘువులునిడుపులు * మరుశరముల । వైఖరిని వ్రాయసగురుల్ * వానిరెట్టి । యగుటరెండేసి రేఖలుఁ దిగువకొనలు । గలయఁగాఁ గ్రొన్నెలలభంగి * నిలుఁపదగును॥ ౨౭॥ క॥ సమవృత్తప్రస్తార । క్రమమిది వ్రాయుక్తమొదలు * గానెన్నవఛం । దమువలయునన్నిగురువులు । కమలాప్రియయడ్డచాలు * గానిడిపిదసన్ ॥ ౨౮ ॥ ఆ॥ బంతిబంతిమొదల * భాసిల్లుగురువెందు । దానిక్రిందలఘువు * దానికుడిని । బైకిసమము వాము భాగోర్వగురువులు । నయ్యెసర్వలఘువు * లైనదనుక ॥ ౩౦॥ తే॥ ఇటులవ్రాయంగనే ఛందమ * షెన్ని బంతు । లన్ని సమవృత్తములు దాని * యందుబుట్టె । బంతియొక్కొక్కసరి వృత్త * పాదగణము । లయ్యె నాలుగుపదముల * నవియె నిలుచు॥ ౩౧

ఇంపుసరుఁడీక॥ ప్రస్తారప్రత్యయమనఁగా నిస్నవఛందంబున నెన్నిసమవృత్తంబులుపుట్టును – వానిలోపలనెన్నోవృత్తంబునకు నేమేమిగణంబులనియడి

గినసరి చెప్పెడువిధము । వారెన్నవఛందముననడిగిననన్ని గురువులడ్డపఙ్క్తిగానుప్రాసిప్రస్తరించునది–అదియెట్లనిన–ఆబంతికి మొదలనెక్కడగురువుండునో దానిక్రింద లఘువుప్రాయునది – ఆలఘువునకువలపటనుమీఁదనుగురువుండిన గురువునులఘువుండిన లఘువునునిలుపునది–యేదియులేకుండిననేమియుప్రాయక యూరకయుంచునది ఈబంతినిముందుగాప్రాసినలఘువునకునెడమదిక్కననుమీఁదనుగురులఘువులలోపలనేదియున్నను। దానిక్రిందనుగురువేనిలుపుచునచ్చునది మీఁదనునేదియు లేకుండినఁగ్రిందనుప్రాయంబనిలేదు–ఇప్పుడుప్రాసినక్రమముననేక్రిందిబంతిచూచియాక్రిందనుదిరుగాఁదిరుగాబంతినిఅన్నిలఘువులునచ్చినదనుకప్రసర్తించిఅన్ని బంతులనులెక్కబెట్టఁగానెన్నియవునియాఛందమునననన్ని సమవృత్తములుపుట్టినవనునది యెన్నవవృత్తమడిగిననన్నవబంతినున్న గురువులులఘువులుగణములు చేసి–ఆవృత్తమునకు నొకపాదమునకునవిగణములని చెప్పునది–నాలుగుచరణములకును–ఆగణములేనిలుచునని తెలిసికొనునది। ఇరువదియాఱుఛందములకునుప్రస్తరించుక్రమమీలాగుననేయనియెఱుంగునది॥ ౩౫ క॥భూమినిసర్గోపగణ।స్తోమము వివరింతువినుము*సురరిపుభీమా।కామెపలీపుటభేదన।ధామానుగుణాభిరామ*దైవలలామా॥౩౬॥క॥ఉక్తాత్యుక్తలమధ్యలవ్యక్తంబగునాప్రతిష్ఠ*యనుగణముల్।సూక్తిమయములై పుట్టెను।భక్తపరాధీనకామెఁపలిపురపాప॥

నైసర్గికగణములు.

ప్రథమచ్ఛందోజాతగణములు.

క॥గాయన్న నొక్కగురువగు। లాయనఁగాఁ ధాత్రి నొక్క * లఘునామంబౌ।నీయక్షరములుగణముల।పై యోగంబైనఁగలయ*బలుకగవలయున్॥

ద్వితీయఛందోజాతగణంములు.

శబ్దానుశాసనమూలసూత్రము.

గౌలౌగగలసంజ్ఞౌగ్లౌహాగణోలఘుసూలగోవగణః॥ క॥ గగమాయె రెండుగురువులు। లగమునువగణంబునయ్యె * లఘువునుగురువున్। జగతినిలఘుయుగ్మములల। మగురుగురువులఘువుగలము * హాగణంబునగున్॥ ౩౯॥

తృతీయచ్ఛందోజాతగణంములు.

శబ్దానుశాసనమూలసూత్రము.

గత్రితయంలత్రితయంమనసంజ్ఞావాద్యమధ్యమాన్త్యగ్నాః। గురువశ్చేద్భజసగాః లఘుర్యాయదియరతసంజ్ఞకాఃక్రమతః॥ తే॥ మూఁడుగురువులులఘువు



లు * గూడినమన।లాదిమధ్యాంతములగురు*లైనభజస। లవియెలఘ్వక్షరములైన * యరతలయ్యెఁ। గ్రమముదప్పక నెనిమిది * గణములకును॥

ఉపగణోత్పత్తిప్రకారము-శబ్దానుశాసనమూలసూత్రము.

మిత్రౌసగలావింద్రానలనగసలభరతాశ్చంద్రామలఘుః॥
రలరగతలతగనవనహాభలభగసలలనలలనగగసవసహాః॥

క॥ ద్వివిధంబయ్యెనుగణచయ।మవనినిసర్గములునుపగ*ణాలియుననఁగా। నిపినైసర్గగణంబులు। రవిశక్రశశాంకులివిధ*రణినుపగణముల్॥ తే॥ గరిమనత్యుక్తమొదలుగాఁ*గలుగునట్టి।మూఁటరెండేసిబంతులు*మొదలవిడిచి। మొదలలఘువున్నబంతుల *మొదలలఘువు।వెండియునునిల్పరవిశక్ర * విధుగణములు॥ ౪౨॥వ॥దీనికిఁదెలివిడి॥అత్యుక్తయనురెండవఛందముప్రస్తరించిననాలుగుబంతులుపుట్టును–మధ్యయనుమూఁడవదిలిఖించిననెనిమిదిచాళ్లవును నాలవదిప్రాసినఁబదాఱువీథులునిలుచును–ఈమూఁడుఛందములయందును మొదలివి రెండేసిబంతులువిడిచిమిగిలినవీథులలోనేవీథిమొదలనులఘువుండిన నాలఘువునకుమొదలను మఱియునొక్కొక్కలఘువునిలుపునది- ఇటువలెనుప్రస్తరించియొక్కొక్కచాలునఁగలగురులఘువులుగణములుచేసినఅత్యుక్తయందలి రెండుబంతులవియుసూర్యగణములవును-మధ్యయందలి ఆఱుచాళ్లవియు నింద్రగణములవును – ప్రతిష్ఠయందలిపదునాలుగువీథులవియుఁజంద్రగణములవును॥౪౪॥క॥నగణంబుగురువునగమగు। నగణముతుదిలఘువుగదియ * నలమనఁబరగున్। నగణముపైగగముండిన। నగగంబగుమఱియునుపగ*ణములిట్లొప్పన్॥ ౪౫

క॥హానలరగణములనఁగాఁ।జనునింద్రగణములుభరత*సలనలనగముల్। పనివడిజాతులయందివి। కనఁబడునక్కరలు మొదలు*గాశశిసొచ్చున్॥ క॥భలభసురుతలతగములును। మలఘురలరగములునేడు*మఱినవనహాలున్। నలలనగగములునాల్గును। సలలసవహములుమూఁ *డుచంద్రగణంబుల్॥

గురులఘువర్ణనియమము.

క॥ గురువుపరమేశ్వరాకృతి। యరయలఘువుగిరికుమారి*కాకృతిగణముల్। పరికింపఁగఁదత్ప్రకృతులు। మురహరగణములకులక్ష్య * ములువర్ణంబుల్॥

శబ్దానుశాసనమూలసూత్రము.

దీర్ఘస్సంయుక్తాద్యఃపూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ।
ఏతేగురవశ్శేషాస్సర్వేలఘ్వక్షరాఇతిజ్ఞేయాః॥

క॥ ఇలజమిలియక్కరములకుఁ। బలుసున్నకునెడమనూఁది * పల్కెడు వర్ణం।బులుఁజాపిపలుకునవియును। లలిగురువులుకడమలిఘులు * లఘువుల ఘూరీ॥౪౯॥క॥ వినుతన్వంగీయనిప। ల్కినమూఁడునుగురువులయ్యె * గిరిజ యనుచుఁబ।ల్కినమూఁడులఘువులయ్యెను। దనరులిఘుల కెల్లనిట్లు*దనుజవి భేదీ॥౫౦॥ తే॥ కొమ్ము క్రారలుమఱిద్వివ*ర్ణమ్ములగుట। వానియెడమవిగురు వులు* వట్రుసుడులు। ప్రాణములుగానవానిఁడా * పలనుగల్కు। నక్కర ములెల్లలఘువులు * నిక్కముగను ॥౫౧॥ ఆ॥ వ్యంజనాక్షరంబు * లందుఁ గ్రిందటిద్విత్వ।లైనవట్రుసుడులు * నైత్వములును। వానిఁగూడియున్న*స్వ రములుకానిజ। డ్డక్కరములుగావు*యజ్ఞరూప॥౫౨॥ఆ॥ అనృతపదృశమ గుమ*హావృజినంబును। బిత్రుసమర్చఁబోలు * నతిసుకృతము। నమృతసిం ధుశాయి*సముఁడగుదైవంబు। గలుగఁడనఁగలత్య*ములుముకుంద॥౫౩॥ఆ ఆంధ్రకృతులమాట* కాదివర్ణముక్రింద।నూఁదఁబడనిజడ్డ*లుండెనేని।వాని యెడమనున్న * వ్రాలనందునఁగూర్చి। గురువులనుచుగణము * గూర్పవల దు ॥౫౪॥ తే॥ భవవినుతనామవ్రజాధామ * ప్రథనభీమ। కంజదళనేత్రస్తుతి పాత్ర*త్స్మోకళత్ర। శౌరిప్రధ్వస్తవైరిభ్రా* జత్కిరీట। హారకేయూరయనఁ గలత్యంబులయ్యె॥

సర్వగణలక్ష్యంబులు.

క॥ ఇలఁబద్మాయనగగమైపొలుచురమాయనినవగణ*మునులగమునునై। వెలయుగిరియనఁగలలమగు। లలిలక్ష్మీయనంగనగుగ*లముహగణంబుల్॥ క॥మయరసతజభనగణములు।భయమునఁబింగళుఁడుదొల్లి*పక్షీంద్రునితో।రయమునఁబల్కినమాటల।పయిపొల్లులడంచఁజెప్ప। బడునెనిమిదియుల్॥ వ॥అవియెయ్యవియనినమాగూకామ్ ॥ వరాహాయ్- కాగుహార్- వసుదాస్-సాతేకృత్ - కదాసంజ్ - కింపిదభ్ - నసహన్-అనియెడునీయెనిమిదివాక్యంబులయందునొక్కొక్కదానికిమొదలనుండెడుమూఁడక్షరంబులకునైనగురులఘువులకు నాలవదియగుపొల్లుగణ సంజ్ఞాక్షరంబనివియద్దంగా తరంగిణీరంగదుత్తుంగభంగ శృంగారసంగతోత్తుంగదయాపాంగసుధాగసైకపావనాంగుండగు పింగళభుజంగమపుంగవుండు వేదాంగంబునందుముంగలనెఱింగించెనట్లుగావున॥౫౯॥క॥ శ్రీరామాయనమగణం। బారయఘనుఁడనఁగనగణ * మగుమధ్యాప్రస్తారాద్యవసానంబుల। నీరెండునువెలయుఁగ్రమతనెఱుఁగఁగవలయుల్ ॥౬౦॥క॥ ధీరుఁడనభగణమొప్పుము। రారియనంజగణమయ్యె*ననఘాయనఁజె। న్నారుసగణంబువీనికి। నారయగురులాది



మధ్య*మాంతగతంబుల్॥౬౧॥క॥ సారదినుపేంద్రాయనినను। బరువడియగణంబువల్ల * భాయనరగణం।బరుసగగోవిందయనల్ ।ధరఁదగణముగ్రమతలఘుయు* తములీమూఁడుల్॥౬౨॥ తే॥ నరమృగాయననగమగు* నరసఖయన। దలఁకొనునలంబునరకజై *త్రాయనంగ। నగగమైతగునీగతి * జగతినింద్ర। చంద్రగణములుఘటియును * జనునుపేంద్ర॥ ౬౩

గణాధిదేవతాఫలంబులు.

తే॥ కంసమర్దనకృతిముఖ*గ్రాహ్యవర్ణ। సూత్రమునశబ్దశాసన * సూరివరుని। చేతసంక్షేపముగముసు* జెప్పఁబడిన। శుభగణములిచ్చటవచింతు* సుకవులలర॥

శబ్దానుశాసనమూలసూత్రము.

యేచశుభగణాస్త ఏవకావ్యాదౌగ్రాహ్యాః॥

కతలఁపఁగశుభఫలదాయక।ములుమంగళదేవతాక*ములునగుగణముల్। నిలుపఁదగుఁగృతిముఖంబునఁ దెలిసికవీశ్వరుఁడుపతిక * తిశ్రేయముఁగాఁ॥౬౪॥ ఆ॥ బాలచంద్రనిభము * పార్వతీవల్లభు। దాసియాఁజరించు* తఱిద్విమాత్ర। హరలఁదక్కగణము* లందెల్లమొదలను భూతిదాయిగురువుఁ* బొగడవశమె॥౬౫॥క॥ శరసన్నిభములలసజే। తరగణముల మొదలభద్ర*దాయిపలుకుచో। ధర నేకమాత్రహిమభూ। ధరనందన దాసిలఘువు*తరమేపొగడల్ ॥౬౬॥ఆ ॥గగముభూమిగణము* లగమంబుగణమును।లలమువాయుగణము * గలముపావ।కమునుమధ్యనైన*కతమునఁదత్సమా।నంబులై శుభాశు* భంబులొసఁగు ॥౬౭॥ క॥ మయరసతజభనలకుభూ। పమోగ్నవ్యనిలగగనభాను*పద్మారివృషా। హ్వయులీశులుశివజయులయ। భయబలరుద్ధసముదములు*ఫలములువరుసల్॥౬౮॥వ ॥అదియెట్లనినసథర్వణవేదముఖంబగుమగణంబువసుమతీ దేవతాకంబుగాన శివప్రదంబనిమహానాటకంబునందువిఘ్నేశోనస్సపాయాత్తనిహనుమంతుండును -సూర్యశతకంబునందు జంభారాతీభ కుంభోద్భవమని మయూరుండును - మేఘసందేశంబునందుఁగశ్చి త్కాంతావిరహ గురుణాస్వాధి కారాత్ప్రమత్తయని కాళిదాసుండును- కాలామృతమునందు - శ్రీమద్వేంకటనాయకమ్మనిమదీయాన్వయప్రభవుండగు- తిరుమలభట్టారకుండును - భారతంబునందుశ్రీవాణీగిరిజాయనివాగనుశాసనుండును- కవిజనాశ్రయమునందు-శ్రీకాంతాయని వేములవాడభీమకవియును -ఛందంబునందు-శ్రీరామాస్తనమండలీమిళితకాశ్మీరార్ద్రివక్షంబుతోననియనంతుండును -మొదలంగదియించిరి-యాజు

షామ్నా యాద్యంబగుయగణంబు జీవనదేవతాకంబుగానేజయప్రదంబని యాది కావ్యంబునందు- తపస్స్వాధ్యాయనిరతమ్మని వాల్మీకియు ప్రథమశైవ స్తవంబునందు మహిమ్నఃపారంతే యని పుష్పదంతుండును - సౌందర్యలహరియందుశివశ్శక్త్యాయుక్తోయని శంకరాచార్యభారతులును- తొలుతసిలిపిరి ఋక్సామంబులకుం బ్రథమంబగు రగణమాశ్రయాశదేవతాకంబుగాన లయప్రదంబనియెల్ల వారునిడనోడిరి- కవికంఠపాశంబునందు వైశ్యామసూర్యంవితనుదేయని- పల్కినకతనంబునఁ బంచత్వంబునొందె సగణంబుదహనసఖదేవతాకంబుగానభయప్రదంబనిచంచలత్వంబునొందిరి॥ తే॥ గగనమేలికగావునఁ*దగణముననుఫలముశూన్యంబటందురా*పలుకుమిథ్య। యఖిలభూతంబులందునిత్యమయినిల్చు। వ్యోమముశుభప్రదంబుగా*కొండుచెట్లు

ఆకాశమునిత్యమైనందునకు ద్వితీయస్కంధమునందు.

ఉ॥ సర్వఫలప్రదాతయును * సర్వశరణ్యుఁడుసర్వశక్తియుఙ్ । సర్వజగత్ప్రసిద్ధుఁడును * సర్వగుణుండునునైనచక్రియా । సర్వశరీరులున్విగత * సంగతిఁజెందివిశీర్యమాణులై । పర్వినచోనభంబుగతి* బ్రహ్మముదాజడకుండునెప్పుడుఙ్॥౭౫॥ తే-గీ॥ ఎల్లవారుశుభదములని*యెన్నునట్టి। గణములకువ్రాయుచేపాటి*కానిననినఁ।దజలుమంచివిగాఁవ్రాయఁదగుమహాక । విప్రయోగలక్ష్యంబులు * వెదకిపెక్క॥౭౬॥ వ॥ అవియెయ్యవియనినఁ బ్రక్రియాకౌముదియందుయేనాక్షరసమామ్నాయమనిధర్మకీర్తియు । తర్కభాషయందుబాలోపియోన్యాయనయేయని కేశవమిశ్రుఁడును । మంత్రదర్పణమునందునాధార పద్మవనఖేలనరాజహంసీమని పృథివీధరాచార్యుండును । కృష్ణవిజయంబునందుఁ బాయాదపాయాత్తని కుసుమాయుధుండును । సాహసాంకంబునందునవ్యాత్సవోయనిపరిమళుండును। కావ్యాదినిబ్రదిపాదించిరి.। మఱియు నారోగ్యంబాస్కరాదుపైతి యని మనువచనంబు గలుగుటంజేసి॥ ౭౭॥ తే-గీ॥అరయనారోగ్యకఁడైన*యరుణుఁడేలు । జగణముననెట్లురోగంబు*సంభవించుఁ । గాంతియగుఁగానిరోగంబు * గాదురుక్ప । ద్వార్థమనుచువెల్లంకితా *తప్పచెప్పె॥ ౭౮॥ వ॥ కావున శిశుపాలవధంబునందు శ్రీయఃపతిశ్శ్రీమతియని వణిజ్మాఘుండును । కిరాదార్జునీయంబునందు శ్రీయఃకురూణామని భారవియును । మణిదర్పణమునందు - దివాకరానమస్కృత్యయనియును - శాకువనామ గ్రంథంబునందు విరించినారాయణ శంకరేభ్యయనియును చప్పన్నంబునందుఁ బ్రణమ్యలోక కార్త్యారమనియును



భోజరాజీయంబునందుసునీతిశాస్త్రిసద్విద్యాయనియును । ముందరంబొందించిరి ।భగణంబుసుధాకరదేవతాకంబుగానధనప్రదంబనిశుభమపేక్షించి భారతశేషమగువిరాటపర్వము ప్రారంభించినప్పుడుశ్రీయనగౌరినాఁ బరగుననితిక్కనయును - శ్రీమద్రామాయణమునందు । రాముని శుభచరితంబుననివాల్మీకిభాస్కరుండును । యుద్ధకాండమునందులంకాదహనముపట్టుకథయుపక్రమించుచుశ్రీయుతమూర్తియైనయనియయ్యలభట్టారకుండును।నృసింహపురాణమునందుశ్రీకినిరంతరంబనిప్రబంధపరమేశ్వరుండును రుక్మాంగదచరిత్రమునందు శ్రీమయపత్రముల్ జడలుఅనిప్రౌఢకవిమల్లనయుం బ్రయోగించిరి నగణంబమృతాంధోనాథదేవతాకంబుగాన సకలభోగప్రదంబనినలోదయమునందుమహ్యాదయసదాయనికాళీదాసుండును-శివభద్రంబునందు ।ప్రణమితశిరసియనికవివరుండును- ఆరణ్యపర్వావశిష్టంబునందు- భీమకవిశాపభయంబున జయముగోర్కిస్ఫురదరుణాంశురా గరుచియనిశంభుదాసుండును । త్రిస్థలీదండకమునందువిజయనగరహేమకూటంబునన్నిల్చియునినందితిమ్మనయుంజెప్పిరదియనుంగాక॥ ౭౯॥ సీ॥ గ్రహములలోనబా*స్కరునిచందంబునఁదరులలోఁబారిజా*తంబుకరణి।ధ్మాధరంబులలోనఁ*గ్నకాద్రికైవడినదులలోజహ్నుక*న్యకవిధమున। దైవతంబులలోన*దైత్యారిచాడ్పునఁబ్రమథులలోశూల*పాణిపగిది। మృగములలోగరి*ద్వేషిబాతినిజూడవివిధవిద్యలలోన* వేదముక్రియ॥ తే-గీ॥ క్షేత్రములలోనవారణా*శీస్థలంబు। కీవినిభములలోననై*రావణంబు।రీతిగణములలోనఁజ*ర్చించిచూడ।నగణమొప్పారుశుభనిధా*నంబుగాన॥ ౮౦॥ క॥ కృతిమొదలనిలిచినప్పుడు। మతిఁదలఁపఁగనుపగణములు*మగణాదులతో । జతగూడియాఫలంబులె। పతికిచ్చురవీంద్రశీత*భానులఁమహిమఙ్॥ ౮౧

అష్టగణలక్ష్యంబులు.

సీ॥ చంద్రసూర్యాగ్నిలో*చనుఁడగుముక్కంటిమూఁడునేత్రములను * మూఁడుగురువులావిర్భవించిమ * ధ్యాఛందమునకాదియైమగుణంబయ్యె* నందువలన । జనియించెఁబ్రస్తరిం * చినఁగ్రమంబున యరసతభజనలనంగ*సప్తగణములివిమగణముఁగూడ * నెనిమిదిగణములై తనరువీనికిరూప*దైవవర్ణ॥ తే - గీ॥ కులరసస్వరదిగ్యామ * గోత్రయోనిగణభరాశిగ్రహాతదీయ*కాంతిజనక । తనయఫలములునాఁబను* నెనిమిదియును । దెలిసికృతిముఖమునఁగూర్ప*వలయుఁగృష్ణ॥ ౮౨

మగణలక్షణము.

సీ॥ అలఘుత్రయంబుకా * శ్యపముగోత్రమువన్నె పచ్చనసంతతి * పాద జంబు।ధరణిదైవంబురౌ * ద్రమురసంబుశుభంబుఫలమాదియామము*త్ప త్తివేళ । స్వరముమధ్యమముశం * బరయోనియునుదైత్యగణమునునగువృ ష*ర్క్ష్యంబుతార । వృశ్చికాఖ్యము రాశి * విపులాకుమారుండు గ్రహము వానిశరీర*కాంతియెఱుపు॥ తే-గీ॥ ప్రమథనాథునిలోచన* త్రయముజన్మ । భూమిగారాబుపట్టియం * భోగణంబు । మందిరముశంభుకోణంబు* మగ ణమునకు। దానవవినాశకామెప*లీనివేళ॥

యగణలక్షణము.

సీ॥ ఆదిలఘువుద్వితీ * యప్రహరముజన్మవేళ బ్రాహ్మ్యంబుభా*వింపఁ గులము। గౌతమగోత్రంబు * కారుణ్యమురసంబుజలముదైవమ్ముపం* చమ ముస్వరము । కపియోనమ_ర్త్యంబు* గణముపూర్వాషాఢనక్షత్రమిష్వాస* నంబుర్రాశి గ్రహముగురుసంశుత * త్కాంతిపీతాభంబు వరుణునిదిక్కని * వాసభూమి ॥తే- గీ॥ తంద్రిధరణిగణంబుసం * తానమగ్ని । దేవతాకం బుఫలమతి* భావుకంబు।హరిణవర్ణంబుతనుకాంతి * యగణమునకు।దానవ వినాశకామెప*లీనివేళ॥

రగణలక్షణము.

సీ। మధ్యమలఘువుయా * మంబుమూఁడవయదిత్రౌత్రంబుకులముర* క్తంబుఛాయ।దైవతంబుస్వరంబు* దైత్యంబుగణముదస్రముయోనిశతతా ర*జన్మభంబు । రాశికుంభమువిక * ర్తనసుతుండుగ్రహంబు ఖంజనాభం బుత* త్కాయకాంతి । శృంగారమురసంబు * కృష్ణవర్తయధీశుఁడాంగిర సముగోత్ర * మంబుగణము ॥ తే – గీ ॥ గణుతిసేయంగఁగడుపారఁగన్న తంద్రి।యనుఁగుపట్టిసకారంబు * వ్యధఫలంబు । రచ్చపట్టువాయుతాశాశ*ర గణమునకు । దానవవినాశకామెప*లీనివేళ॥ ౯౮

సగణలక్షణము.

సీ॥ గురువంత్యవర్ణంబు * ఘోరంబురసమువంశంబు పంచమము తే* జంబునలుపు । ధవుఁడుమారుతముగో * త్రంబుకౌశికమునిక్కపట్టువాయ వ్యంబు * ఫలములయము।నాకేశముగణంబు * హస్తతారకయోనిమహి షముగనరాశి * గ్రహముబుధుఁడు । వానిదేహముపీత - వర్ణంబుస్వరము గాంధారంబుయామంబు * నాలవయది॥ తే-గీ॥ యేడుచేతులుగలదయ్య* మేలునట్టి।వ్రాయిజనకుఁడుగగనదై*వత్యమూర్తి।సంభవుండెంచిచూడంగ* సగణమునకు। దానవవినాశకామెప*లీనివేళ॥ ౯౯



తగణలక్షణము.

సీ॥ అవసానమునలఘు*వాకాశమీశుఁడురసముశాంతంబుభా* ర్గవము గోత్ర । మనిలదైవత్యంబు * జనకుఁడువనజబాంధవదైవతాకుండు * నంద నుండు । జననమగ్రజముపం * చమముయామమువర్ణమసితంబుఫలముశు* భాభివృద్ధి।సౌరంబుగణముపు*ష్యమితారబస్తంబుయోనిరాశికుళీర* ముడు విభుండు॥ తే-గీ॥ గ్రహముతద్విగ్రహచ్ఛవి * తుహినశైలసన్నిభంబునిషాద సంజ్ఞంబుస్వరము । తావుదేవేంద్రభాగంబు * తగణమునకు । దానవవినాశ కామెప*లీనివేళ॥ ౧౦౦

జగణలక్షణము.

సీ॥ నడుచక్కినుండువ* ర్ణముగురువాఱవయదియామమన్వవా * యం బుక్షత్రి । యమురుదుక్కఫలముశో * ణాభంబురుచినభోగణమయ్యశీ[illegible]ంశు గణముకోడుకు । నరసంజ్ఞికంబుగ * ణంబుయోనివృషంబురెండ[illegible]గ్గుని * రిక్కరసము । వీరంబురాశికం * ఠీరవంబాత్రేయగోత్రమంబరచారి * కువ లయారి॥ తే-గీ॥ యతనిమైచాయకెంపుపూ * ర్వాశయిరవు । ఋషభసం జ్ఞంబుస్వరముత్ర * యీతనుండు । జలజబంధుఁడువేలుపు * జగణమునకు । దానవవినాశకామెప*లీనివేళ ॥ ౧౦౧

భగణలక్షణము.

సీ॥ ప్రథమాక్షరముద్విమా*త్రముకాపిలముగోత్రము త్తరంబిలవుమ* హాహారగంబు । యోనిమృగోక్షంబు * లుడురాసులుశనుఁడుఖచరమా తఁడుమల్లి* కానిభాంగుఁ । డూరుజంబుకులంబు * సూరదైవత్యంబుజనకుఁ డైంద్రముచూలు * స్వరముషడ్జ । మధిపతిజాబిల్లి * యాదితేయంబుగణం బుసప్తమముజ * న్మప్రహరము॥ తే – గీ॥ రసముహాస్యంబువన్నియ * రజ తనిభము । ఫలముధనహేమమణివస్త్ర * పశుతనూజ । పరిజనాశ్వాదిసం ప్రాప్తి*భగణమునకు।దానవవినాశకామెప*లీనివేళ॥ ౧౦౨

నగణలక్షణము.

సీ॥ఏకమాత్రలుమూఁడు*నింద్రుఁడుపతియద్భుతమురసంబునిశీశ*దైవ తాక । మారయఁదంద్రిబ్రహ్మం * దారకాధీశునిదంతావళంబుండు * తావు నెలవు । దివ్యభోగంబీగి * తెలుపువర్ణముజాతివిప్రముద్భవవేళ * వేగుజా ము । రవముషడ్జముప్రవ * రంబువాశిష్ఠంబుచుక్క రేవతిగాము * సురగు రుండు॥ తే॥ వానితేజంబుపచ్చన * యోనిగజము । రాశిమీనంబుగణము

సు*భాశనంబు । నందనుఁడు లేఁడు మధ్యను * నగణమునకు । దానవవినాశ
కామెప*లీనివేశ॥ ౧౦౫

దేవతాంకితనియమంబులు.

క॥ స్వరమును జామును దిక్కును। బరికించి సకవీశ్వరుండు*పదపద్యంబుల్।
సురనామాంకితములుగా। బరచించిన గలుగు సకల * విభవము లెపుడున్॥

స్వరకూటము.

క॥ నిరతము నిషాదముఖ్య। స్వరముల పదములు రచించు*చక్కినిదత్త। త్స్వ
రగణములె మొదలనుగూ। ర్తురు గానకళాయుగంధ * రులు భద్రేచ్ఛన్॥

యాఘకూటము.

క॥ పనివడి పద్యం బేజా। మున నురచింపంగ సలయు* మొదలను నాజా। ము
నఁబు[illegible]నగణమిడఁదగు। ఘనసీకాశప్రకాశ * కామెపలీశా॥ ౧౦౮

దిక్కూటము.

క॥ ఏదిక్కున నెలకొను గణ। మాదిని గూర్పంగబడియె*నష్టకృతికి దా। నా
దిక్కున కభిముఖమై। మోదంబునఁ జెప్పవలయు * మురనరకహరా॥ ౧౦౯

నరాంకితనియమంబులు–దగ్ధాదితారలు.

గీ॥ దగ్ధము నుజ్వలితము ధూమి*తంబు మృతము। గదయుతములగు తా
రల* గణములాది। నిడఁగ నెల్ల రువిభునకు*నిష్టసిద్ధి। గలుగ గోరెడునట్టి స *
త్కవులు కృతుల॥౧౧౦॥ వ॥ వీనిలక్షణంబంతయు ముందు రెండవపరిచ్ఛేదం
బున వర్ణధుష్టతారా నిర్ణయంబునందు విస్తరింపఁబడియెఁ గావున నదిచూ
చి తెలిసికొనునది॥ నాయక కూటంబులు.

చ॥ అలరఁగ గబ్బపుం దొరకు*నాధిగణంబునకుం గ్రమంబునన్। గులము
లు యోనిలింగములు * గోత్రములున్ మఱికాంతులున్ గణం। బులును డురాశి
ఖేటములు * బొందికలై శుభదాయకంబులై। వెలయ నరాంకితంబులుగ
విప్రవరుల్ రచియింపఁగాఁదగున్॥౧౧౨॥ క॥ కులములు నవధూవరులక్కుఁ। జతుర
తదైవజ్ఞ మణివి*చారించు[illegible]। గృతికన్యా నాయకులకు। హితమతిఁ దెలి
యఁదగు శుకవి*యువితొమ్మిదియున్॥ ౧౧౩

గణకులకూటము.

తే॥ నాథుకులమును మొదలిగ *ణంబు కులము। నొకటి గాక [illegible]లై *
యుండెనేని। భిన్నకులజాతయగు చంద్ర * బింబవదనఁ। గేలువట్టిన పగిదిదు
ష్కీర్తిఁ జెందు॥ ౧౧౪



గణయోనికూటము.

క॥ జానగు నాయకతారా। యోనియుఁ గృత్యాదిగణభ * యోనియు
వైరం। బూనక యుండ నహల్యా। జానివచనమున నెఱుంగఁ * జనుసుకవు
లకున్॥ ౧౧౫॥ తే-గీ॥ తత్తదాఖ్యముఖార్ణసం* తతికి నైన। తారకలు గావు
ఛందోమ * తంబునందు। జన్మతారకల నిబహు * జనములాడు। కతనన
వియె వచించితి * గణములకును॥౧౧౬॥ క॥ వర్ణపరిచ్ఛేదంబున వర్ణములకుఁ
గూటనిర్ణ * యంబంతయు వి। స్తీర్ణముగా మును జెప్పితిఁ। గర్ణాహితమిత్ర
దానిఁ*గని తెలియనగున్॥ ౧౧౭

గణలింగకూటము.

క॥ మొనగణమురిక్కలింగం। బును బతినక్షత్రలింగ*మును వైరముఁజెం।
దిన నాయకు ధనమెల్లను। మనుజపతి హరించుఁ బంచ * మాసంబులకున్॥

గణగోత్రకూటము.

క॥ పతిగోత్రప్రవరములో। సతతంబును బలుకఁబడిన * సన్మునిగోత్రాం।
కితములగు గణములతినిం। దితములు కావ్యాదినాడె * నేనసహాయా॥

గణకాంతికూటము.

తే-గీ॥ నాయకునిగాయమేచాయ * నలువు మీఱు। నరసితద్వర్ణము
నఁదన*రారునట్టి। గణము పద్యాదిఁ గూర్చినఁ*గలుగు శుభము। వ్యత్యయం
బయ్యెనేని దే * హంబు చెఱుచు ॥౧౨౦॥ క॥ శ్వేతము నీలము నేకము। భూత
లమున రక్తపీత * ములకు నభేదం। బైతనగు నరతనుద్యుతు। లీ తెఱఁగున దెలి
యవలయు * నిభరాడ్వరదా॥ ౧౨౧

గణదేవాదికూటము.

తే-గీ॥ గద్యపద్యాదిగణతార * కాగణంబు। భర్తృనక్షత్రగణమును*
బంధులైన। వత్సరశతం బెబ్రతుకుఁగా * వ్యప్రభుండు। మైత్రి లేకున్న నె
లకుధ * ర్మపురిఁ జేరు॥ ౧౨౨

గణనక్షత్రదూరము.

ఆ॥ ఆదిగణమురిక్క * కధిపతినక్షత్ర। మెన్నఁ బదియుమూఁటి* కెక్కుఁ
[illegible]। [illegible]మూఁడు వత్స * రంబులు కృతినేత। తక్కువైన వేగ*తనువు
విడుచు॥ గణరాశికూటము.

క॥ ప[illegible]ద్యముఖమున। గదియగణము రాశినుంచి*గణుతించిన నా।
రదనుత[illegible]భు రాశి[illegible]భ। ప్రదమై యుండంగ సుకవి * పరికింపఁదగున్॥

## గణఖేటకూటము.

క॥ మహిఁనధినాయకురాశి । గ్రహమునుగృతిముఖగణోడు*రాశిగ్రహముఁ । మిహిరేంద్రులుదమగతిలో । సుహృత్తులై యున్నసరియ * చుట్టముగాదే ॥౧౨౫॥ క॥ కొందఱుజ్యోతిశ్శాస్త్రము । పొందుపదలిభిన్న మార్గ*ములగణములకుం । బొందింతురుగ్రహములనా । చందమునకుగణముశాస్త్ర*సాధకమెందుఁ॥ ౧౨౬

## కృత్యాదిగణద్వయకూటములు.

తే॥ మొదలనుండుగణద్వయం * బునకుటెన్నఁ । జూడఁదగుయోనిలింగగ*ణోడురాశి । ఖచరతత్కాంతినైసర్గి * కరసనామ । కూటములుతొమ్మిదియునుని * శాటదమన ॥౧౨౭॥ ఆ॥ ప్రథమగణము వధువు * పైగణంబువరుండు । నగుటనాగణద్వ* యంబునకును । బొత్తుగలిగినట్టి* పొత్తంబుముంగిటఁ । గలుగువేల్పుటావు * గాదెపతికి॥౧౨౮॥ ఆ॥ తులుతనేడుకూటములు మాతృకాపరి । చ్ఛేదముననుదెలియఁ * జెప్పఁబడియెఁ । గానవానిమూని * కడమవిరెండును । వివరపఱుతునిచటఁ*గవులువొగడ॥ ౧౨౯

## గణనైసర్గికకూటము.

ఆ॥ తండ్రికొడుకులగుచుఁ * దనరారుగణములు । గలసిమెలసికృతిము*ఖమున నిలుచు । రసలనడుమఁబచ్చి*కసవువైచినమందు । నగ్నిపవనగణము * లగుటనేమొ॥౧౩౦॥ క॥ సుతజనకులుగదసినధన । యుతుఁడగుఁగృతిభర్తరెండు * నొకగణమైనన్ । గుతలాధినాయకుండగు । నితరగణద్వయముగూడ*నిలపైఁగూలున్॥

## గణరసకూటము.

క॥ మొగదలగలగణయుగమున । కగపడురసములకువైర*మగుపొత్తముభ । ర్తగళంబునఁజుట్టినపా । ముగతిందత్ప్రాణపవన* ములుభక్షించున్॥ ౧౩౨॥ తే॥ తలఁపశృంగారభీభత్స * ములకుఁబగలు । హాస్యకృపలకుఁబోరురౌ* ద్రాద్భుతముల । కధికవైరంబువీరభ* యానకముల । కీసుశాంతంబునకుఁజెల్లు * నెనిమిదియును ॥౧౩౩॥ రసములకురెంటికినిసమ । రసమైనశుభంబువైర*రససంగతిసా । ధ్వసమొకరసమైననుసం । తసమన్యరసములుగూడి* ననుముదమొదవున్॥ ౧౩౪

## ప్రశస్తకూటంబులు.

తే॥ క్షితిసురలకాఱుధాత్రీశ*పతులకైదు । వైశ్యులకునాల్గుశూద్రాంత్య* వర్ణములకు । మూఁడురెండునుశుభకరం * బులుగనెన్నఁ । జాలునని



యొసంహితలోన*శౌనకుండు ॥౧౩౫॥ తే॥ విప్రులకుగ్రహమైత్ర్యము * ర్వీపతులకు । గణవిధమువైశ్యులకురాశి*గణనశూద్ర । నీచులకుయోనితారలి*న్నింటిలోనఁ । గడుఁబ్రశస్తము లిదివృద్ధ * గర్గమతము॥ ౧౩౬

## దోషాదోషబాహుళ్యంబులు.

ఆ॥ స్వల్పదోషములును*సమధికగుణములు । నైననుత్తఫలము*లధికమగును । సద్గుణంబులిచ్చు * సప్తాశ్వపవమాన । కీలిగుణములిడవు* కృతిముఖమున॥౧౩౭॥ తే॥ గుణములవగుణములకన్నఁ*గొంచమైన । నాథునకుమెండు దుష్టగ*ణంబులొసఁగు । సోకనియక నొకింతయు * శుభగణములు । నిజఫలములనుబద్యాది * నిలిచినపుడు॥ ౧౩౮

మగణద్వయయోగమునకుయోనికూటము రెండునుహరిణయోనులేకాననేకయోనులుగనుకమంచిది॥౧॥ లింగకూటము జ్యేష్ఠప్రథమయోనిగానఁబుంలింగనక్షత్రము- రెండునుబుంలింగతారలాయెను - పోరుపుట్టినను మొదలిగణమువధువును రెండవగణమువరుఁడునుగనుక స్త్రీకిఁబుంలింగతారయయినందుచేత నాదోషముపని లేదు॥ ౨॥ గణకూటము రెండునురాక్షసగణములేకావుననుత్తమము॥ ౩॥ ఉడుకూటము మొదలిగణముతారనుండిరెండవగణముతారదనుకనులెక్కపెట్టఁబడవలయుఁగనుక రెంటికినిజ్యేష్ఠయొక్కటేఆయెను॥ ౪॥ రాశికూటము. ప్రథమగణమురాశినుండిద్వితీయగణమురాశిదనుకను నెన్నవలయుఁగనుకరెండును వృశ్చికరాసులేకాఁబట్టి సంఖ్యకుఁదొలుతటిదాయెఁగానసామ్రాజ్యము॥ ౫॥ ఖేటకూటము రెంటికినిఁగుజుఁడేకనుకమంచిది ॥౬॥ గ్రహకాంతికూటము. అంగారకుఁ డెఱుపుగనుకపాపియాయెనునా రెంటికిని బాపగ్రహమైననునతఁడొక్కడేకనుకసుఖము॥౭॥ నైసర్గికకూటము రెండునుమగణములేకనుకకుతలాధినాయకత్వము॥౮॥ రసకూటము- రెండును రౌద్రరసములేయాయెను గనుకసంతసము॥౯॥ వీనికిఁ దేరుగడ వివరము - ఉడుకూటమొకటిచెడ్డదియుఁగడమకూటములెనిమిదియుమంచివిగనుకదోషముకొంచెమునుగుణములుచాలానుగాననాదినున్నమగణముతనమీఁదమగణమునిల్చినప్పుడు దానిచ్చుశుభఫల మధికముగానుండును. మగణయగణయోగమునకు- యోనికూటము- హరిణకపులుభిన్న జంతువులుగనుకకొంత మేలు॥ ౧॥ లింగకూటము రెంటికినిబుంలింగ తారలేకనుకపోరుపుట్టును. అయిననేమి మొదలిగణమువధువుగనుక స్త్రీకిఁబుంలింగతారయయినందు చేతనునాదోషముపని లేదు॥ ౨॥ గణకూటము-రాక్షసమనుష్యగణ

ములుగనుక నాశము॥ ౩॥ ఉడుకూటము – జ్యేష్ఠకుంబూర్వాషాఢమూఁడవనక్షత్రముగనుక పదుమూఁటికిలోపలనుండుటచేతనుగృతిపతికల్పాయువు॥ ౪॥ రాశికూటము-వృశ్చికమునకుధనస్సు రెండవరాశిగనుక – నిర్ధనము అయిననేమివృశ్చికాధిపతియైనకుజుఁడునుధనురధి పతియైనగురుఁడునునన్యోన్యమత్రముగనుక నారదమతముననాదోషముపనిలేదు॥ ౫॥ ఖేటకూటము కుజగురులన్యోన్యమిత్రులుగనుక మంచిది॥ ౬॥ గ్రహకాంతికూటము కుజుఁడెఱుపుగనుక పాపియుగురుఁడుపచ్చగనుక శుభుఁడును గాగాబాఁపశుభయోగముగనుక జగడమువచ్చును॥ ౭॥ నైసర్గికకూటముప్రస్తరించునప్పుడుమగణమువలననుయగణముపుట్టుటచేతనుమగణము తండ్రియుయగణముకొడుకును గనుకసుతజనకయోగమునిధనము॥ ౮॥ రసకూటము-శాద్రకారుణ్యరసములన్యములుగనుకసుఖము॥ ౯॥ వీనికిఁ దేరుగడవివరము-గణోడుగ్రహకాంతికూటములుమూఁడునుజెడ్డవియుఁగడమకూటము లాఱునుమంచివి గనుక దోషముకొంచెమునుగుణములు చాలానుగనుక మగణముతనమీఁదనుయగణమునిల్చినప్పుడుతానిచ్చుశుభఫలమధికముగానుండును॥ ౧౦

మగణరగణయోగమునకుయోనికూటము-హరిణతురగములుభిన్నజంతువులుగనుకకొంతమేలు॥ ౧॥ లింగకూటము॥ పుంలింగస్త్రీలింగతారలుగనుకఉత్తమము॥ ౨॥ గణకూటము॥ రెండునురాక్షసగణము లేకనుకమంచిది॥ ౩॥ ఉడుకూటము- జ్యేష్ఠకుశతతారయెనిమిదవనక్షత్రముగనుక పదమూఁటికిలోపలఁగనుకకృతిపతికల్పాయువు॥ ౪॥ రాశికూటమువృశ్చికమునకుఁగుంభమునాలుగవరాశిగనుక సామ్రాజ్యము॥ ౫॥ ఖేటకూటము-కుజునకుశనిసముఁడు – ఆమందునకుభౌముఁడుశత్రుఁడు – కాఁగానుసమశాత్రవముకీడు॥ ౬॥ గ్రహకాంతికూటము–కుజుఁడెఱుపునుశనినలుపును గనుక నిద్దఱునుబాపగ్రహములేకానమృత్యువు॥ ౭॥ నైసర్గికకూటము-మగణతగణములితరగణములుగనుకమరణము॥ ౮॥ రసకూటము శాద్రశృంగారములన్యరసములుగనుకముదము॥ ౯ ॥ వీనికిఁదేరుగడవివరముఉడుఖేటగ్రహకాంతినైసర్గికకూటములునాలుగును జెడ్డవి – కడమకూటములయిదు మంచిదివిగనుకదోషములుకొంచెమునుగుణములుచాలానుగనుకఆదినున్నమగణముతనమీఁదనురగణమునిల్చినప్పుడుతానిచ్చు శుభఫలమధికముగానుండును॥

మగణసగణయోగమునకు.

యోనికూటము– హరిణమహిషములుగనుకకొంతమేలు॥ ౧॥ లింగకూటము



పుంలింగస్త్రీలింగతారలుగనుకనుత్తమము ॥ ౨ ॥ గణకూటము-రాక్షసదేవగణములుగనక నధమము॥ ౩॥ ఉడుకూటము-జ్యేష్ఠకుహస్తయిరువదినాలుగవదిగనకపదమూఁటికిఁబైనుండుటచేతనుగృతిపతికిశతాయువు ॥ ౪ ॥ రాశికూటము-వృశ్చికమునకుఁగన్యపదునొకొండవరాశిగనుకదైన్యము ॥ ౫ ॥ ఖేటకూటము – కుజునికిబుధుఁడుశత్రుఁడు – ఆసౌమ్యునకుభౌముఁడుసముఁడుకాఁగానుసమశాత్రవముగనుకకీడు ॥ ౬ ॥ గ్రహకాంతికూటము-కుజుఁడెఱుపుగనుకపాపి – బుధుఁడుపచ్చగనుకశుభుఁడు – అయిననుకూరగ్రహముతోఁగూడినపుడుతానును గ్రూరుండే - కావుననుభలద్వయయోగముగనుకమృత్యువు॥ ౭ ॥ నైసర్గికకూటము॥ మగణసగణములితరగణములుగనుకమరణము ॥ ౮ ॥ రసకూటము-రౌద్రభయానకములన్యరసములుగనుకముదము ౯ ॥ వీనికిందేరుగడవివరము-గణరాశిఖేటగ్రహతత్కాంతికూటములైదును జెడ్డవియుఁగడమకూటములు నాలుగునుమంచివిగనుక దోషములుచాలానుగుణములుకొంచెమునుగనుక మగణముతనమీఁదనుసగణమునిలిచినపుడుతానిచ్చుశుభఫలము నియ్యదు॥ ౧౦

మగణతగణయోగమునకు.

యోనికూటము – హరిణమేషములుభిన్నజంతువులుగనుకకొంతమేలు॥ ౧ లింగకూటము-పుంలింగస్త్రీలింగతారలుగనుకనుత్తమము॥ ౨॥ గణకూటము రాక్షసదేవగణములు గనుకనధమము ॥ ౩ ॥ ఉడుకూటము - జ్యేష్ఠకుంబుష్యమీనక్షత్రముపందొమ్మిదవదిగనుకపదుమూఁటికింబైనుండుటంజేసికృతిపతికిశతాయువు ॥ ౪॥ రాశికూటమువృశ్చికమునకుంగర్కటముతొమ్మిదవరాశిగానసపత్యము॥ ౫॥ ఖేటకూటము-కుజునకుంజంద్రుండుమిత్రుండునాశశికిమంగళుండుసముండును గాఁగానుసమమిత్రముగనుక భద్రము ॥ ౬ గ్రహకాంతికూటము - కుజుఁడెఱుపుగానఁబాపియుఁజంద్రుఁడు తెలుపుగనుకశుభుఁడునుగాఁగానుబాపశుభయోగముగనుకజగడమువచ్చును ॥౭ నైసర్గికకూటము - మగణతగణములితరగణములుగనుకమరణము ॥ ౮ ॥ రసకూటము - రౌద్రశాంతములుమిత్రులుగనుకశుభము॥ ౯ ॥ వీనికిఁదేరుగడవివరము ॥ రాశిగ్రహకాంతినైసర్గికకూటములునాలుగునుజెడ్డవియుఁగడమకూటములయిదును మంచివిగనుకదోషములు కొంచెమునుగుణములుచాలానుగనుకయాదినున్నమగణముతనమీఁదఁదగణమునిలిచినప్పుడుతానిచ్చుశుభఫలమధికముగానుండును॥ ౧౦

### మగణజగణయోగమునకు.

యోనికూటము - హరిణవృషభములుభిన్నజంతువులు గనుకకొంతమేలు లింగకూటము - రెంటికినిబుంలింగతారలేకనుకపోరుపుట్టును - అయిననువధూగణమునకుఁబుంలింగతారయయినందుచేతనాదోషముపనిలేదు ॥౨॥గణకూటము-రాక్షసమనుష్యగణములుగనుకనాశనము ॥ ౩ ॥ఉడుకూటము జ్యేష్ఠకునుత్తరయిరువదిమూఁడవ నక్షత్రముగనుకపదుమూఁటికిఁబైనుండుటం జేసికృతిపతికిశతాయువు ॥ ౪ ॥ రాశికూటము॥వృశ్చికమునకుసింహము పదియవరాశిగనుక దుఃఖము - అయిననేమి - వృశ్చికాధిపతియైనకుజుఁడు నుసింహాధిపతియైన సూర్యుఁడును నన్యోన్యమిత్రులుగనుక నారదమతము ననాదోషముపనిలేదు॥౫॥ ఖేటకూటము-కుజసూర్యులన్యోన్యమిత్రులుగనుకమంచిది ॥౬॥గ్రహకాంతికూటము-మంగళభానులిద్దఱును నెఱుపుగనుక పాపగ్రహములేకాఁగానుఖలద్వయయోగమునను మృత్యువు ॥ ౭ ॥నైసర్గికకూటము-మగణజగణములితరగణములుగనుకమరణము॥రసకూటము-రౌద్రవీరములన్యరసములుగనుకముదము॥౯॥ వీనికిఁదేరుగడవివరము॥గణగ్రహకాంతినైసర్గికకూటములుమూఁడును జెడ్డవియుఁగడమకూటములాఱును మంచివిగనుకదోషములుకొంచెమును గుణములుచాలానుగనుకనునాదినున్నమగణముతనమీఁదనుజగణమునిల్పినప్పుడుతానిచ్చుశుభఫలమధికముగానుండును॥

### మగణభగణయోగమునకు

యోనికూటము - హరిణభుజగములు భిన్నజంతువులు గనుక కొంతిమేలు॥౧॥ లింగకూటము-పుంలింగస్త్రీలింగతారలుగనుకనుత్తమము॥౨॥గణకూటము - రాక్షసదేవగణములుగనుకనధమము ॥౩॥ఉడుకూటము-జ్యేష్ఠకుమృగశిరపదియాఱవనక్షత్రముగనుకపదుమూఁటికిఁబైనుండుటచేతఁగృతిపతికిశతాయువు ॥ ౪ ॥ రాశికూటము-వృశ్చికమునకువృషభమేడవదిగనుకసామ్రాజ్యము ॥౫॥ఖేటకూటము॥ కుజశుక్రులన్యోన్యసములుగనుక మధ్యమము ॥ ౬ ॥ గ్రహకాంతికూటము - కుజుఁడెఱుపుగనుకపాపియు శుక్రుఁడు తెలుపుగనుక శుభుఁడునుగాఁగాఁబాపశుభ యోగముగాన జగడము ॥ ౭ ॥ నైసర్గికకూటము-మగణభగణములితరగణములుగనుకమరణము ॥ ౮॥రసకూటము-రౌద్రహాస్యములన్యరసములు గనుకముదము ౯ ॥ వీనికిఁదేరుగడవివరము-గణఖేటగ్రహకాంతినైసర్గికకూటములునాలు



లుగును జెడ్డవియుఁగడమకూటములయిదునుమంచివిగనుకదోషములుకొంచెమునుగుణములుచాలానుగనుక - ఆదినున్నమగణముతనమీఁదను భగణమునిలిచినపుడుతానిచ్చుశుభఫలమధికముగానుండును॥ ౧౦

### మగణనగణయోగమునకు.

యోనికూటము - హరిణగజములు భిన్నజంతువులుగనుక కొంతమేలు ॥౧॥ లింగకూటముపుంలింగస్త్రీలింగతారలుగనుకనుత్తమము॥౨॥గణకూటము రాక్షసదేవగణములుగనుకనధమము ॥ ౩ ॥ ఉడుకూటముజ్యేష్ఠకురేవతిపదునెకొండవనక్షత్రముగనుకపదుమూఁటికిలోపలనుండుటచేతనుగృతిపతికల్పాయువు ॥ ౪॥రాశికూటము-వృశ్చికమునకుమీనమయిదవరాశిగనుక సామ్రాజ్యము॥౫॥ఖేటకూటము-కుజబృహస్పతులన్యోన్యమిత్రులుగనుక మంచిది ॥ ౬ ॥ గ్రహకాంతికూటము-మంగళుఁడెఱుపుగనుకఖలుఁడునుగురుఁడుపచ్చగనుకశుభగ్రహముకాఁగానుబాపశుభయోగముగనుక జగడమువచ్చును॥౭॥నైసర్గికకూటము-మగణనగణములితరగణములుగనుకమరణము॥౮॥రసకూటమురౌద్రాద్భుతములునిత్యవైరములుగనుకసాధ్వసము౯॥వీనికిఁదేరుగడవివరము ॥ గణోడుగ్రహకాంతినైసర్గికరసకూటములైదును జెడ్డవియుఁగడమకూటములు నాలుగును మంచివిగనుకదోషములుచాలానుగుణములుకొంచెమునుగనుక ఆదినున్నమగణముతనమీఁదనగణము నిల్పినపుడుతానిచ్చుశుభఫలమునియ్యదు॥ తే॥ మగణమునకెల్లవ్రాసితి*మిగిలినట్టి।గణములకులిట్లువ్రాసిన*గ్రంథమధిక।విస్తరంబగుననివ్రాయ*వెఱచినాఁడఁ। దెలిసికొనఁదగుఁగవులుయా * దులకునిట్లు॥౧౬౩॥వ॥ఇవికావ్యముఖంబుననుండు రెండు గణంబులకుంగవి రాక్షసమతాను సారంబులగు గణనాథయోగఫలంబులెఱింగించెద ॥ తే ॥ అష్టగణములుశిపివిష్ట*నష్టమూర్తులయివెలింగెడుతమతమ * యధిపతులకుఁ। జెల్లుచుండెడునామంబు*లెల్లఁదాముఁ। దాల్చిఛందంబులందెల్లఁ * దనరుచుండు ॥ ఆ॥ధరణిపైధరాంబు*దహనమారుతవిష్ణు । పదరవిందుదేవ*పతులుగదియఁ।బ్రమదత్తతాప*భద్రార్థజయసౌఖ్య । శత్రునాశములుబొ * సంగువరుస॥౧౬౪॥క॥తోయము పైభూజలశిఖ।వాయుగగనసూర్యచంద్ర*వాసవులున్నన్ । శ్రేయోవ్యాధిక్లేశా।ల్పాయుర్మరణసుఖభోగ * హర్షములబ్బున్ ॥ ౧౬౫ ॥ఆ॥పేతిపైబాత్రుమీఁద * విశ్వంభరాంభోగ్ని । వాయుగగనసూర్య*వారిజారి।వృషులుగదియఁగుశల * విభవాగ్నిభయరాజ్య । శోకరోగయుద్ధ * శుభములగును॥

చ॥ అవనిజలాగ్నివాయుగగ * నార్కశశీంద్రులుడాయఁగల్గుగం। ధవహాపయిన్ స్వరాజ్యగృహ * దాహమృతార్తిగదార్థభోగముల్ । రవిపయిఖేదముద్భయపరాభవభోగమృతిస్వరాజ్యముల్ । దివిపయిఁగీర్తిశర్మలయ * దీప్తిబలక్షయభద్రయోగముల్॥ క॥ హిమకరుమీఁదనిలాంభో। గ్నిమరుద్వియదర్కసోమ*నిర్జరనాథుల్। క్రమమునవిత్తురుజ్వరభయ। సమరశుభాశుభగదార్థ *సౌఖ్యములెపుడున్॥ ౧౬౫॥ సీ॥ శర్కరతోఁగూడి*చవిగానివస్తువులెంతయుమధురమై*యొనసినట్లు । గంగోదకంబులఁ*గలసిపల్వలతోయమునుబవిత్రంబయి * తనరినట్లు । పరుసముసోఁకంగఁబడియయఃపిండంబు బంగారమైకను * పట్టినట్లు । చందనవృక్షంబు*సంగతినిర్గంధతరువునామోదియైపరగినట్లు ॥ తే॥ నిర్జరేశ్వరగణముపై * నిలిచిదుష్ట । మగుగణంబునుశుభకారి * యైమెలంగ । శోభనగణంబుగదసిన*చోటనిత్తు। దండమునఁబండుపండుచం * దంబుగాదె ॥౧౬౬ ॥ వ ॥మఱియుఁగొందఱుకవిపురందరులునిజకృతచ్ఛందంబులందుఁగొన్నివిశేషంబులుచెప్పిరవియువివరించెద ॥ తే ॥ భువనములకెల్లనాధార * భూతమైన । జగతియధిదైవతంబుగాఁ* జనుమగణము ॥ తమకుఁగారణమగుటచే*దానిగూడి। ధనమొసఁగునేడుననిపల్కెఁ* దాతనెజ్జ ॥౧౬౭॥ తే॥ చందనోదకములనుని*చ్చలునుబెంపఁ । బడియువెల్లులితనకంపుఁ * బాయనిగతి । శుభగణముగూడియునునిజ*శూన్యఫలముతగణముత్యజింపదనియెన * ధర్వణుండు॥ ఆ॥ఇదిగణప్రపంచ * మింకనీగణముల । చేతఁగూర్పఁబడుచుఁజెల్వమీఱు । వృత్తముల తెఱంగు*విదితంబుగాఁగష।ట్ప్రత్యయములు తేట*పఱుతు మొదల॥ ౧౬౮

## షట్ప్రత్యయములు.

తే ॥ వృత్తసంఖ్యయుఁబ్రస్తార*విధమునష్ట । లబ్ధియునువెసనుద్దిష్ట*లఘుగురుక్రి। యాధ్వభాగములనఁగబ్ర * త్యయములారు । వెలయువానిఁగవీంద్రులు*దెలియవలయు ॥ ౧౬౯

## వృత్తసంఖ్యాప్రత్యయము.

ఉ ॥ ఇన్నవదాననెన్నిజని *యించినవృత్తములన్నధాత్రిపై।నన్నిగురుల్లిఖించియొకఁ * డాదిగనిబ్బడిహానిక్రిందటన్ । సన్నుతలీలవ్రాసితుది*సంఖ్యలురెట్టిగఁజేయనెన్నియా। నన్నియొదానియందుదయ * మానసమవృత్తములన్నఁజెన్నగున్ ॥ ౧౭౦ ॥ తే ॥ ప్రత్యయములాఱనిచెప్ప*పద్యములను। దెలిసికొననెంతవారికి * నలవిగామి । వరుసనన్నింటికిండీక * వ్రాయవలసెఁ। దెనుఁగుమాటలఁగడుతేట * తెల్లగాఁగ ॥టీ॥ వృత్తసంఖ్యాప్రత్యయమనఁగానిన్నవఛందమునందునెన్నిసమవృత్తములుపుట్టినవి – అనియడిగినసరిచెప్పెడివిధము వారెన్నవఛందమునకడిగిన – నన్నిగురువులడ్డ వరుసగావ్రాసివానిక్రింద నొకటి మొదలుగా ని౯మడించుచును లెక్కలువరుసవెంబడిని గడకువెడల వ్రాసితుదిలెక్కలినుమడింపఁగా నెన్నియగునోయన్నిసమవృత్తములాఛందమునందుఁబుట్టినవియని చెప్పునది॥ తే॥ అక్షరంబొక్కటియెయుక్త*కంతకంత । కవలివానికినేకోత్త*రాధికంబు । లుక్తయందెల్లసమవృత్త * యుగముపుట్టెనదియెమొదలంతకంతకు*నయ్యెరెట్టి॥

## తత్తచ్ఛందోవృత్తసీసమాలిక.

ఉక్తనుగరముల* త్యుక్తను వేదముల్ మధ్యనువసువులు * మఱిప్రతిష్ఠ। వలననురాజుల * వ్వలిసుప్రతిష్ఠను నేత్రపావకులుగా * యత్రియందు। విద్యలుష్ణిక్కున * వేదండలోచనక్ష్మలనుష్టుపునను * శాస్త్రిబాణపాణులుబృహతిని * బాదభూశరములుపఙ్క్తినిగతికరాం * బరజగతులుత్రిష్టుప్పునందుదం * తియుగాభ్రనయనముల్ జగతినంగవిరించి * గగనయుగము । లతిజగతినిలోచ * నాజభూతవసువులుశక్వరినిగతీభ* సలిలయోని । శాస్త్రికుంభినులతి * శక్వరినిగజర్తుమునిబాహురాముల * ష్టినిరసాగ్ని । సాయకభూతర * సంబులత్యష్టినిహస్తగోత్రనభోధ * రాగ్నిశశులు । ధృతియందుగతియుగ * క్షితిపక్షబాహువులతిధృతినివసుద్వి* పాక్షినిగమ । శయబాణములుకృతి * చ్ఛందంబునరసాద్రిపర్వేభవేదాభ్రి * పద్మరిపులు । ప్రకృతిని నేత్రనా * రాచసోమాహార్య గీర్వరాభ్రాక్షులా * కృతినిధాత్రు । వదనాంతరిక్షపా * వకయుగబ్రహ్మచంద్రగ్రహతుల్వికృతిని * నాగశూన్య । తర్కసింధురవసు * దహనకుంజరములుసంకృతినిరసాంబు * జాతవైరి । హస్త్రాద్రిగిరిపర్వ * తాంగోడుపతులభికృతినిబాహుకృశాను * గతియుగాస్త్రి ॥ తే- గీ॥ రతిపశరశిఖవహ్నులు* త్కృతినివేద । శాస్త్రిసామజగజనభ * శ్చంద్రశైల । రసములిట్లుద్భవంబయ్యెఁ*బ్రస్తుతింప। సమపదములగువృత్తము*ల్ఛందములను॥ ౧౭౧

టీ॥ ఇవియన్నియునుక్తాదిషడ్వింశతిచ్ఛందంబులకునుద్వితీయాదిద్విగుణితంబులై యొక్కొక్కఛందంబునంబుట్టిన సమవృత్తసంఖ్యలకుగణితశాస్త్రోక్తసంజ్ఞలుగావున జ్యోతిశ్శాస్త్రానుసారంబునఁగుడినుండి యెడమకుఁబద్యక్రమంబుననామాసంజ్ఞలులెక్కవై చియుగ్గడించినామాదిగాఁదెలిసికొనునది॥

## ఉక్తాద్యాదిజవృత్తసంఖ్య.

తే-గీ॥ ఛందమున నొక్కటను వృత్తసంఖ్యమడపి । రెండుదివియను క్తాదిజ * వృత్తసంఖ్య * యటులనుత్కృతివృత్తసం * ఖ్యయును జేయ। సర్వసమవృత్తసంఖ్యభు * జంగశయన॥ ౧౭౭॥ టీక॥ ఉక్తాదిజవృత్తసంఖ్య యనఁగాఁ బ్రథమచ్ఛందంబగునుక్త మొదలుకొనియిన్నవ ఛందమువద్దికినీవె నుకటిఛందములన్నిటియందునుబుట్టినవృత్తములు-అన్నియు నెన్నియాయె ననియడుగఁగాసరి చెప్పెడువిధము - వారెన్నవఛందమువద్ద కడిగిననా ఛందమునను బుట్టినసమవృత్తసంఖ్యయినుమడించి ఆలెక్కలో రెండుదీసి వేయఁగానెంతలెక్క నిలిచె నన్నిసమవృత్తములు మొదలి ఛందమువద్దినుం చివారడిగినదానివద్దికినాయెనని చెప్పెడిది- ఉక్తాదిషడ్వింశతిచ్ఛందంబులన న్నింటనుబుట్టినసమవృత్తములన్నియుఁగలయఁగూడ నెన్నియయ్యె ననియ డిగినసరిచెప్పెడువిధము - మునువటివలె నేకడపటిఛందమగునుత్కృతియం దుఁబుట్టినసమవృత్తసంఖ్య రెట్టించియందులో రెండుకడకుఁదీయఁగా నెన్ని ని లిచెనన్ని సమవృత్తములిరువదాఱుఛందములయందునుబుట్టినవని చెప్పునది॥

౧౭౮॥ క॥ పదుమూఁడుకోటులును నలు । వదిరెండునులక్షలవలఁ * బదియే డ్వేలుఁ । దుదినేడునూటిపైనిరు । వదియాఱు సమాంఘ్రివృత్త * పద్యములుహరీ॥ ౧౭౯॥ తే-గీ॥ అందులో నొకకొన్ని పే * రాంగమైన । ఛంద మునఁ బల్కఁబడియుండె * సంస్కృలోనఁ । గొన్ని తెనుఁగుగఁ జేసెభీ * మన్న మొదల । నవియె వెసఁ జెప్పుకొనిరసం * తాదికవులు॥ ౧౮౦

## ప్రస్తారప్రత్యయము.

సీ॥ పరగనేఛందంబు * ప్రస్తరించుమటన్న నాఛందమునఁ బుట్టి * నట్టిస ర్వ । సమవృత్తసంఖ్యకు * సమమగునందాక దొంతిగాఁ గ్రిందు క్రిం * దులను వ్రాయ । నగుమీఁదగురువును * నా క్రిందలఘువును నొప్పారఁ దొలిబంతి * నొక్కటొకటి । తరువాతనది మొద * లొప్పక రెట్టించి ఛందమెన్నవదన్ని * చాళ్లుగాఁగ॥ ౧౮౧॥ తే॥ బొడవులును నడ్డవరుసలు * పొసఁగ నిలుప । నంద నం దన వేడిన * ఛందమగును। ధారుణీమండలమునఁ బ్ర * స్తారమనుచు । దీనినా మం బెకవులచేఁ * దేటపడియె॥ ౧౮౨

టీక॥ ప్రస్తారప్రత్యయమనఁగా నిన్నవఛందంబునందుఁబుట్టిన సమవృత్తంబులకు నేయేగణంబులనియడుగఁగాసరిచెప్పెడువిధము. వారుప్రస్తరించుమనినఛందమునందు నెన్ని సమవృత్తములుపుట్టెనన్ని గురులఘువులుదొం



తరగా నొకదానిక్రింద నొకటి వ్రాయునది - అదియెట్లనిన - తొలిదొంతరకు నొకగురువును నొకలఘువును రెండవదానికి రెండుగురువులును రెండు లఘువులునుమూఁడవదానికి నాలుగుగురువులును నాలుగులఘువులును ని టువలెనే యినుమడించుచు నెన్నవ ఛందమైనన న్నినిడుపుచాళ్లుగాను నడ్డవ రుసలుసరిపోవునట్టుగాను బొడవునకును వ్రాసి - వారెన్నవసమవృత్తమున కునడిగిననన్నవయడ్డవరుసనున్న గురులఘువులు గణములు చేసియావృత్త మునకు నొకొక్క చరణమునకా గణంబులని చెప్పునది॥

## ప్రస్తారద్విగుణము.

క ॥ అందముగా నేఛందము । క్రిందమఱియునదియె నిలిపి * రెండర్ధ ములం । బొందుగ గురులఘువులకుడి। బందునఁ జెఱిసగము వ్రాయఁ * బై ఛం దము గుర్ ॥ టీక ॥ ఎదియేనియొకఛందము ప్రస్తరించియాఛందమేదానితరు వాతిదిగాను బ్రస్తరించుమనఁగాఁ బ్రస్తరించువిధము - ఆఛందము క్రిందను దిరిగియాఛందము బ్రస్తరించికుడికడను మీఁదినుంచి క్రిందు క్రిందులను నిడు పుగా సగము దనుక గురువులును గడమ సగము లఘువులును వ్రాయఁగా నామీఁదటిఛందమవును॥

## నష్టలబ్ధిప్రత్యయము.

సీ॥ జలజాక్షయిన్నవ * ఛందంబులోపల నిన్నవసమవృత్త * మెట్టిదనిన। నా వృత్తసంఖ్య దా * నందందు నర్ధించి వ్రాయంగ దిగుదాని * వైపు దెలిసి। సరిలె క్కనెడనెడ * సగముగావించు వేళల నెల్ల నొక్కొక్క * లఘువునిలిపి । విష మంబులను బోలి * వెలయ మఱొక్కటి గలిపి యర్ధముఁ జేయు * కాలములను ॥ తే ॥ గురుశుభాకారయొక్కొక్క * గురువునిడుచు । నడిగి రెన్నవఛందము * నందు వారు । దన్ను గురువులు లఘువులు * నన్నియైన । మానఁగగు నష్టలబ్ధిర * మాసహాయ॥ ౧౮౩॥ టీక॥ నష్టలబ్ధిప్రత్యయమనఁగా నిన్నవఛందంబున నిన్నవ సమవృత్తమునకు నేయేగణంబులనియడుగఁగా సరిచెప్పువిధము - వారెన్న వసమవృత్తమడిగిననన్నవలెక్కనుండి తేప తేపకును నర్ధించుకొనుచును గురు లఘువులు వ్రాయునది-అదియెట్లన్ననుసరిలెక్కయర్ధించునప్పుడు డెల్లను నొ క్కొక్కలఘువు పెట్టునది - బేసిలెక్కయైనప్పుడర్ధించుటకుఁ బాలుపోదుగ నుక మఱియొక్కటికలియఁగూడి సరిగాఁ జేసి యర్ధించుట ఒకటి కూడి యు ర్ధించు నపుడెల్లను నొక్కొక్క గురువు పెట్టునది తన్ను వారెన్నవ ఛందము లోని సమవృత్తమడిగిననన్ని యయ్యేటట్టుగాను గురులఘువులు వ్రాసి అవి

గణములు చేసి-ఆఛందమున నన్నవఛందమునకు నొక్కొక్కపాదమునకు నవిగణములని చెప్పనది॥

వృత్తోద్దిష్టప్రత్యయము.

సీ॥ తనయిచ్చవచ్చిన * ట్టును గురులఘువులు జగతిపై నడ్డచా * లుగ లిఖించి। యేఛందమునఁబుట్టె * నెన్నవసమవృత్తమిది యన్న నొక్కఁడు మొదలుగాఁగ। రెట్టించుచును వాని * క్రిందను లెక్కలు వగసదప్పక యుండ * వ్రాసి యందు। లఘువుల క్రిందివె * ల్లనుగూడి వెండియు నొక్కటిగలుపు క * యుగ్గళింప॥ ఆ॥ నైన సంఖ్య వృత్త * మది గురులఘువుల। సంఖ్య ఛందమునకు సంఖ్యయిట్లు। దెలిసి చెప్పవలయు * దీని వృత్తోద్దిష్ట। మంద్రు ప్రత్యయజ్ఞ * లంబుజాక్ష॥ ౧౮౮॥ టీక॥ ఉద్దిష్టప్రత్యయమనఁగాఁ దనమనసునకు వచ్చినట్లు గురులఘువులడ్డచాలుగా వ్రాసి ఇది యేఛందమునఁబుట్టినది- ఆఛందమునందిది యెన్నవసమవృత్తము - అనియడుగ సరిచెప్పెడువిధము - అతఁడువ్రాసిన గురులఘువుల క్రిందను వరుసకు నొకటి మొదలుకొని లెక్కలిను మడించి వ్రాసి వాటిలోపలను గురువుల క్రిందివి యన్ని విడిచిపెట్టి లఘువుల క్రింది లెక్కలన్నియుఁ గలయఁగూడి అందులోపలను మఱియొకటి కలిపిన నెన్నియాయెనో యన్నన వృత్తమనునది - అతఁడు వ్రాసిన గురులఘువు లెన్నియైన నన్నవ ఛందంబునం బుట్టినదియనుట - యిరువదియాఱింటిలోపల నెన్ని గురులఘువులు వ్రాసిననిటువలెనే వ్రాసి సరిచెప్పనది॥

లఘుగురుక్రియాప్రత్యయము.

సీ॥ రెండిండ్లు వ్రాసియా * క్రింద వెంబడి నిరుమేల నొక్కొక్కటి * మించియుండ। మొదలనుండి నిరు * వదియునా అడ్డవీధుల మర్చి రెండుకో * పులను గల్గు। గీములనన్నింట * సోముల నిడి మధ్యగృహములయందుఁ బై * యిండ్లరెంట। నిలుచు లెక్కలుగూడి * విలిఖింపనీ మేరుచక్రపార్శ్వాద్యంత * సదనములను॥ తే॥ వెలయునవి సర్వగురులఘు * వృత్తసంఖ్య। లగు ద్వితీయాది గృహముల * యందుఁ దనరు। సంఖ్య లేకాదిలఘువృత్త * సంఖ్యలయ్యె। నన్నియును వాని వృత్తసం * ఖ్యలగుఁ గృష్ణ॥ ౧౮౯॥ టీక॥ మేరుచక్రమనఁగా నిన్నవఛందమునందు నెన్నేసి లఘువుల వృత్తము లెన్నియని యడిగిన సరిచెప్పెడివిధము - మొదలనడ్డవీధిగా రెండిండ్లు వ్రాసియా క్రిందను వెంబడిగాను రెండుపార్శ్వములయందును నొక్కొక్క యిల్లు మరచియుండునట్టుగా మొదటివీధితోఁగూడ నిరువదియాఱు అడ్డవీధులుగా గీటులు తివిచి యుభయపార్శ్వములయందు మించియున్న కడపటియిండ్లను మీఁదియిండ్లు మొదలుకొని యన్ని యిండ్లను దప్పకుండ నొక్కట్లు పెట్టి మీఁదివీధినున్న లెక్కల క్రిందనుదిగువవీధియందు నిడుపుగా నొక్కొక్కయింటను నాలెక్కలకుఁ గ్రిందనుండునట్లుగా వ్రాయునది. ఇటుల వ్రాయఁగా మీఁదివీధికంటెఁ గ్రిందివీధి యొక్కొక్కయిల్లెక్కువయవుచునువచ్చును - ఈక్రమమున వ్రాయఁగా నీ మేరుచక్రమునందు బైవీధి మొదలుగా నడ్డవీధులన్నియు యుక్తమొదలైన యిరువదియాఱు ఛందములును గ్రమమున నేయవును - అవీధులయందు మొదలియిండ్లనున్న యొక్కటొక్కటియు సర్వగురువృత్తములు-తుదియిండ్లనున్న యొక్కొక్కటియు సర్వలఘువృత్తములు - రెండవ యిండ్ల నెన్నియుండినను నన్నియు నొంటిలఘువృత్తములు - మూఁడవయిండ్లవి రెండేసి లఘువులవృత్తములు - నాలవయిండ్లవి మూఁడేసిలఘువులవి. ఈప్రకారము ననేముందరను నన్నియిండ్లకునని తెలిసికొనునది - ఆవీధినినున్న లెక్కలన్నియుఁ గలయఁగూడ నాఛందమునఁ బుట్టిన సమవృత్తసంఖ్యయవును - వారెన్నవఛందమున కడిగిన నన్నవ యడ్డవీధి చూచి యిప్పుడు చెప్పినచొప్పున సరిచెప్పునది - ఏఛందము దనుకను వ్రాయుమన్నను నాఛందముదనుక వ్రాయవచ్చును॥



లగనిర్ణయశకటచక్రము.

సీ॥ ఒకమందిరంబులో * నొక్క లెక్క వ్రాసి యాదిగువ నడ్డంబిండ్లు * దిద్దుకొనుచుఁ। గ్రమతఁ బైవీధి లె * క్కలు ద్విగుణించుచుఁ దొలుసారియవి యెల్లఁ * గలుగ వ్రాసి। వెండియు రెట్టించు * వేళ నొక్కొక్కటి విడిచి వ్రాయుచు దాని * వృత్తసంఖ్య। కెచ్చైవమానుచు * నీరీతి నావృత్తసంఖ్యపజ్క్తికిఁ దొల్లి * సదనమునను॥ తే-గీ॥ నిలుచునందాక బంతులె * న్నేని వ్రాయ। శకటచక్రంబునాఁగఁ బ్ర * శస్తమయ్యె వరుస నాద్యంతములు సర్వగురులఘువులు। కడమవేకాదిలఘునియు * క్తంబులిందు॥ ౧౯౦॥ టీక॥ శకటచక్రమనఁగా నిన్నవఛందమునందు నొకలఘువాదిగా నెన్నేసి లఘువృత్తములు - ఎన్నవవెన్నవవియని యడుగ సరిచెప్పెడువిధము - వారడిగిన ఛందము వృత్తసంఖ్య నిర్ణయించుకొనుముందుగా నొక యిల్లు వ్రాసి యాయింట లెక్క యొక్కటి వైచి దాని క్రిందనుండి యడ్డముగా నిండ్లు వ్రాసికొంచు నాయిండ్లలో వానికి మీఁదనున్న యడ్డవీధియిండ్ల మొదలియిల్లు మొదలుకొని వరుస వెంబడి నొక్కొక్కయింటనున్న లెక్క సారె సారెకు నినుమడించుకొంచు

వ్రాయుచువచ్చునది - అదియెట్లనినఁ దొలుసారిద్విగుణించునపుడెంతలెక్కయైననునంతయువ్రాయునది - అది మొదలవియెన్నిమాఱులిను మడించిననొక్కొక్కటికిగడకుంబుచ్చిచిక్కిన లెక్క వేయునది-ఇటులవ్రాయనాఛందంబునంబుట్టినవృత్తసంఖ్యయెప్పుడు మించుచున్నదియోయప్పుడదివిడిచిమీఁదివీధినాతరువాతనుండునిండ్లలెక్కలొక్కటొక్కటియిప్పుడువ్రాసినటులరెట్టించుచువ్రాయునది - ఎద్దియైననువృత్తసంఖ్యకునధికమయ్యెనేనినదివిడిచి వేయునది-పైవీధిలెక్కలయ్యెనేనిసంతటనావీధినివ్రాయకమానునది ॥ ఇప్పుడువ్రాసినబంతి - లెక్కలుతొల్లింటియట్లసేయునది - ఆక్రిందమరలనిండ్లువ్రాసియయ్యిండ్లలోనిప్పటియట్లలెక్కనిలుపునది - ఇటులనొక్కొక్కబంతివ్రాయుచు రాఁగా బంతికిమొదలియింట నాఛందమునంబుట్టినవృత్తసంఖ్యయెచ్చటవచ్చిననునచ్చటినుంచివ్రాయకమానునది-ఈతీరునవ్రాయనేయింటవచ్చినలెక్కరాకవచ్చును-ఇదేశకటచక్రమనిపించుకొనును ఈచక్రమున మొదలిబంతిదిసర్వగురువృత్తము-కడపటిబంతియెంతయుండిననుఅన్నవయదిసర్వలఘువృత్తము రెండవబంతియింటనెన్నియున్నననన్నియునొంటిలఘువృత్తములు-మూఁడవయడ్డవీధినినెన్నియున్ననునన్నవయవి రెండేసిలఘువులవృత్తములు - నాల్గవచాలుననెన్నియున్ననునన్నవయవి మూఁడుమాత్రలుగలవృత్తములు -ఈచక్రమునముందరనెన్నిబంతులున్నను రెండవబంతి మొదలుగాబంతిబంతికినొక్కొక్కలఘువెక్కువయని తెలిసికొనునది.ఇండ్లన్నిలెక్కింపనెన్నియయినవ్వియన్నివృత్తములాఛందమునంబుట్టినవనియెఱుఁగునది ఈరెండుచక్రంబులం జెప్పినలఘువులుసంఖ్యలోనుదివిచివేయఁగానెన్నిమిగిలియున్నవ్వియన్నిగురువులు-ఆయావృత్తములకుంగలవుగానసీచక్రములు రెండులఘుగురుక్రియాచక్రములనియ నంబడుఁగొందఱులగనిర్ణయచక్రములునందురు॥ ౨౦౬

## అధ్వభాగప్రత్యయము.

క॥నందసుతయధ్వభాగము।ఛందస్సంఖ్యయునువృత్త*సంఖ్యయు రెంటఁ। బొంపుగగణించియొక్కటి । యంపుదిగియనెన్నియన్ని * యంగుళములగు ॥ టీక॥ అధ్వభాగప్రత్యయమనఁగానిన్నవఛందముప్రస్తరించుటకునెన్నియంగుళముబపొడవుభూమికావలెననినసరిచెప్పెడువిధము - ఎన్నవఛందమునకడిగిననంత లెక్కపెట్టి అందులో నాఛందమునఁబుట్టిన వృత్తసంఖ్యగలయఁగూడియది యిసుమండిచియందులో నొకటితివిచివేయఁగానెన్నియైనవ్వియన్నియంగుళములపొడవు భూమియాఛందమునకుఁ బ్రస్తరించుటకుఁ గావలెనని చెప్పునది. ౨౦౭



## సమవృత్తసంఖ్యాజ్ఞానము.

అయిదవఛందమునందెన్ని సమవృత్తములు
పుట్టినవనియడుగ సరిచెప్పెడువిధము.

∪∪∪∪∪

౧ ౨ ౪ ౮ ౧౬

౬
32

ఈకడపటిలెక్కపదునాఱురెట్టింపముప్పదిరెండయ్యెనదిగానయైదవఛందమునముప్పదిరెండు సమవృత్తములు పుట్టినవనిచెప్పునది. ఏఛందమునకడిగిననునిటువలెనేవ్రాయునది. ప్రస్తరించిచూడ నన్నివృత్తములే పుట్టును.

## పంచమఛందమునకుఁబ్రస్తారము.

| | | | |
|---|---|---|---|
| ∪∪∪∪∪ | ౧ | ∪∪∪∪ \| | ౧౭ |
| \| ∪∪∪∪ | ౨ | \| ∪∪∪ \| | ౧౮ |
| ∪ \| ∪∪∪ | ౩ | ∪ \| ∪∪ \| | ౧౯ |
| \| \| ∪∪∪ | ౪ | \| \| ∪∪ \| | ౨౦ |
| ∪∪ \| ∪∪ | ౫ | ∪∪ \| ∪ \| | ౨౧ |
| \| ∪ \| ∪∪ | ౬ | \| ∪ \| ∪ \| | ౨౨ |
| ∪ \| \| ∪∪ | ౭ | ∪ \| \| ∪ \| | ౨౩ |
| \| \| \| ∪∪ | ౮ | \| \| \| ∪ \| | ౨౪ |
| ∪∪∪ \| ∪ | ౯ | ∪∪∪ \| \| | ౨౫ |
| \| ∪∪ \| ∪ | ౧౦ | \| ∪∪ \| \| | ౨౬ |
| ∪ \| ∪ \| ∪ | ౧౧ | ∪ \| ∪ \| \| | ౨౭ |
| \| \| ∪ \| ∪ | ౧౨ | \| \| ∪ \| \| | ౨౮ |
| ∪∪ \| \| ∪ | ౧౩ | ∪∪ \| \| \| | ౨౯ |
| \| ∪ \| \| ∪ | ౧౪ | \| ∪ \| \| \| | ౩౦ |
| ∪ \| \| \| ∪ | ౧౫ | ∪ \| \| \| \| | ౩౧ |
| \| \| \| \| ∪ | ౧౬ | \| \| \| \| \| | ౩౨ |

పంచమచ్ఛందముప్రస్తరించిన ముప్పదిరెండువృత్తములేపుట్టెను.

ప్రతిఛందోవృత్తసంఖ్యలు.

| | |
|---|---|
| ౧ ఉక్తయందు ....... ౨ | ౧౪ శక్వరియందు .. ౧౬౩౮౪ |
| ౨ అత్యుక్తయందు ..... ౪ | ౧౫ అతిశక్వరియందు౩౨౭౬౮ |
| ౩ మధ్యయందు ....... ౮ | ౧౬ అష్టియందు ... ౬౫౫౩౬ |
| ౪ ప్రతిష్ఠయందు ..... ౧౬ | ౧౭ అత్యష్టియందు . ౧౩౧౦౭౨ |
| ౫ సుప్రతిష్ఠయందు.... ౩౨ | ౧౮ ధృతియందు . ౨౬౨౧౪౪ |
| ౬ గాయత్రియందు ... ౬౪ | ౧౯ అతిధృతియం ౫౨౪౨౮౮ |
| ౭ ఉష్ణిక్కునందు ... ౧౨౮ | ౨౦ కృతియందు. ౧౦౪౮౫౭౬ |
| ౮ అనుష్టుప్పునందు .. ౨౫౬ | ౨౧ ప్రకృతియం .౨౦౯౭౧౫౨ |
| ౯ బృహతియందు ..౫౧౨ | ౨౨ ఆకృతియం ..౪౧౯౪౩౦౪ |
| ౧౦ పఙ్క్తియందు ...౧౦౨౪ | ౨౩ వికృతియం ౮౩౮౮౬౦౮ |
| ౧౧ త్రిష్టుప్పునందు ... ౨౦౪౮ | ౨౪ సంకృతి ... ౧౬౭౭౭౨౧౬ |
| ౧౨ జగతియందు .....౪౦౯౬ | ౨౫ అభికృతి...౩౩౫౫౪౪౩౨ |
| ౧౩ అతిజగతియందు .౮౧౯౨ | ౨౬ ఉత్కృతి . ౬౭౧౦౮౮౬౪ |

ఇవియన్నియుఁగలయఁగూడినసర్వసమవృత్తసంఖ్యయగును.

ఉక్తాప్రభృతిఛందోజాతవృత్తసంఖ్యావివేకము.

ప్రథమఛందంబగునుక్తమొదలుకొని చతుర్థచ్ఛందము వద్దికినీలాగుఛందములయందుఁబుట్టిన సమవృత్తములన్నియు నెన్నియాయె ననియడుగ సరిచెప్పెడువిధము॥

నాలవఛందమువృత్తసంఖ్య

∪∪∪∪

౧ ౨ ౪ ౮

౧౬

పదునాఱుసమవృత్తములుపుట్టెను.

ఈవృత్తసంఖ్యయినుమడింపముప్పదిరెండయ్యె- నందులో రెండుపుచ్చి నముప్పదిగాననుక్తనుంచి ప్రతిష్ఠవద్దికినాలుగుఛందములయందును ౩౦సమవృత్తములుపుట్టెననునది - ఏఛందమువద్దికడిగిననిటువలెనే చూచునది॥
వెరసువేసికూడినసరే॥ ౨౨౧



సర్వవృత్తసంఖ్య.

ఇరువదియాఱుఛందములయందు నెన్నిసమవృత్తములుపుట్టె ననసరిచెప్పెడువిధము- ఈయుత్కృతిఛందమువృత్తసంఖ్య మునుపటివలె ద్విగుణించి రెండుతివిచివైచిన ౧౩౪ ౨౧౭ ౭౨౬ అయ్యెఁగాన నిరువదాఱు ఛందములయందిన్నిసమవృత్తములుపుట్టెనని చెప్పునది - వెరుసువేసి కూడినసరి॥

వృత్తప్రస్తారవిధము

నాలవఛందంబగుప్రతిష్ఠయందుఁబుట్టినసమవృత్తంబుల కేయేగణంబులనియడుగ సరిచెప్పెడు విధము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ∪∪∪∪ | ౧ | మగము | ∪∪∪ \| | ౯ | మలఘువు |
| \| ∪∪∪ | ౨ | యగము | \| ∪∪ \| | ౧౦ | యలము |
| ∪ \| ∪∪ | ౩ | రగము | ∪ \| ∪ \| | ౧౧ | రలము |
| \| \| ∪∪ | ౪ | సగము | \| \| ∪ \| | ౧౨ | సలము |
| ∪∪ \| ∪ | ౫ | తగము | ∪∪ \| \| | ౧౩ | తలము |
| \| ∪ \| ∪ | ౬ | జగము | \| ∪ \| \| | ౧౪ | జలము |
| ∪ \| \| ∪ | ౭ | భగము | ∪ \| \| \| | ౧౫ | భలము |
| \| \| \| ∪ | ౮ | నగము | \| \| \| \| | ౧౬ | నలము |

ఇవియన్నియు నడ్డబంతులుగాఁ జేసియాయాబంతి సమవృత్తమునకు నాయాగణంబులనునది - నాలుగు పాదములకును - నాగణములేయని చెప్పునది - ఏఛందమునకు నడిగినను నిటువలెనే వ్రాయునది ॥ ౨౧౪

ద్విగుణప్రస్తార లేఖన క్రమము.

మూఁడవఛందమునకుఁబ్రస్తారద్విగుణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ∪∪∪ | మగణము | ౧ | ∪∪∪ | మగణము | ౧ |
| \| ∪∪ | యగణము | ౨ | \| ∪∪ | యగణము | ౨ |
| ∪ \| ∪ | రగణము | ౩ | ∪ \| ∪ | రగణము | ౩ |
| \| \| ∪ | సగణము | ౪ | \| \| ∪ | సగణము | ౪ |
| ∪∪ \| | తగణము | ౫ | ∪∪ \| | తగణము | ౫ |
| \| ∪ \| | జగణము | ౬ | \| ∪ \| | జగణము | ౬ |
| ∪ \| \| | భగణము | ౭ | ∪ \| \| | భగణము | ౭ |
| \| \| \| | నగణము | ౮ | \| \| \| | నగణము | ౮ |

మునను నడుచును॥ మఱియు నంగజాస్త్రము ॥ రంగుభమస్గల్ * గ్రాలుమసజ్గల్ । పొంగై మన్యగ*ము గ్రజర్గలొ । ప్పంగానార్త*నగిరివల్లైతే । నంగజాస్త్రవృత్త * మందగించుఁ॥ ఇది రుగ్మవతీచ్ఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయనుమూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాలవచరణమునను నడుచును॥ మఱియునదీప్రఘోషము ॥ పోలిమైరారరం * బుల్ జతగ్రజంబులుఁ । తలంచఁగాయాయయులుఁ । దతగ్రజలుఁ*విలాసాచలాష్టైభవిశ్రాంతితోడఁ । దేలింపనొప్పారున*దీప్రఘోషముల్ ॥ వ ॥ స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాత వృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును॥ ౨౮౧ ॥ వ॥ ఇది స్వస్థానార్ధ సమవృత్తవివేకంబు ॥

ఇంకఁ బరస్థానార్ధసమవృత్తం బెఱింగించెద ॥ పరస్థానార్ధసమవృత్తవివేకము॥క॥మానుగసమాంఘ్రులొకగతిఁ। బూనికవిషమాంఘ్రులొక్క*పోలికలిప్పులై।హీనాధిక్యములు పరస్థానార్ధసమంబులందు*సమవిషమములఁ॥ ౨౮౨॥ అంపుమనోహరవృత్తము॥ పేరై సతజజ్వలు* బేసియెడఁ।సరులఁ సచతుష్కము*సాగినగం।భీరేభపితామహ * విశ్రమముల్।పెరుగంగ మనోహర*వృత్తముతా॥వ॥ఇదికవితాంతవృత్తవృత్తచ్ఛాయను బేసిచరణములను దోటకవృత్తచ్ఛాయను సరిచరణములను నడుచును॥మఱియుఁ గేతుమతి॥జత బేసులన్స*జనగముల్।భాతిసరిఁ భరే*ఘనగగంబుల్ । యతిశైలసంఖ్య*నమరఁగా ।నాతత కేతుమ * త్యభిధమొప్పఁ॥ ౨౮౪॥మఱియు వేగవతి॥ సగణత్రయగ * ల్చను బేసిఁ । బాగుగ సర్లను * భత్రిగగంబుల్ । నగవిశ్రమమం * దము నొందుఁ।వేగవతీనుత * వృత్తమునందుఁ ॥ అందువియోగిని ॥ ససజల్ గము*సాగ బేసులఁ । బససభగ్లము * భాసిలుఁ సరిఁ । రసశైలవి * రామసంగతిఁ । బొసఁగు న్యోగిని* భూరమాధిపా ॥ ౨౮౬ ॥ మఱియుఁ బరావతి॥ ఓలిరగ్రజజాంతగంబు*లుంచి బేసులం । మలఁ జరగ్రజగంబులు * స్గదిరింపఁగాఁ । గ్రాలుచున్నిధానదిగ్వి * శ్రామమొప్పఁగా । నిలంబరావతీసువృత్త*మింపుగాంచుఁ ॥ ౨౮౭ ॥ మఱియుద్ధృతమధ్య ॥ బారిగ బేసుల * భాభగగంబుఁ । సరులనజాయలు*సాగఁగమేల । య్యారెశిలోచ్చయ* హస్తివిరామో । దారతయొప్పను*చాధృతమధ్యఁ॥ ౨౮౮॥ వ॥ఇదితోదకవృత్తచ్ఛాయను బేసిచరణములను దోదకవృత్తచ్ఛాయను సరిచరణములను నడుచును ॥ వ ॥ ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద॥



పరస్థానవిషమవృత్తవివేకము.

క ॥ దానవహర యొకచరణం । బైనను రెండడుగులైన * నతురగణసంధానములను బెఱ తెఱవగు । వీనికిఁ బేరుపరదేశ*విషమములయ్యెఁ॥ ౨౯౦॥ అంపుశరభక్రీడ ॥ ఘనాదిత్యశ్రాంతిన్యమనసరగ * గల్మాఁడుకాళ్లఁ । గనద్ధామశ్రాంతిస్త్మభనయజ* గద్వంద్వమొందఁ ॥ దనర్పంగాఁబౌరాణికకథల*దాశార్హ్మవాశ్రు । వ్వన్వర్థం బై చెన్నారవనిశర * భక్రీడసంజ్ఞఁ॥ వ ॥ ఇదిచంద్రశ్రీచ్ఛాయను బ్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణములను నడుచును ॥ ౨౯౧ ॥ మఱియు శ్రీరమణము॥ఆదిభమస్గ * ల్మాత్రినన్నాపై । గాదిలిభాభగ * గంబులుమూఁటఁ । బాదుకొనంగవి * పల్కినచోల । త్మీదయితాధర * శ్రీరమణంబౌ ॥ వ ॥ ఇదిరుగ్మవతీచ్ఛాయను దొలిచరణమునను* దోదకచ్ఛాయను మూఁడుచరణములను నడుచును ॥ మఱియు రథగమనమనోహరంబు* గ్రథితనయుగరల్గ * గంబులుం బొసంగం। బ్రథమతృతీయచతుర్థ * పాదముల్వ్వచింపఁ । విధిదశయతులొంది*వింతగానజాఱ్యల్ । రథగమనమనోహ * రంబగుఁ ధరిత్రిఁ॥ వ ॥ ఇదిపరస్థానవిషమవృత్తవివేకం బింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టిదనిన ॥

సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క॥ ఉర్విఁ నాలుగుపదములఁ।బర్వినగణములనువర్ణ*బత్త్కిగణనయుఁ। సర్వము విపరీతం బగు । సర్వపరస్థానవిషమ * సంజ్ఞలనుహరీ ॥ ౨౯౩ ॥ అందుపీణారచనము ॥ దారిందయసాలగ్మతి * తజ్నభగాలు । న్సారించితజన్భసలుభ*నాజనగంబుల్ । జేరన్మణిదిగ్దశశశి * శేఖరవళిపీ । ణారచనధరఁ జెలఁగును*నారదవినుతా ॥ మఱియునుద్ధతము ॥ అరుదారను * ద్ధతమయ్యె । న్మగిసజయులుఁ * నసజ్గలుఁ । జారుభనజవలు*సజ్సలుఁ । ధరషణ్మహీధ్రిగజ * ధాత్ర్యయతిఁ ॥ ౨౯౫

వ॥ ఇది ప్రభాతచ్ఛందమును మొదటిచరణమునను అపరాజితచ్ఛందమును రెండవచరణమునను మాలినీచ్ఛందమును మూఁడవచరణమునను నడుచునుసా లవచరణముకవికల్పితము॥ మణిదీపిక॥గురుపితామహముఖ్యులఁగినిసి*ఘో రరణములలోఁ। దెరలిచెనఁడనిపలుకరత్న* దీపికల్దనరునన। తురనభభ్న భసల్నినాసజ* కారభసలునభర్సనసనసలు। న్భరసజాగలుభూపతుల్విన* భానువిశ్రమయుక్తితోఁ॥ ఉ॥ ఈసమవృత్తరాజినుద* యించివిరామము లున్గణంబులుం। బ్రాసములెల్లఁదప్పకసమర్చివచించినసైదుత్రోవలై।భాసి లువృత్తపద్యముల*పారములైవిషమావ్వయంబులై।వాసికినెక్కెశిష్టజన పాలనదుష్టనిశాటచాలనా॥ ౨౯౮॥ వ॥ ఇదిపంచవిధవృత్తవివేకంబింకవై తాలీయజాతివృత్తంబులెఱింగించెద॥ మ॥ ప్రకటింతున్ధరదక్షిణాంతికయు నా* పచ్ఛాందసంబుం బ్రవ। ర్తకయాపాతలికాపరాంతికలువై* తాలీ యముస్జారుహాసిక ప్రాచ్యంబునుదీచ్యవృత్తియునఁగాఁ* జెల్వొందువృత్తం బులిం। దుకులశ్రేష్ఠయనేకముల్గలుగునం* దుంగొన్నివాక్రుచ్చెదన్॥ కం॥ ఖ్యాతిగనురగడలందును।వైతాలీయాఖ్యవృత్త*వారములందున్। బీతాంబ రగురువునకు। స్రీతిగఁగృతులన్లఘువులు* రెండేసియగున్॥ ౩౦౦॥ అందు దక్షిణాంతిక॥ ఉరుసాజగ* లుండుబేసులన్। సరులందూకొను* సభగ్రివం బులున్। దొరలేడిటఁ* దొమ్మిదింటరా। ధరలోఁజెన్నగు* దక్షిణాంతిక ల్॥ ఔపచ్ఛాందసము*ఇమిడిసలము* లేడుతొమ్మదింటన్। సమకూఱున్య తి*మడ్ల రేఫయంబుల్। సమతన్వసుల*హ రేభయంబుల్। క్షమలోనౌప* చ్ఛాందసంబుమించున్॥ ౩౦౧

ప్రవర్తక॥ స్థిరవేసిను* దీచ్యవృత్తియున్। బరగున్సర్లను* ప్రాచ్య వృత్తియున్। గిరిమణియతి*కీలితంబుగన్। బరముఁగొల్వఁ*బ్రవర్తకాఖ్య మా॥ ౩౦౨॥ ఆపాతలిక॥ లములాఱునలున్భగగంబుల్। లములెనిమిది టికడన్భగగంబుల్। క్షమగిరినవ*శ్రాంతులుందగున్। బ్రమథితమురయా* పాతలికాఖ్యల్॥ పరాంతిక॥ ఇలవర్తక* వృత్తరీతితోఁ। దులమైపాద చ*తుష్టయంబులన్। బలసినయది* పద్మనాభచె। న్నలరుంగృతులఁబ* రాంతికాఖ్యచేన్॥ ౩౦౩॥ వైతాలీయవృత్తము॥ ఋతులఘువులు* రేఫవంబులున్। ధృతవసులఘువులు* రేఫవంబులున్। జతసమకొన*సా



రసాక్షుపా। లితశుకవైతా*లీయవృత్తమా॥ చారుహాసిక॥ ప్రథమము నను* వర్తకాఖ్యవృ। త్తముచందంబుప* ధాత్రిసత్కవుల్।సమకూర్చ* శార్ఙ్గకార్ముకా। సమతస్మీఱును* చారుహాసికల్॥౩౦౪॥ప్రాచ్యవృత్తి* తొ లినేఁడిటఁ* దొమ్మిదింటశ్రాం।తులుపదునాలుగు* దూఱుబేసులం।దులఁ బదాఱు* తొంగలించుస। ర్లలలిన్మాధవ* ప్రాచ్యవృత్తియా॥ ఉదీచ్య వృత్తి॥ తమకిరవగు* దక్షిణాంతికా। ఖ్యము తేజంబున* నందగించుమే।లిమి కృతులక* డిందివెలుపా। తిమురున్ధాత్రిను*దీచ్యవృత్తికల్॥వ॥ ఇదివైతా లీయజాతివృత్తవివేకంబింకమాలికావృత్తంబులెఱింగించెద॥

మాలికావృత్తవివేకము.

తే॥ మాలికావృత్తములనంగ*మఱియునైదు।దనరునిరువదియాఱుఛం దములమించి। యలలయగ్రాహిలయవిభా*తిలయహారి।గదసహజశ్రీభంగి యుదండ*కంబులనఁగ॥౩౦౫॥క॥ ముప్పదితొమ్మిదిమాత్రలముప్పదియక్క రలపద*ములయంఘ్రులనా। ల్గొప్పయతిప్రాసంబులు। గుప్పలయగ్రాహి యనఁగఁ* గొమరొందుహరీ॥ లయగ్రాహి॥ ఇంపడరఁగాభజస* సం బులతుదన్భజస*నంబులెపదంపడిభ*యంబులులయగ్రా। హింబరగుప్రాస విర*మంబునలుమాఱుగుదు*రంబటుకవీశులుతి* రంబుగవచింపన్। నరబ రముగావలసి*తొంబగలిదానవక*డంబముసహాయముగఁ*బంపిత్రిదశుల్దా। గ్ధాంబునిధిదచ్చియమృ* తంబుగొనఁజాలుసమ *యంబుదొరకించితిమ* దంబునముకుందా॥ ౩౦౬

క॥ ముప్పదితొమ్మిదిమాత్రల।ముప్పదినాల్గులిఘులపద*ములయంఘ్రు లునా।ల్గొప్పయతిప్రాసంబులు। గుప్పలయవిభాతియనఁగఁ* గొమరొందు హరీ॥ లయవిభాతి॥ పెనిమిటులుభార్యలును* దనయులనుగాంచిరెటు* మన మలరదొడ్డతప*మునసలదశేస్యం। గనుఁడుమఱికోసలియుఁ* దనకొడు పులోపలభు* వనములఖలంబునిడు* కొనినకొడుకున్రా। మునవిసద్వయ ము*వెనుకనసగంబులును* జొనిపితుతులుండునెడ* లనలుమఱుప్రాసం బునిలిపికవీశ్వరులు* మునులయవిభాతినిటు* నినువిసుతిసేయుదురు* వన జదళనేత్రా॥ ౩౦౭॥ క॥ ముప్పదితొమ్మిదిమాత్రల। ముప్పదియేడులిఘులప ద* ములయంఘ్రులునా।ల్గొప్పయతిప్రాసంబులు। గుప్పినలయహారియనఁ గఁ* గొమరొందుహరీ॥ ౩౦౮॥ లయహారిఁ నగణములు పదునెకొఁడు

సగణమునుగురువునిడి*మిగులనలుమఱుయతులు*దగులులయహారిర్ | బెగడిశతిధృతిపరిప*రిగతులమొఱయిఢినమ * రిగిరుషతనువుఁబొదివి*నిగిడిచనియంతర్ |నిగమములుగొనివెసను*జగములద్రువఁబఱచియొ*దిగికడపలిజడధిమునిఁగినభియాంతిర్ | బెగడుచునొడిసికరచి* తెగఁగొనినతురగగళుఁ*డగుహరివనఁగసుకవు * లగణుతిచెలంగుర్ ॥క॥ ఇదినేత్రాంబుధిలముము| ప్పదినాలుగువర్ణములను * బాదంబగుఁద| త్పదచాతుర్థికములచే| నొదవుఁద్రిభంగియనువృత్తమ్ * ముర్వరలోనర్ ॥౩౧౦॥ త్రిభంగివృత్తము॥ వినువకనుపలు * రసఁబతిపదమున * హసగగలుమూఁడొకతీరై మఱివేతైమూఁడొకతీరై | రసగణములు * నుసనభమసగములు పొసఁగిసషడ్యతిసంగినరిణరంగింజెల్లుఁద్రిభంగిర్ | మసలెడువ్రజమున * దుసికిలిమధురకుఁ*గసికినమృద్ధళుభాంగిందగు భంగింజేరిత్రిభంగిర్ | వెసమనిచినవవ* బిసరుహాననయనఁఋ* నిసభలవేడ్కఁగురింతుర్ వినుతింతుర్ నిచ్చలుఁగాంతుర్॥ క ॥ఇడినియమములేనిమహా| పథమునఁగావలసినంత*వక్కాణింపర్| గొదలేకనమరుద ౦డక|ముదధీంద్రశయానతావ*కోత్తమనుతులర్ ॥౩౧౧॥దండకము॥విద్వాంసులెల్లర్ హకారంబెకానీసకారంబెకానీ సకారంబెకానీవచింపందగున్సుందుగానిందుగా దేనియాదిందకారంబుగల్పించియామీఁదనెల్లందకారంబులేమెండుగానిచ్చకున్వచ్చునందాకనిర్మించి గుర్వంతముంజేసినన్దండకంబంద్రుభక్తానుయాయీభుజంగేంద్రశాయీపయస్త్రదద్యాదికస్తేయునైర్మల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమాయూరపింఛావచూడా సదాపూతబృందాటవీమధ్యరథ్యా సమారాధ్యతథ్యార్భక క్రీడహేమేక్షణాఖర్వదోర్గర్వసంభూతసర్వోర్వరా భారనిర్వాహకార్ధాంగితక్రోడచండ ప్రభామండతానేకమార్తాండకోటిప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశఘోషాంగనాలోలకాదంబినీ నీలగోపాలబాలా నమస్తేనమస్తేనమః॥౩౧౨॥క॥ దండిగనేకపదంబుల| నుండెడివినినాల్గడుగుల * నుండెడివినవే| దండావనదండకముల| పిండువుదనరారుఁజండ * వృష్ట్యాదికముల్॥ దండకము॥ ధూర్తల్నకారంబులుద్రెంటిపైసప్తరేఫంబులుంగూర్చినం జండవృష్ట్యాఖ్యమయ్యెన్నకారంబులుద్రెంటిపైనష్టరేఫంబులుంగూర్ప నర్ణాఖ్యమయ్యెన్నకారంబులుద్రెంటిపైరత్నసంఖ్యాకరేఫంబులుంగూర్చినన్నర్ణవంబయ్యెనోలిన్నకారంబులుద్రెంటిమీఁదందసంఖ్యాతరేఫంబులుంజెప్పినర్వ్యాళమయ్యెన్న



కారంబులుద్రెంటిపైరుద్రసంఖ్యాకరేఫంబులున్నిల్పజీమూతమయ్యెన్నకారంబులుద్రెంటిపైనొప్ప పంద్రెండు రేఫంబులుంజెంది లీలాకర బయ్యెఁబేర్చిన్నకారంబులుద్రెంటిపైమించు పద్మూఁడు రేఫంబులున్నంతనుద్దామమయ్యెన్నకారంబులుద్రెంటిపైమూఁడుబద్నాలు రేఫంబులన్శంఖమన్దండకంబయ్యె నీరీతితోడన్నకారంబులుద్రెంటితర్వాత నేడాదిగాఁ గారకారంబులొప్పారగానంఘిరినె క్కొక్కటెక్కించికావించినంజండవృష్ట్యాది నానాలసద్దండకంబుల్ప్రశాళించుఁగాకుండనాల్గంఘురిలుంజేయఁగావచ్చునీరీతినేకోనసాహస్రపర్యంతముం గూర్చియిచ్చావిధిం జెప్పఁగావచ్చుఁ గాంతంబుగారాధికాజార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథవాః కేళికాసక్తగోపీజనస్తోత్రసృష్ట వస్త్రాపహారాశుకాస్యోక్త వాక్యామృతాంభోధిచంద్రోదయాసాంద్రదేవా నమస్తేపునస్తేనమః॥

## జాత్యుపజాతినామములు.

క ॥ జాతులునుపజాతులునన | భూతలమున రెండగువిధ* ములవృత్తంబుల్ జాతులుకందాదులునుప|జాతులుగీతాదికములు * సరసిజనాభా॥౩౧౪॥ సీ॥ కందభేదములాఱు * గాకనుత్సాహంబు తరువ్రోజమధ్యమా*క్కరలునైదు*దీపించుమంజరి* ద్విపదత్రిపదచతుష్పదపంచపాదిష*ట్పదవిధములు|తొమ్మిదివిధముల * తోనొప్పరగడలుకళికలునుత్కళి*కలునుగూడ|జాతులునవవిధ * గీతంబులునుసీసస ప్తకంబునునుప * జాతులయ్యె| నను చునన్నయభట్టుభీ* మనయుఁబెద్ద| సచివుఁడునుమూర్తిశాతను * జయుననంత|మంత్రియునుఁదిమ్మరాజుని * మ్మాడ్కిఁజెప్పి | రందముగఁదాముచేసిన*ఛందములను॥

## జాత్యుపజాతినిరూపణము.

క॥ గురులఘువులలోనెయ్యది| మురసంహరప్రథమపాద * ముఖముననిలుచుర్ |ధరనుపజాతులుదక్కఁగఁ | బరగనిలుచునవియెనాల్గు*పదములమొదలర్ ॥౩౧౫॥మ॥ ధరణిర్జాతులకాదివర్ణమొకఁడే * తప్పంగరాదెల్లెడర్ | హరితజ్జాతిగణంబులైనసరియి * ట్టట్లైనఁగావచ్చుమం | దరధారీయుపజాతులంబ్రథమవ * ర్ణంబున్యథేచ్ఛంబుగా | పొరిదింజెప్పఁగవచ్చుఁబ్రాసములుని * ల్చున్వళ్ళకైయొక్కచోర్ ॥౩౧౬॥ క॥ తెలియఁగవినుమీకామే| పలినామగ్రామధామ * ప్రస్తుతపద్యంబులుగీతకందసీసాదులువిరతిగణని

యమ్మముల * తో వివరింతుఁ॥ ౩౧౫॥ క॥ గురులఘువుల పేరిటియక్షరము లుసష్టగణనామ* కములగులిఫులుఁ। సురరిపుగర్వతమోభాస్కరదీర్ఘము లైనరెండు * గానెన్నఁదగుఁ॥౩౧౬॥

కందషట్కాభిధానంబులు.

గీ॥ పరగఁగందము పథ్యయు*మరివిపులయుఁ జపలయును * ముఖచపలయు* జఘనచపలయనఁగఁగందపద్యంబులీ * యాఱువిధము। లఖిలసుకవికృతులలోన* నలరుచుండు॥ ౩౧౭॥ సీ॥ నలగగభజసగ * ణంబులేనునెకానికందంబునకునెండు * గణముసొరదు। వీటిలోపలనొక * మూఁటిచేవడిలేనిహీనపాదముముందుఁ* గానఁబడును। దరువాతదీర్ఘపా*దముపంచగణములఁదగుదానిమూఁడవ *చైత్రావునందు। నలజలుదక్కంగఁ*గలయవామీఁదనేయతిదాఁకునిజపదా*ద్యక్షరంబు॥ తే॥ తుదినిగాసలుదక్కంగఁ*గదియదొకటి। కొంచెపదుగులబేసుల * గొప్పకాల। సరులజగణంబుగూడదీ*చరణయుగము। భువినిసగమయ్యెరెట్టింపఁ * బూర్ణమయ్యె ॥౩౧౮॥ వ॥ ఇదిసమస్తప్రబంధంబులందుఁజెప్పెడు సహజకందపద్యలక్షణము ॥ పథ్య॥

క॥ ధరలోఁబథ్యాకందము। హరియగునాఱనయెడనల * మాఱిటిపై। విరతియుఁగూడఁగ మూఁటను। నెరయుఁజతుర్గణములుగమః*నిలిచినచోఁ॥ ౩౧౯॥ విపుల॥ క్షమబేసికాలుసమపా। దములోఁజొరశబ్ద మొకటి * తనరింపఁ। సమధికపథ్యాకందము। గమనికవిపులయనసలరు*కందమగుఁ॥ చపల॥ సమపాదములమొదలజగ। ణముంగడయుడుగుననుద్విగ * ణలఘువుపై। సమకొనుయతియాఱవయది। లమహాముకుందచప * లకునమరుఁ॥ ముఖచపల॥క॥ స్థిరఁజపలాగందమువై। ఖరిఁమొదలియడుగుచెప్పఁ * గఁగవులుపె। ట్టిరిముఖచపలయనెడ్డుపే। రరిదిగవైకుంఠవరద * యఘుజైత్రా॥ ౩౨౦॥ జఘనచపలాకందము॥ క్షమఁబథరీతిఁబూర్వా। ర్ధముచపలాకందముక్రియఁ * దగునపరార్ధముజఘనచపలకుమునీం। ద్రమానసమరాళ * దాశార్హా ॥ ౩౨౧ ॥ ఉత్సాహలక్షణము ॥ ఈహమీఁఱసూర్యగణము * లేడుగాంతమైనను। త్సాహవృత్తమనఁగఁగృతులఁ * జాగుచుండుసత్కవి। వ్యూహనుతులుగాంచికృష్ణుఁ*డొడిసికాళ్లువట్టిపెఁ। ద్రోహిచావుమనుచుఖరునిఁ*ద్రోచెఁగాళ్లుగామీఁదుఁగాఁ॥౩౨౨॥ తరువోజ॥ శతమఖత్రితయంబు* జలజాప్తుఁడొకఁడు శతమఖత్రయిమీఁదఁ * జనువిశ్రమంబు। ప్రతిభ



సీయడుగులో*ప్పఁగరెండుగూర్పఁ। బ్రతిమీఁఱనొక్కొక్క*పాదమైతనరుఁ। జతురంఘ్రిలీరీతి*జతగూర్చసుకవి। చతురవాచామూఢి*జలజాక్షునుతులఁ। గృతులందుఁదరువోజ * నియోజనెనఁగఁగృతకృత్యుఁడై చెప్పు* క్షితినెల్లసభల ॥

పంచవిధాక్కరంబులెట్టివనిన.

క॥మధుదమనపురందరభా। మధిచంద్రగణాలిచేక్ష*మమహామధ్యా। మధురాంతరాల్పపూర్వ। గ్రథితాక్కరలైదుదనరు*గ్రంథములందుఁ॥ ౩౨౩ మహాక్కర॥సూరుఁడొకఁడునుమున్నగాఁదర్వాత* సుత్రాములేవురుపిఱుఁదనొక్క। తారకేశుండుజతమైననిట్టిస * ప్తగణంబులొక్కపాదంబునకుఁ। జేరురెండవదోటనాలవచోటఁ* జిత్రభానుగణంబుగదియుచుండు। నొరసిలునాలవగణంబుపై ప్రశాంతి*యుత్పలాంగమహాక్కరంబునకు॥ మధ్యాక్కర॥ మునుపుగాఁప్రాసంబుగూర్చి*మూఁటిపైవిరమంబునిల్పి। చననింద్రయుగళంబుమీఁద*జలజాప్తునొక్కనిఁజేర్చి। యినుమడించిననాఱుగణము * లెనసిననొక్కపాదంబు। దనరవక్కాణించినంతఁ*దగునిట్లుమధ్యాక్కరంబు॥ ౩౨౪॥ మధురాక్కర॥మురనిశాటేంద్రసంహార * మూఁటిపై విరతులుంచి। తరణిశక్రత్రయంబును*ధామమయూఖునితోఁగూర్చి। వరుసతోనేనుగణముల*పాదమొక్కటియొనర్చి। దొరలఁజెప్పిననొప్పుఁగృ * తులమధురాక్కరంబు ॥ ౩౨౫॥ అంతరాక్కర॥భానుడిద్దఱాదిత్య* పతులుచంద్రుండు। పూనినాలుగగుచరణ*ములకుఁద్రిగణాంత। మైనవర్ణంబువిరతి*నంతరాక్కరంబు। భానుశీతాంశునేత్ర*పద్మాక్షచిత్ర॥౩౨౬॥ అల్పాక్కర॥విరమంబురెంటిపై *విస్తరిల్లు।సురపులిద్దఱునొక్క* సోముండురాఁ।జరణమీఁమూఁటిచే*సాగియొప్పు। హారిపపర్యంకయ*ల్పాక్కరంబు॥ ౩౨౭॥మఱియుమంజరి॥తుదమొదళ్లనునంటి*దూఁకుశబ్దంబు। వర్జించియతిమాఱు*ప్రాసంబులిడక। ప్రాసంబులేనిద్వి* పదమైచెలంగఁ। బ్రాసంబుతుదలందుఁ*బదిలంబుచేసి। సాగింపఁగాఁజాల*సత్కవీశ్వరులు। మోదంబుపెంపార*భూమిలోపలను। బద్మాక్షుఁడెపుడుచే* పట్టుమంజరుల। చందాననలరారు*జగతిమంజరులు॥ ౩౨౮॥ ద్విపద॥సురపతిత్రితయంబు*సూర్యుఁడొక్కండు। విగమంబురెంటిపై*వెలయునొక్కటికి। క్షితిఁదగనీరెంటి* చేనొప్పుద్విపద। మితిలేకచెప్పిన*మేలంద్రుకవులు॥ ౩౨౯॥ త్రిపద॥తొలుతనునల్వురిం*ద్రులురెంటమూఁటను। బలభిద్ద్వయంబునురవియువళిలేకనలరారుఁద్రిపద॥ ౩౩౨॥ చతుష్పద॥ జలజాసనవి*శ్రమసంయుతమై।లలిషోడశమిత*లఘువులతోడఁ।గలసిచతుష్పద*గతులనుధరలోఁ। జె

లువగుఁజౌపద*సేవకసులభా॥ ౩౩౧॥ వితాళచతుష్పద॥భానుయుగముపై*
పయినవలనిం। పూనమణివిరతి * నొందిధరలో। జానలరుఁజతు*ష్పదవితా
ళా। ఖ్యానమునవినా*యకతురంగా॥ కర్ణాటచతుష్పద॥ మొగిఁబంచలఘుగ
ణం*బులుమూఁడురవియుఁ। దగులంగఁబ్రాసంబు*దాఁకరెంటిపయి। నగు
నువళిగర్ణాట*కాఖ్యచౌపదకె। సఁగుఁగృతులసత్కవుల * సమ్మతముతోడ॥
పంచపద॥ క॥ఆదిసమవృత్తములలో। నైదంఘ్రులనెద్దియైన*నార్యులువలు
కన్। బాదుకొనికృతులలోపల। నాదరమునఁబంచపాది*యనఁగానరులన్॥
౩౩౨॥ ఉ॥ ధన్యసుశీలయవ్వనిత*తత్పరతన్నదియొష్టునఁదుస। త్కన్యలుసే
యుసువ్రతము* తానునువేడుకనాచరించిస।న్మాన్యతఁగట్టిసట్టినవ*మండితతో
రమసూయచేసిపె। దైన్యమునొందికానలవి * ధాతృకృతంబునసంచరించు
కొం।డిన్యమహామునీశ్వరుఁగ*డిందిగఁబ్రోచినరుక్మిణీశ్వరా॥ షట్పద॥ప్రాస
ములుమ్మూఁడు*వాసవులాఁగ్గురి * పైసుధాదీధితితోనిర్వృతి। భాసిల్లఁగాఁబా
ద*మీనూటితోనాల్గుఁ*జేసినకృతులందుషట్పదాఖ్య॥

నవవిధరగడలు.

వ॥ మఱియునైతాళీయభేదంబులైనరగడలనేకంబులుగలవందుఁబ్రసి
ద్ధంబులైనహయప్రచారాదినవవిధంబులుప్రబంధములవర్తిల్లునవియెయ్యె
వియనిన॥క॥నరసఖహయప్రచారము। వరుసఁదురగవల్గనమువి*జయమంగళ
మున్। ద్విరదగతివిజయభద్రమ। ధురహరిహరిణవృషగతులు * దొరలుం
గృతులన్॥ ౩౩౪॥ క॥ ఆద్యంతప్రాసంబుల। భేద్యంబులురెంటరెంటఁ*బెనఁ
చిపదంబుల్।హృద్యంబుగఁగూర్చినసన। వద్యంబులురగడలెల్ల* వాలుంగృ
తులన్॥క॥కొదలేనినైపుణులఁజౌ। పదచేనుత్సాహవృత్త*పదయుగ్మముచేఁ
దుదనాదినిప్రాసంబుల।వదలకవిరచింపవలయుఁ*బ్రాజ్ఞులురగడల్॥ హయ
ప్రచారము॥ ఋతువిరామ*మినులునల్వ। రతుకనొక్క*యంఘ్రిచెల్వ।
దనరహయతఁ * దార్క్ష్యడంచు।మునుశుకాది*మునులునొగడఁ। జనుహయ
ప్ర*చారరగడ॥ ౩౩౫

తురగవల్గనము॥ఇరవులన్హయప్రచార*మినుమడించికృతులఁజెప్ప।మురవి
దూరితాగ్నివరణ*తురగవల్గనాఖ్యమొప్పు॥ ౩౩౬॥ విజయమంగళము॥ తురగ
వల్గనంబురెంటి*తోడవిజయమంగళంబు।ధూర్తకంసతూలదహన*తుహినసహ
రసదృశకీర్తి॥వరగదుగ్ధసింధుమధ్య*భాసురాంతరీపవర్తి।వారివాహసదృశమూ
ర్తిభక్తజనహృదబ్జపూర్తి॥ద్విరదగతి॥కరమొప్పఁబంచలఘు*గణచతుష్క



ముచే। విరమంబురెంటిపై*ద్విరదగతిపేరిచే।విజయభద్రము*ద్విరదగతిరె
ట్టింప*విజయభద్రముచెల్లు * విదురపూజితపాద*వేదసన్నుతనామ। దరచ
క్రకార్ముకగ * దాఖడ్గధారణా * తాపించసమగాత్ర*దళితదైత్యస్తోమ॥ మ
ధురగతి॥నాలుగుమాత్రలు*నాటినగణములు। నాలుగురెంటికి*నలివిరమం
ములు। గలసిమధురగతి*కనలునుజగణము। తొలఁగినధృతకౌ*స్తుభగవిరమ
ణము॥ ౩౩౭॥హరిగతి॥ నలసభగగములలోపలనైదే*నను నెనిమిదినాల్గిటిపై
విరమము। గలసినహరిగతిచెలువగుఁగృతులం*గవివరులౌననిచెప్పిననియమ
ము॥ హరిణగతి॥ నరహరపదియు*నాలుగులములు। కరియతిహరిణ * గతికి
నెళవులు॥వృషభగతి॥ఇరువదియెనిమిదిలఘువులుపది*యేనిటవిశ్రాంతియుఁ
గూర్చిన। నిరవగువృషగతిపద్మాధిప*యిదివినుమాదరమునముదమున॥

యక్షగానలక్షణము.

సీ॥ తుదనేడులఘువులు*తొలఁగించిచదివినఁద్రిపుటకువృషభగ* తిపద
యుగము। లలిఁగడపలనొక్క*లఘువుమానినజంపెమనుద్విరదగతిస * మ
పదయుగము। గురుతగురచ్చెర * కుతురగవల్గనాహ్వయమేకతాళియా*మ
ధురగతికి। నంఘ్రికిర్వదినాలు*గటతాళమున మాత్రలోలివిశ్రాంతిప*ద్మా
లుగింటఁ॥ తే॥ దెలియనర్థంబునర్ధచం * ద్రికలువీటి। యక్షగానప్రబంధంబు*
లతుకవచ్చు। రగడభేదంబులివియంద్రుఁరసఁగ వీంద్రు। లవితనిజసేవకస్తో
మ*యబ్ధిధామ॥ ౩౪౧

ఉదాహరలక్షణము.

సీ॥సప్తవిభక్తులు*సంబోధనంబునుగూడనెన్మిదివిభ*క్తులుక్రమమునఁ।బతి
పేరుదొరలంగఁ*బద్యమొక్కటిఁజెప్పిరగడభేదములుమా*ర్గములుగాఁగఁ।గ
ళికలునెనిమిది*దళములుగావించి దానిలోసగమును * త్కళికఁజేసి। యది
యొక్కసమసనం*బయ్యెడుదళములెన్మిదిఁగూర్చివానికిఁ*దుదవిభక్తి॥ తే॥
బయలుపఱిచికట్టకడను*బద్యమొకటి। పలుకవలయునుసార్వవి* భక్తికము
గ। నిర్వదాఱుపద్యములందు*నిడినధాత్రి।నిదియుదాహరణ।మటందు*రిద్ధ
చరిత॥సీ॥సంబోధనమునకు * సరసాళిజయపతిప్రథమకువాణివి * రావళియు
ను।శ్రీతిద్వితీయకుఝుట*కీర్తిమతియుఁదృతీయకుఁగీర్తిసుభగయు* నటఁజతుర్థి
కినిదేవలాభిని*యనుభోగమాలినిపంచమికినెసంగు* పాణియునుగ। శావతి
షష్ఠియు*లలితకాంతిమతియుసప్తమికినిఘో*ణిసత్కమలయు॥ తే॥నాదిసూ
క్తులనామధే*యములువెనుకఁ। బలికినదివేల్పులష్టవి*భక్తులకును।వారుతమ

శక్తిఁగొలఁదిని*వ్రాలుఫలములిత్తునాయకద్వయమున*కిందిరేశ॥ సీ॥సంబు
ద్ధియెడలించి * సప్తవిభక్తులుపలికినభక్తిస *ద్గతియనంగ।సంబుద్ధితోఁగూడ*
సప్తవిభక్తులుపలుకనొప్పారుబ*ద్ధలియనంగ । సంబుద్ధితోడవి * షమవిభక్తు
లతోడఁబలికినకృతియువి*ద్ధళియనంగఁ।గళికలుత్కళికలు*గమకింపఁబలికిన
కావ్యంబునుత్కళ్ల*కంబుననఁగ॥ తే-గీ॥ నవనిఁజాటుప్రబంధంబు*లందుమిగు
ల। నాటుకొనియొప్పుచుండునీ* నాల్గుదెగలుఁ। గానఁబడును దా హరణము*
ల్గానలోల।కామెపల్లీశవల్లపీ*కామకృష్ణ॥ ౩౪౪॥ ఉ॥ శ్రీవనితాసనాథుఁడువ
శీకృతభక్తమనోంబుజుండువి।శ్వావసుఁడుగ్రసేనుఁడురు*వైద్యుఁడజేయుఁడ
గణ్యసద్గుణ । ప్రావృతభూషణోజ్జ్వలుఁడ * హాఃపతికోటిమరీచిభద్రదం *
శ్రావళినాయకావనుఁడు*దారుఁడుగృష్ణుఁడుమమ్ముఁబ్రోవుతన్॥౩౪౫॥ కళిక॥
మఱియుదేవకీశౌరసేనికు*మారనిర్మలరత్నరాజము।కఱకుటసురలనెల్లఁదా
రుణ*కదనధారుణిఁదునుము తేజము । బలిమినందనవనములోపలి * పారిజా
తముధరకుఁదెచ్చెను।గోలదిమిాఱిసమ్మదంబునఁ*గుండలంబులుతల్లికిచ్చెను।
జెలఁగినరుపకుసూతకృత్యము*చేసికౌరవులఁబరిమార్చెను।దలఁపుమఱువని
దాసచయములఁ*దవిలితిరుగనిముక్తిఁజేర్చెను। వెలఁదికోఱకును బాణుచేతు
లు * వేయునఱికినవిక్రమోగ్రుఁడు । జలదములజగిదెగడునొడలున * జాను
మిాఱెడుశుభసమగ్రుఁడు ॥ ౩౪౬ ॥ ఉత్కళిక ॥ కమలనేత్రునిరాకరోయు
చు*యమునయొడ్డునఁదపము సేయుచు ।నున్నకాంతనుజూచిరయమున * ను
న్నసుద్దివచించిప్రియమున । నరుఁడుగూర్చినమిత్రుఁ నానతి*కరముపట్టెడుదా
నిఁదానతి। విదళితాసురసార్వభౌముఁడు*యదుకులాంబుధిపూర్ణసోముఁడు॥
౩౪౭॥ఉ॥మానవులారరోగములు*మాసును లేములు లేవుసంపదల్ । జానగు
దుఃఖముల్దొలఁగు*జాఱునఘంబులునుందబుద్ధులై ।దీనతనొందనేటికిన*తిస్థిర
భక్తినిఁగొల్వుఁడీపరా।ధీనులుగాకమిారువసు*దేవకుమారకుముక్తికొసమై॥
౩౪౮॥కళిక॥మఱియుఁబ్రేతలనెల్ల*మురలుకొల్పినవానిఁ।దాళవృక్షములెల్ల*ధ
రణిఁగూల్చినవాని।గాలిరక్కసుజావఁ*గాలఁదన్నినవాని॥౩౪౯॥ ఉత్కళిక॥
మండుపావకుఁగొల్చి * ఖాండవాహుతిఁ వ్రేల్చి । పార్థివేశ్వరుఁగాంచి * పార్థు
నక్కడనుంచి । దారకుండమరించి*చేరఁదెచ్చినమంచి । యరదమెక్కకపూ
ని*పురికివచ్చినవాని॥ చ॥ పులసిలనేలమానవుల* పుట్టువుపావనమయ్యెనెప్పు
డున్ ।గళవళమేలరోగముల*కాలగతింగడవట్టెనీతిబా । ధలునుదరిద్రతావ్య
ధలు*దవ్వులకేచనువాంఛితార్థముల్ ।గలుగునమేయుచేతఁగమ*లాధవుచేవ



టపత్రశాయిచేన్ ॥ కళిక ॥ మఱియుఁబ్రహ్మమాయఁగెల్చి * మసలుమం
త్రవాదిచేత । నెఱిఁగిసాంభకునకువరము*లిచ్చిమెఱయుమోదిచేత। మృత
తనయునిమరలగురున * కిచ్చినట్టియమృతుచేత । నతులరాసకేలిసలిపి*నట్టి
యాదినటునిచేతఁ ।బిండిరుబ్బునాఁతిమోము* పెరుగుదుడుచుకొంటెచేత।
మండుచున్నకారుచిచ్చుమరిగిత్రావునమరుచేత।నెలుఁగుతోడఁబోరిమణియు
నింతిఁగొనినయజరుచేత । వెలయఁదులసిపూసపేరు * వేపికొనినజోగిచేత॥
౩౪౮॥ఉత్కళిక॥ గట్టిగశరపంజరంబు * గట్టఁదలఁచి వేగిరంబు।చవుటికడలి
చెంతఁజేరి * పవనతనయుతోడఁబోరి।తన్నుఁజేరినంతవచ్చిచెన్నుగెలుపునరున
కిచ్చి।మహిమమెఱయుకృష్ణుచేత * మిహిరకోటిదీప్తుచేత॥౩౪౯॥శా॥ ఓలం
బాసకునేకమత్సరముతో*నుప్పొంగిపెక్కేడులు। న్లీలాకారమునంగొలంకునడు
మఁ న్నిట్టాడునక్రంబుతోఁ।జాలంగయ్యముచేసిచిక్కినమద*స్తంబేరమస్వామి
మై।కేలంబట్టినిమిర్చినట్టిహరికై *కృష్ణాంబుభృన్మూర్తికై ॥కళిక॥ మఱియు
ను।గౌమోదకియునుఖడ్గము*మణియునుశంఖముఁబట్టినహరికై ।మెఱయఁగ
విద్యుచ్చేలముఁదాల్చుక*మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై। పెలుచంగదిసినమ
ల్లులనిరువురఁ*బిడికిటఁబొడిచినబలుమల్లునకై । వెలయఁగయమునానదిలోఁ
గాళియు*విషధరుఁదోలినయదుసింహునకై ।విజయునిరథసారథియైగురునృప*
భీష్మాదులఁగెలిచినభూపతికై । గజిగాయవనాభిధుముచుకుందునిఁ*గనుదృష్టి
నిఁజంపినశ్రీపతికై ।బలువిడిదేవకితండ్రినిమధురకుఁ*బట్టముగట్టినగోవిందున
కై ।గెలదాల్చినవైఖరిగోవర్ధన*గిరిమోచినమహదానందునకై ॥ ఉత్కళిక ॥
తొలిపుట్టువునోముఫలంబునవే।బలువిడిగినగుపేదఱికంబునవే,। సరికొండల
మందుచుఁబైసంబై ।పురికింబరమానందమునంబై ।కొనియుబ్బుచువచ్చికలి
మిపనికిం।గనియడుకులొసంగినబాపనికి। స్తలిమిచ్చినబాలస్నేహునకై ।కలు
ములచేనేలినకృష్ణునకై ॥౩౫౧॥మ॥పురిటింటంబసిబిడ్డచందమునవా*పోవంగ
నాఁడాత్మలో।మురువొప్పన్విషదుగ్ధయుగ్మకుచయై * ముద్దాడురాకాసిగు।ర్తె
ఱిఁగిష్టంబుగఁబాలుద్రావుమిషచే*న్నిర్జీవనకాలంబునన్ ।ధరణింగూల్చిననం
దపుత్రువలనం*దార్క్షణాధరస్థితుల్ ॥

కళిక॥ మఱియుగీతామృతస * మగ్రసింధునివలన। వఱలుభవపటుతిమి
ర * వనజబంధునివలన । బొంకుటెయ్యెడలేని * భూరిసత్యునివలన । జంకు
చెన్నడులేని*సమరనిత్యునివలన ।ఖేదముల్బెడబాపు*కేళిమర్దనువలన।నాది
కారణమూర్తి*యగుజనార్దనువలనఁ। గానరానిపదముల* గాముపానుపువ

లనఁ। బూనిగోద్రాలికిఁ*బుట్టుకొనుపువలన॥౩౫౨॥ ఉత్కళిక॥ తనుఁబిల్వమిగు
లఁగూఁద*దినిపాకమింపారఁ। జేసిద్రౌపది చేత*నాసదీరఁగ మేఁత । యడిగినము
నీశులకు*నిడఁగల్గు దాసులకుఁ। గల్పించుహరివలనఁ*గల్పస్థాయివలన॥౩౫౩॥
శా॥ కారాగారమునుండి వెల్వడిభుజం * గస్వామిసుచ్ఛత్రమై । పై రాఁదా
ర్తుల్ వ్రేఁడువాకిళుల్ దైఱువన*భ్రస్తోమముల్ మీఱిశ్రీ। సూరోద్భూతిపథంబోసం
గఁదనుఁగ్రోం*చుందండ్రియే తెంచిచొ।ల్వారం బెల్లనునిల్పఁబోల్చుహరికి*న్వా
లారనేత్రమొక్కొర్దక ॥ కళిక ॥ మఱియుఁ బెఱయనెఱయనుఱియు * మధునిఁ
గూల్చినట్టిహరికి। నుఱిమితఱిమిచఱిమినుఱుము*గ్రక్కుఁ గెల్చినవితకరికిఁ। గఱ
చిచఱచియఱచిపఱచుఁ*గపినిఁజంపినచ్యుతునకు। మఱిగితిరిగివిఱిగిరొరగుఁ*మ
ద్దులీడ్చినయమితునకు। సరలి కెరలివరలిమరలి*సాళ్వుఁ జంపినశూరునకు । గరిమ
మెరిమెరొరిమినెరిమి * కామెపల్లి మందిరునకు। నయముప్రియమురయముజ
యము*నరునకిడిన కేశవునకు । వ్యయముభయములయముక్షయము * వైరి
కొసఁగుమాధవునకు॥ ఉత్కళిక॥ గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ * బెల్లుజల్లులల్లి ఱాళ్ల
సోనవానమానపూని*కానరానికానలోన । నూఁచిలోఁచినోఁచిమోఁచి * ద్రో
చినట్టిహామనునకు ॥౩౫౫॥ మ॥ పృథులావంతివరస్వయంవరమున * న్విందా
నువిదామలఁ । ప్రథనక్షోణిని గెల్చిసద్గుణసుభ * ద్రన్భద్రఁ దోఁకొంచువ ।
చ్చిధరాధీశునను జ్ఞ చేననలసా*క్షీకంబుగ్రహింప్యాక్తస। ద్విధిఁ బెండ్లాడినకృ
ష్ణునందునిలిచె*న్దీర్ఘప్రతాపోన్నతుల్॥ కళిక॥ మఱియును గ్రసేనామాత్యు
నందు । నెఱిమీఱిలయకాల * నిత్యునందు । విదురార్చితపదార*విందునం
దు । విదళితఘోరారి * బృందునందు । నాభీరవస్త్రాపహారునందు । బలిప
ట్టణద్వార*పాలునందు। జలగాదిదశతనూ*చ్ఛాదునందు॥ ౩౫౬॥ ఉత్కళిక॥
సజ్జరాగంబు। రజ్జునాగంబు*కంధిరోగంబు । మందరాగంబు * రాపుతోనూ
చి। వీపుతోమోఁచి*వెలయుహరియందు। జలజాక్షునందు॥ ౩౫౭॥ ఉ॥ ధర్మ
జుఁడంపినంజరిగి*దంతిపురంబుననాంబికేయుతో। ధర్మముఁ జెప్పిదుష్కృతు
ల*డగ్గఱశాంతనవాదిసజ్జనుల్ । నిర్మలచిత్తులెల్లఁగను*నేరపునన్సభఁదాల్చి
నట్టిని।న్నర్మవహాకృతిందలఁతు *నాదుమనంబుననందనందనా॥ కళిక॥ మఱి
యు[illegible]గన్మోహన*మాయఁదాల్చినఁజాల । జిఱుముతఱిద్రౌపదికిఁ*జీరలిచ్చి
నకాల । సఖులతోనదిలోనఁ * జల్దిగుడిచినబాల । విఖనసుండెదలోన*
వేఁదలిగ్చినలోల। నరుతేరినొగలపై * నాట్యమాడినవీర । సరకుగొనిభీష్ము
పైఁజక్రమెత్తినశూర।తరినిసద్గురుసుతుల*దాపరించినసదయ। పెరిమెనాగ



పురంబు* పెకలించినవిజయ॥౩౫౮॥ ఉత్కళిక॥ గురుభీష్మ రాధేయు*
లురుజన్యమున నేయు । శరవన్హిఁబయలెక్కియురదమల్లను నెక్కి। తరుగాల్చు
నెడ పాండు*తనయులే గురిమెండు। బ్రతుకఁజేసినపుణ్య*వితతదీనశరణ్య॥ శా॥
నీవుకుండవు నిన్నునమ్మికొలుతు*న్నీచేసుఖంబబ్బెనీ। కై వేదండమొనర్తునీవ
లనని * ప్రాప్తి చేకూఱెనీ । కేవిశ్వాసముఁ జేర్తునింకమదిలో * హెచ్చ
య్యెనీయందునా । కై వారంబులుశౌరసేనతనయా*కామేపలీవల్లభా॥ ఉ॥
నామనవిచ్చగింపుమిట। నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం।తామణిఁ గల్పనోక్తిక
ల*నాచతురోపములుల్లసిల్లని।చ్ఛామతినర్పణంబుగ నొ*సంగితిగామెపలీశనీ
కునై।రామయమైతగన్భవదు*దాహరణంబుజగత్ప్రసిద్ధిగాఁ॥ సీసంబులనున
విసమవిషమంబులు రెండు దెఱంగులయ్యె వానివిశేషంబులెట్టివనిన॥ సీసమా
లిక॥ యతినైనఁ బ్రాసంబు * నందైన రెంటితోఁ। జెప్పిరేనియుసమ* సీసమగు
ను। నియమములీని పై * నిలిపినసీసంబులాఱుదెఱంగులై * యతిశయిల్లు ।
నెనిమిదంఘ్రులఁబ్రాస * మెక్కింపవళ్లకై సర్వతఃప్రాససీ * సంబనంగఁ ।
బ్రాసమాఱంఘ్రులఁ * బదిలంబుగావింపనక్కిలిప్రాససీ * సాఖ్యమనఁగ ।
నాదినేవడినిల్పి * రావడేపదమల్లఁ జేయు నెయ్యదివడి * సీసమనఁగఁ ।
బదఖండములయందుఁ*బ్రత్యేకయతులుగాస్థిరనవకలివడి*సీసమనఁగఁ । గు
రుగానుత్సాహ*తుదయందుగీతంబుచెప్పినవిషమాఖ్య*సీసమనఁగఁ । గడవె
ళ్లలఘువులే * కల్పించిరెడ్డానసర్వలఘుసీ* సంబుననఁగ॥ తే॥ సప్తవిధములివి
యశబ్ద* శాసనుండు । పంచమామ్నాయఫక్కిలోఁ*బల్కఁగాని । కడమ
కవులాఱుసీసము*ల్విడిచిపెట్టి। చెలఁగిసమసీసపద్యమే* చెప్పినారు॥ ౩౬౦

అందుసీసలక్షణమెట్టిదనిన.

క॥ సురపతులాఱ్గురిపై భా।స్కరులిరువురుగూడనొక్క*చరణముపొల్చుం।
బరగునవినాలుగడుగుల । విరమముపై రెంటరెంట* వెలయఁగవలయుఁ ॥
౩౬౧ ॥ క ॥ వాసిచరణములునాలుగు । చేసితుదినిగీతమొకటి* చెప్పఁగన
య్యెఁ । సీసముతంగెడదేశవి । భాసురశుభఖేల కామె * పలిగోపాలా ॥
[illegible]మసీసము॥ బ్రతికించెనెవ్వాఁడు*మృతగురుతనయుని మెలఁతవేఁడిన మె
చ్చి * మేలుచేసెఁ । బోషించె నెవ్వాఁడు * పొదివినదారుణాపదలెల్లఁ దొ
లఁగించి * పాండుసుతుల । వెడలించెనెవ్వాఁడు వెడపాడుబావిలో నూ
సరవల్లియై * యున్ననృగుని । మర్దించెనెవ్వాఁడు *మాసలంబున వృష్ణియ
[illegible]॥ తే-గీ ॥ [illegible] * విపిన

మెల్ల। జాతవేదోత్థవిలసిత*జ్వాలమీఁదఁ। నతనిఁగీర్తింతుమదిలోన * నను
దినంబు । ననఁగనలరారుసమసీస * మఖిలకృతుల॥ సర్వతః ప్రాససీసము॥
వేదండవరదుండు * వేధోండగాండుండు । నాగేనశయనుండు * యాదవేం
ద్రుఁ । డాదిత్యవంద్యుండు * సౌదామసులభుండు। వేదాంతవేద్యుండు * కా
లనీలుఁ । డాదితేయుఁడుబిందు * నాదకళాతీతుఁ । డాదిత్యకులజుండు* బా
ధితారి । మేదినీశ్రీశుండు * భూధరగాత్రుండు । శ్రీదమిత్రసఖుండు * ద్వా
రకాత్ముఁ॥ తే-గీ॥ డాదిదేవుఁడాశ్రితగంధ * మాదనుండు । చేదిసాంభక
వైదర్భ * సూదనుండు । మేనురమురళీనాదవి * నోదుఁడనుచుఁ । జెప్పిన
నుసర్వతఃప్రాస * సీసమగును ॥ ౩౬౨ ॥ అక్కిలిప్రాససీసము ॥ శిక్షించెనె
వ్వాఁడు * చేటుకై సభలోనఁ జెడుమాటలాడిన * చేదివిభుని । రక్షించెనె
వ్వాఁడు * ద్రౌణిబాణముచేతఁ । జిక్కకుండఁగఁబరి* క్షిన్నృపాలు । భ
క్షించెనెవ్వాఁడు * పర్వతాకృతిచేతనాభీరులగ్గించు * నారగింపు । వీక్షిం
చెనెవ్వాఁడు * వేడ్కతోసేవకుల్ । బ్రతుకునట్లుగఁగృపా * పాంగదృష్టి ॥
తే-గీ॥ దాక్షిణాత్యునిసాంభక * ధారుణీశుఁ । జంపెనెవ్వాఁడుపోరులో * సా
హసమునఁ । బక్షిరాజతురంగుఁడే *వ్వాఁడనంగఁ । జెలఁగుచుండువృత్తప్రా
స*సీసములిల॥ ౩౬౩॥ వడిసీసము॥ విజయసారథిఁగాని* వినుతింపఁగానొల్లఁగి
రినాయకునిఁగాని*కీర్తిసేయ।యాదవేంద్రునిఁగాని॰ యభినుతింపఁగనొల్లమ
ధుసూదనునిఁగాని* మదినినిల్పఁ।బద్మనాభునిఁగాని ప్రణుతింపఁగానొల్లఁబా
ణీనపతిఁగాని*బ్రస్తుతింప। బాణసంహరుఁగాని*భజియింపఁగానొల్లఁబీతాం
బరునిఁగాని*ప్రీతిఁదలఁప॥ తే-గీ॥నవితవేదండపతిఁగాని*యనుసరింప। ననుచు
నినుఁగూర్చియనురక్తి*నాత్మనెపుడు। పొగడుసత్కవిప్రజములఁ*బ్రోచితనఁ
గఁ।దనరువడిసీసభేదంబు*తాళభేది॥ ౩౬౪॥ అవకలివడిసీసము॥ సామాజికా
హిత * స్తోమంబుసామంబుగామించిమైత్రికి * నామతింప।నభిమానధారుణీ *
విభులుదానంబుచేనక్కఅలన్నియుఁ*జక్కఁజేయు ।నతిరుక్మపక్షమా*వతు
లుభేదంబుచేదినదినక్షీణత్వ*మునకుఁజెడఁగఁ।బదిలింపుటుద్దండు*లొదిగిదం
డంబుచేఁదనయాజ్ఞయాదల * నునిచినడప॥ తే-గీ॥ సంధియానాదిషాడ్గుణ్య*
బంధురముగ।నాంశక్తి। తయోపేతుఁ*డై మురారి।నేలననురక్తినీతిత్రో*నేలె
ననుచుఁ।జేయనవకలినసీసము*పేసమగును॥ ౩౬౫॥ విషమసీసము॥ అంచితము
గభీమునకుసహాయుఁడుగుదెంచితా। నించుకెదిరిమురముసేయ*నేయునంగుశం
బుతాఁ।కించుకొనకకినుకవలనఁ*గెరలినరకపుత్త్రుమ।గ్గించినట్టిసవ్యసాచి*తేరి



ఘోటకావలిం॥ ఆ-గీ॥ దోలుకృష్ణయంచుఁ * దోరంపుటుత్సాహ । గీత
మొకఁడుమేళ * గింపవిషమ । సీసమనఁగవెలయు*శ్రీకామెపల్లీశ । జమ్మిచెం
తనున్న*చతురవచన ॥ ౩౬౬ ॥ సర్వలఘుసీసము॥ క॥ క్షమపద్ధెంశల్లఘువు
లు।త్రిమహేశవిరామముగల*దీర్ఘపదచతు।ష్కముపైనొకగీతియుర । ప్ర
మథసనర్వలఘుసీస * పద్యమునకగుర్ ॥ ౩౬౭ ॥ సీ॥కరివరదపరమకృప * ధ
రణిధరసురవినుతకనకవసననరహరి* గరుడగమన। నళినకరపదనయన * దళి
తఖరదనుజచయనరసఖవరగుణనిధి * శరధిశయన । పరమపదనిలయహరి *
పరమపురుషప్రకృతికిఁబరుఁడనినినునిగమని*వహముపలుకునిరతమునుహృ
దయమున*నినుఁదలఁతుననుమనుపుమనియనఘచరితజల*దనిభతనువ॥ తే-
గీ॥సర్వలఘుసీసమీరీతి*సకలసుకవి।వరులుచెప్పుదురిలమీఁద*పరుసనెల్ల।వా
రుమెచ్చంగసర్వేశ*వారిజాక్ష । కామెపల్లీశయచ్యుత * కామజనక॥ క॥ బల
సోదరగీత్యుదితా । ర్యలునాల్గార్యాఖ్యగీతు * లాటవెలఁదితే। టలురెండుస
మములెత్తుక । మలనాహ్వయపసడలువిష*మంబులుమూఁడుర్ ॥ సమగీతి॥
క్షమఁబథ్యాకందముచం। దమునర్ రెండరలుదెలియఁ*దనరింపర్ । సమమ
నుగీతికృతులలోఁ । గమలాహృదయాబ్జవాస*కమలాక్ష॥ ఉద్గీతి॥ మొదలి
సగముచపలగతిం। దుదన్నగముపథ్యగతిని*దొడరంగా । నిదియుద్గీతియసం
దగు।విదురాక్రూరాదివరద * వేణుధరా॥ఉపగీతి॥ ధరఁజపలాకందమువై ।
ఖరిన్నగంబైన * కావ్యములర్ । బరగునుపగీతిపూర్వా । మరవ్రజతమిస్ర *
మార్తాండా॥ ౩౬౯ ॥ ఆర్యాగీతి ॥ సముదీరితపథ్యాకం । దముకన్నునొక్క
గురువు * దాఁకించినచో । క్షమనార్యాగీతియగు।న్గమలాప్రాణేశసహజ*కం
దంబదియే॥ సమగీతులందునాటవెలఁది॥ మేలుమేలటంచు*మిత్రులుముగ్గు
రు। వింతవింతయనుచు * విబుధులిద్ద।ఱహాహాయనుచునూరు * లయిదుగురు
మెచ్చ।నాటవెలఁదిమూఁట*నలరుసగము॥ ౩౭౦॥ తే-గీ॥ మిత్రుఁడొక్కఁడు
వీణియ*మీటుచుండ।విబుధవరులిద్దఱర్థంబు*విప్పిచెప్ప। నినులునిద్దఱువిను
చుండ*నేకగతిని।దేఁటగీతంబుమూఁటను*వాటమయ్యె॥విషమగీతులందునె
త్తుగీతి ॥ సురనాథుమీఁద* సూరులిరువురురెంటవిరతి । ధరణిఁబ్రాసంబు *
దనరునెత్తుగీతియందు॥ కమలసగీతి॥ హగణమైనఁజాలునగణ * మైనఁజాలు
హగణ । నగణములును రెండుగలసి * నాటియంఘ్రికేకు । తగినవిరతినాలు
గింటఁ*దనరఁబ్రాసమొదవి। మిగులమెఱయుచుండుఁ*గృతులఁగమలనాఖ్య
గీతి ॥ ౩౭౧॥ పవనగీతి॥ ఇనునిముగురుభానుస *లాదిత్యపతులిద్ద । ఆవలనేగుర

ర్కు—*లర్థమునకుఁ।బవడగీతియందుఁ*బ్రాసముల్ సమకూఱు। నవియెయ్యాట
వెలఁది*యందు లేదు॥ వ॥ ఇదినవగీతివివేకం బింక బిరుదావళిలక్షణం బెఱిం
గించెద॥ తే॥ క్షితిమహారాష్ట్రభాషచేఁ*జెప్పఁబడెడు। భీకరోక్తులుబిరుదు
లై *పెక్కు—దనరు। వానిబిరుదావళియొనర్చ * వలయునంధ్రు। బుధులుసం
బుద్ధిపదములు * పొసఁగఁగూర్చి॥ ౩౨౭॥ చ॥ అతిభుజవిక్రమోద్భవము*లై
రిపుకర్ణకఠోరకంబులై। యతులితవీరవాక్కులయి * యాదిమపార్థివలాం
ఛనంబులై। ప్రతిపదనూతనంబులయి * భాసిలుసూక్తులుగూర్చిస్వస్తివా।
కృతతులఁజెప్పనొప్పుబిరు * దావళిసార్వవిభక్తికంబుగాఁ॥ చ॥ సలలితవా
క్యగుంభనల*సర్వవిభక్తులదీవసంబులఁ। జెలువగుపద్యమొక్కటిర * చిం
చినపిమ్మటగౌడరీతిసం।కలితచతుష్కషట్కదళ*గద్యములెన్మిదియుంబదా
ఱునిం। పలరఁగఁగూర్చిపేర్చిబిరు * దావళిఁజెప్పఁగనొప్పునెంతయుఁ॥ చక్ర
వాళము॥ క॥ ఒకపద్యముపిదపదళా।ష్టకసందర్భాష్టగద్య * చతురంబగుఫ।
క్కికిఁబేరుచక్రవాళం। బకటచతుర్భద్రమదియె * యచ్యుతమఱియుఁ॥ క॥
తొలిసమసనాంత్యవర్ణయు। గళమేపునరుక్తిగాఁగఁ * గైకొనిసామీ। ప్యల
సత్సమాసముమొదల। నలరించినచక్రవాళ * మగుదాశార్హా॥ తే॥ అవధ
రింపుముదేవది*వ్యప్రభావ।భావనాతీతనిస్తుల * పరమమూర్తి। పూతనా
జైత్రసుత్రామ * పుత్త్రమిత్ర। మిత్రశశినేత్రనిర్జర * స్తోత్రపాత్ర॥చిత్రకవి
త్వము॥సీ॥అనులోమమువిలోమ*మునిరోష్ఠ్యమునుదలకట్టునుగుడులుశృం*
గములునక్ష। రవిలోపమునుబద* భ్రమకంబుపద్యభ్రమకమునునల్లెంట్లు*
మఱియునేక। పదియుద్విపదియుఁద్రి * పదియునునేకవర్ణంబునుద్వ్యక్షరి*
త్ర్యక్షరియును। సరవినిచ్ఛావాక్య*సంఘట్టనంబునునాదిగాఁగొన్నిప* ద్యం
బులెల్ల। క్షితినిజిత్రకవిత్వప్ర*సిద్ధనామ। ధేయములచేతఁబెంపొంది * తెలి
విమీఱు। వానిఁదెలియఁగవచియింతు*వాసుదేవ।నందగోపాంగనాపుత్త్రి
నరకజైత్ర॥ అనులోమము॥ క॥ దామోదరసామతనధ। రామాసరసాకర
దళ * రథహరిరాధా। కామాసదయాతిపరమ। ధామావరయాదవకుల *
దారకరాసా॥ విలోమము॥ క॥ సారాకరదాలకువద।యాంరవమాధామరప
తి*యాదసమాకా। ధారారిహధరళదరక। సారసమారాధనతమ * సా
రదమోదా॥ నిరోష్ఠ్యము॥ క॥ పావనపాపాబాభా। మావాయనునాఱు
లిప్పులు * మఱిపద్యములో। భావింపదొరలకుండిన। భూవలయమునన్నిరో
ష్ఠ్య * మనిపాలించుఁ॥ ౩౨౮॥ క॥ సరహార్యక్షదయాకర। కరిరక్షణచక్రహ



స్త*కాంచనచేలా। గరుడతురంగజనార్దన। ఖరదైత్యనికృంతనహరి * కం
జదళాక్షా॥ గుడులు॥ క॥విరివినినిలిచిరివినిచి।క్కిరిదివినిశిఁదిరిగిరితిరి * గిమిడి
కిక్షితి। ల్లిరిచింతిల్లిరితివిరిరి। సిరికొఱకుధనాఢ్యులనఁగ*క్షితిగుడుసులగుఁ॥
క్రొమ్ములు॥ క॥ గురుఁడునుశుక్రుఁడునుగ్రుఁడు।పురుహూతుండునుశుకుండు *
బుధుఁడునుగుహుఁడుఁ। బురుకుత్సుండునుగుత్సుఁడు। గురునుతులొనరించి
రనఁగఁ*గొమ్ములుకృష్ణా॥ అక్షరవిలోపము॥ క॥ రవికన్యాసుందరకర। మవ
ళంబనమోర్చియాఁదె*నచ్యుతుఁడనియే। నవవర్ణవిలోపముగా। నవనింబ
తియింపవలయు*నార్యులునలరఁ॥ పదభ్రమకము॥ క॥ ధీరానానారాధీ।
ధారాకరతాతరళిత * తారకరాధా। ధారాసుతతసురాధా। ధారితతరి
ధాసనాఁబ * దభ్రమకమగుఁ॥ ౩౨౯॥ పద్యభ్రమకము॥ క॥ రాధానాధా
తరళిత। సాధకరధతావరసుత * సరసనిధానా। నాధానిసరసతనురవ। తా
ధరకధసాతళిరత * ధానాధారా॥ నల్లెంట్లు॥ క॥ నారదమునిశార్దూలము।
కూరిమినజినంబుఁగప్పు*కొనివేడుకతో। నారాయణవాసమునక। నాతరమే
తెంచుననఁగ * నల్లెంటులగుఁ॥ ఏకపాది॥ తే-గీ॥ మతివినాయకభరితస *
మ్మదుఁడనంగ।మతివినాయకభరితస*మ్మదుఁడనంగ। మతివినాయకభరితస*
మ్మదుఁడనంగ। మతివినాయకభరితస * మ్మదుఁడనంగ॥ ద్విపద॥ తే-గీ॥ సౌ
మ్యగురుకవుల్ నినుఁబ్రీతి*సరసిజాక్ష। భోగిభోగాసనుండని * పొల్చుటరుదె।
సౌమ్యగురుకవుల్ నినుఁబ్రీతి* సరసిజాక్ష। భోగిభోగాసనుండని * పొగడద్వి
పద॥ త్రిపద॥ తే-గీ॥ దేవమునివంద్యగోవింద*దితిజహరణ। పుండరీకాక్ష
యవ్యక్త*పుణ్యపురుష।యమరసన్నుతగోపాల * హరిముకుంద। దేవమువ్య
క్తహరియునాఁ * త్రిపదయయ్యె॥ ఏకాక్షరి॥ క॥ నానాననానున్నన। నూ
ననునిన్ననెనేను * నున్ననినినసై। నానీననునానానును। నానూనయనంగ
నొంటియక్షరమయ్యెఁ॥ ద్వ్యక్షరి॥ క॥ మునినామామమ్మునుమన। మున
నూనిననేమమునను* మొనమ్మాననున।న్మనుమనిమననముమన్నన। సనుమా
నానామునినయ*నద్వ్యర్ణమగుఁ॥ త్ర్యక్షరి॥ క॥ మానితమతితోమమతను।
సీనామమునేమమునను*నేనుమనమునఁ। నూనమునమతముమానను।దాన
కముగఁదలఁతుననఁగఁ*త్ర్యక్షరియయ్యెఁ॥ ఇచ్ఛావాక్యసంఘట్టనము॥ క॥
తోటలులెస్సైయున్నవి। తాటాదూటములుగావు*తాపసులుండఁ। బేటః
లుదామోదరుచె। ర్లాటలకున్నెళవులుమఘు* రాపురిచెంతఁ॥ వ॥ ఈ పద్య
మునఁదోట,తాట,పేట ఆటయనుమాటలర్థవంతముగాఁ గూర్చుటంజేసి దీ

పేరుఇచ్ఛావాక్యసంఘట్టనము॥ బంధకవిత్వము ॥ సీ ॥ గోమూత్రికాఛత్ర*
గుచ్ఛకుండలినాగకంకణమర్దల*ఖడ్గచక్ర। పంకజసర్వతో * భద్రమురజాక్షు
రీప్రముఖబంధంబులే * ర్పడఁగఁజెప్ప। వృత్తముల్బంధక * విత్వవిశ్రుతము
లై కవులకుఁజెవులపం * డువులుసేయఁ। బటుతరప్రౌఢిమఁ * బండితపామర
సాధారణంబుగా * జగతిలోన। రాధికాకేళికాలోల* రమ్యశీల। భూరిగుణ
సాంద్రదయను * కులాంబోధిచంద్ర। వల్లవీమానచోరదు* ర్వారశూర। పర
మవాచాలరాజగో*పాలబాల॥ వ॥ ఇదిబంధకవిత్వంబింక గర్భకవిత్వంబువి
వరించెద॥ గర్భకవిత్వము ॥ సీ ॥ గాంగేయకౌశేయ * ఘనకందగీతసద్గర్భ
చంపకమాలి*కయువరిష్ఠ। కందపద్యద్వయు * కమలవిలసితరుగ్మవతికాగర్భి
త * క్రౌంచపదము। గీతమత్తేభవి *క్రీడితాకందగర్భితసీసమునఁటమ*ద్వృ
త్తగర్భి। తోత్పలమాలిక * యునుసుకల్పితకల్పవల్లి యుసీసరూ * పద్విపద
యు। స్రగ్విణిగర్భము * జంగప్రయాతంబుకందగర్భితమణి * గణనికరము।
కలితచతుర్విధ*కందపద్యమునష్టవిధకందమునుబంచ*విధసువృత్త॥ తే॥మా
దిగాఁగలకొన్నిప*ద్యములుపెక్కు।సరవిఁబద్యములిమిడిదో* షములులేక।
కానవచ్చినవియెల్ల*గర్భకవిత। ధరణినొప్పారసీరీతిఁ * దనరుఁగృష్ణ॥ ౩౮౧
కందగీతగర్భచంపకమాల॥ చ॥ సరహరికేశవావనజ * నాభరమాధవవంశ
హస్తబం। ధురసుగుణాకరాదురిత * దూరజనార్దనదోర్బలాఢ్యగీ। ర్వరగి
రిశస్తుతాయురహ * రాసురపూజితముఖ్యపాదసుం। దరపురుషాగ్రణీభుజ
గ * తల్పశచీపతిపుత్రరక్షణా॥ ౩౮౨॥ ఇది భాషాపరిచ్ఛేదములోఁ దెలుపఁ
బడియె॥ కంపద్వయకమలవిలసితరుగ్మవతీగర్భక్రౌంచపదము ॥ ద్వారవతీ
నా*థాసమదారాతరుణధవళతర * ధరనుతనామా। మారమణీధా * మా
సుకుమారామరుదధిపతిరిపు * మదగిరిశంబా। సారసనేత్రా* సత్యవిచారా
శరరుహభవముఖ * సకలసురేశా। సూరకులాతే * జోజితసూరాసురవర
మణినిభ - సురుచిరదేహా ॥ ఇదివర్ణపరిచ్ఛేదములోఁ దెలియఁజేయఁబడియె॥
మత్తేభవిక్రీడితాకందగర్భసీసము॥ వినయసంపన్నర * విప్రభూతరమణీనా
థాపయోజేక్షు * ణానరాప్త। విభయదాకారహ * విర్భుగాయతరిపుప్రా
ణానిలాహీశ్వరారమేశ। విలయకాలానల * విక్రమప్రథితసాల్వగ్రావవ్ర
ద్ధశ్ర*వాపరేణ్య। విలయశీలాయను * వీరకౌస్తుభధరాచక్రియశోదాత్మ*
జామునుంద ॥ తే॥ కరివరదపూతనాంతక * గరుడగమన। సత్వసహితకామ
జనక * శంకరసఖ। కనకవసనసుందరదేహ*వనధిశయన। సనకముని వినుత



చరణ*సరసిజయుగ॥ ౩౮౩॥ ఇదివళిప్రాసపరిచ్ఛేదములోఁ దెలుపఁబడియె ॥
వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధుర గర్భోత్పలమాలికావృత్తము॥ శా
రదశాసితప్రసవ * చాపవిఖండనసామసన్నుతా। తారణదానపోషధవ*
తాపనమండనధర్మతత్పరా। వారణభాసురప్రభవ * ప్రాపకభండనవాస
వానుజా। పారదవాసుదేవభవ * పాపవిఖండనభర్గపూజితా॥ ౩౮౪॥ ఇది
యీపరిచ్ఛేదముతుదను దెలిపెదము॥ కల్పితకల్పవల్లీప్రహరణకలిత॥ కర
ధృతకరుహం * కరిహితకరణం। కరుహాసఖరుచిం * గరుడఖగరథం। ఖర
ఘనకరవిం * ఖరతరకరగం। గరళముఖరిపుం * గరధరకరతం॥ ఇది సంధిపరి
చ్ఛేదములోఁ దెలిపెదము॥ మఱియుఁ గల్పితకల్పవల్లీభాస్కరవిలసితము॥
అక్షరహారివిక* చాంబురుహాక్షా। యక్షపసఖనుత* యదుకులదక్షా। రక్షక
సురవిదు * రద్విపరక్షా। రాక్షసవిదళన * ప్రరుచిరవక్షా। పక్షగపతిరథ *
పౌంద్రవిపక్షా। భక్షితదవశిఖి * బహుసవదీక్షా। వృక్షగసహచర * ఋక్ష
సదృక్షా। ఋక్షపదుహితృప * ఋషిజనపక్షా॥ గర్భప్రథమకందము ॥ క॥
అక్షరహారివికచాంబురు। హాక్షా యక్షపసఖనుత * యదుకులదక్షా। రక్షక
సురవిదురద్విప। రక్షా రాక్షసవిదళన * ప్రరుచిరవక్షా॥ గర్భద్వితీయకంద
ము॥ క॥ పక్షగపతిరథపౌంద్రవి। పక్షా భక్షితదవశిఖి * బహుసవదీక్షా। వృ
క్షగసహచరఋక్షస। దృక్షాఋక్షపదుహితృప * ఋషిజనపక్షా ॥ గర్భద్వి
పద॥ అక్షరహారివిక * చాంబురుహాక్ష। యక్షపసఖనుత* యదుకులదక్ష।
రక్షకసురవిదు * రద్విపరక్ష। రాక్షసవిదళన * ప్రరుచిరవక్ష। పక్షగపతి
రథ * పౌంద్రవిపక్ష। భక్షితదవశిఖి * బహుసవదీక్ష। వృక్షగసహచర*
ఋక్షసదృక్ష। ఋక్షపదుహితృప * ఋషిజనపక్ష॥ లాలిపాట॥ అక్షరహారి
విక*చాంబురుహాక్షా * యక్షపసఖనుత * యదుకులదక్షా। రక్షకసురవిదు*
రద్విపరక్షా * రాక్షసవిదళన * ప్రరుచిరవక్షా। పక్షగపతిరథ*పౌంద్రవిపక్షా *
భక్షితదవశిఖి * బహుసవదీక్షా। వృక్షగసహచర*ఋక్షసదృక్షా। ఋక్షపదు
హితృప*ఋషిజనపక్షా॥ లాలి॥ అర్ధచంద్రికలు॥ అక్షరహారివిక * చాంబురు
హాక్షుఁడా ॥ ౧॥ యక్షపసఖనుత*యదుకులదక్షుఁడా ॥ ౨॥ రక్షకసురవిదు*రద్విప
రక్షుఁడా ॥౩॥ రాక్షసవిదళన*ప్రరుచిరవక్షుఁడా ॥ ౪॥ పక్షగపతిరథ * పౌంద్రవి
పక్షుఁడా ॥ ౫॥ భక్షితదవశిఖి*బహుసవదీక్షుఁడా ॥౬॥ వృక్షగసహచర*ఋక్ష
సదృక్షుఁడా ॥ ౭ ॥ ఋక్షపదుహితృప * ఋషిజనపక్షుఁడా ॥ ౮ ॥ పెండ్లిపాట॥
లక్ష్మీకల్యాణవైభవమే॥ అక్షరహారివిక* చాంబురుహాక్షా। యక్షపసఖనుత*

**యదు**కులదక్షా । రక్షకసురవిదు * రద్విపరక్షా । రాక్షసవిదళన * ప్రరుచిర
వక్షా॥ **లక్ష్మీ**కల్యా॥ పక్షగపతిరథ * పౌండ్రవిపక్షా । భక్షితదవశిఖి * **బహు**
సవదీక్షా । వృక్షగసహచర * ఋక్షసదృక్షా । ఋక్షపదుహితృప * ఋషి
జనపక్షా॥ లక్ష్మీకల్యా॥ శ్రీధవళ**ము** ॥ అక్షరహారివికచాంబురు * హాక్షాయక్ష
పసఖ । రక్షకసురవిదురద్విప * రక్షారాక్షసవిదళన । పక్షగపతిరథపౌండ్రవి *
పక్షాభక్షితదవశిఖి । వృక్షగసహచరఋక్షస * దృక్షాఋక్షపదుహితృప॥
౩౯౨ ॥ సువ్వాలే ॥ అక్షరహారివిక * చాంబురుహాక్షా । **యక్ష**పసఖ
సుత * **యదు**కులదక్షా । రక్షకసురవిదు * రద్విపరక్షా । రాక్షసవిదళన *
ప్రరుచిరవక్షా॥ సువ్వీ॥ పక్షగపతిరథపౌండ్రవిపక్షా । భక్షితదవశిఖి * బ
హుసవదీక్షా । వృక్షగసహచర * ఋక్షసదృక్షా । ఋక్షపదుహితృప * ఋ
షిజనపక్షా॥ సువ్వాలే॥ ౩౯౩॥కందద్విపదగర్భసీసము ॥ మకరకుండలకర్ణ *
మహితాభ్రవర్ణ । శకటదానవిపక్ష*కమలజాక్ష । శుభికాలసత్ఫాల * సు
**య**శోవిశాల**య**భిరమతస్నిగ్ధయా * పీతదుగ్ధ । శ్రితదేవతరుమూల * చేదీశ
కాలధృతమణిధరగదారి * తపతికధిత । నివసితవైకుంఠ * నియతాబ్జకంఠ
రవికళాదశుభనేత్ర * విజయమిత్ర॥ తే॥ సతతసనకాదిసన్నుత * చతురచరి
త । యాదవకులసత్యనిరత * యచ్యుతమధు । విదళనహరిశాశ్వతకృష్ణ * వి
దురవరద । భవవిరించినుతాయంచుఁ * బ్రస్తుతింప ॥ ౩౯౪ ॥ గర్భద్విపద॥
మకరకుండలకర్ణ * మహితాభ్రవర్ణ । శకటదానవవిప * క్షకమలజాక్ష ।
శుభికాలసత్ఫాల * సుయశోవిశాల । యభిరమతస్నిగ్ధ * యాపీతదుగ్ధ । శ్రి
తదేవతరుమూల*చేదీశకాల * ధృతమణిదరగదా * రితపతికధిత । నివసిత
వైకుంఠ * నియతాబ్జకంఠ । రవికళాదశుభనేత్ర * రవిజాతమిత్ర॥ గర్భ
కందము॥ క॥ సతతసనకాదిసన్నుత । చతురచరితయాదవకుల * సత్యనిరత
య।చ్యుతమధువిదళనహరిశా । శ్వతకృష్ణవిదురవరదభ * వవిరించినుతా ॥
౩౯౫ ॥ స్రగ్విణీగర్భభుజంగప్రయాతము ॥ నమోదాశకావేణు * నాదప్ర
వీణో । ద్యమాయాశుషేణా*మహాయానవారీ । రమాధీశదామోద * రా
దేవదేవ్యో। త్తమాభేశమిత్రాక్ష * తార్క్ష్యానుయాయీ ॥ ౩౯౬॥ కందగర్భ
మణిగణనికరము ॥ కరధృతజలజునిఁ * గరిపతివరదుఁ । వరతనురుచిజిత
ననదునిఁబరముఁ । బరివృఢుఁగొలిచెదఁ * బరమదశరణుఁ । శరవణభవ
నుత*చరితునిఁగరుణ॥ గర్భకందము ॥ కరధృతజలజునిఁగరిపతి । వరదుని
వరతనురుచిజిత * వనదునిబరముఁ । బరివృఢుఁగొలిచెదఁబరమద * శరణు



న్శరవణభవనుత* చరితునిఁగరుణ॥ ౩౯౭॥ చతుర్విధకందము॥ రెండవచ
రణంబునకు । నెండవగణమాదిగాఁగ * నిర్మించినచో । దండిచతుర్విధకంద
ము ।పాండవపక్షా మెలంగుఁ * బ్రాజ్ఞులసభలన్॥ చతుర్విధకందము ॥ బలు
లేమిచేతవేసరు । చెలికింజిపిటంబులీయఁ*జేకొనికృపతోఁ । గలిమిచ్చినావు
కేరుచు । నెలమింగృపనేగితజ్ఞ * హితవుగవిపులన్॥గర్భద్వితీయకందము ॥
చిపిటంబులీయఁజేకొని । కృపతోఁగలిమిచ్చినావు * కేరుచునెలమిం । గృప
నేగితజ్ఞహితవుగ । విపులంబలులేమిచేత * వేసరుచెలికిన్ ॥ గర్భతృతీయకం
దము ॥ కలిమిచ్చినావుకేరుచు । నెలమింగృపనేగితజ్ఞ * హితవుగవిపులన్ ।
బలులేమిచేతవేసరు । చెలికింజిపిటంబులీయఁ * జేకొనికృపతోన్ ॥ గర్భచ
తుర్థకందము ॥ కృపనేగితజ్ఞహితవుగ । విపులన్బలులేమిచేత * వేసరుచెలి
కిం । జిపిటంబులీయఁజేకొని । కృపతోఁగలిమిచ్చినావు * కేరుచునెలమిన్ ॥
మాలికాచతుర్విధకందము॥ తరతరమవర్ణ మాదిగ । దొరలించినమాలికా
చ * తుర్విధకందం । బరుదారుసుసత్కృతులం । దురగాధిపనవ్యతల్ప *
యుదధిశయానా॥ క॥ శ్రీభూమీనవరదహరి । గోభూమానవవినుతను * గు
ణబుధమధునా । శాభీమానవకృష్ణఘ । నాభామానవహరిదరి * యభవక
మలనా॥గర్భద్వితీయయకందము॥భూమీనవరదహరిగో। భూమానవవినుత
సుగుణ*బుధమధునాశా । భీమానవకృష్ణఘనా । భామానవహరిదరియభ*
వకమలనాశ్రీ॥ గర్భద్వితీయకందము॥ మీనవరదహరిగోభూ । మానవవిను
తసుగుణబుధ*మధునాశాభీ । మానవకృష్ణఘనాభా । మానవహరిదరియ
భవక *మలనాశ్రీభూ ॥ గర్భచతుర్థకందము॥ నవరదహరిగోభూమా । నవవి
నుతసుగుణబుధమధు*నాశాభీమా। నవకృష్ణఘనాభామా । నవహరిదరియ
భవకమల*నాశ్రీభూమీ॥అష్టవిధకందము॥ రెండేసిగణంబులపై । నుండిన
గణమాదిగాఁగ*నొనరఁ గఁ జదువన్ । ఖండితసాంభకఘోటకి । తాండజ
యష్టవిధకంద* మనఁగాఁబరగున్॥ ప్రథమకందము॥ తనకిరుగెలననుగనలు
చుఁ । గొనబయిగిలిపెడుకనుగొలు*కులఁ దగుఁబెలుచ । న్ఘనులనుగలయం
బెనఁకువఁ । గనుచుంగలుములఁదనిపెను*ఖలశృంఖలమై॥ ద్వితీయకందము॥
కనలుచుఁగొనబయిగిలిపెడు । కనుగొలుకులఁ దగుఁబెలుచను * ఘనులనుగ
లయం । బెనఁకువఁగనుచుంగలుములఁ । దనిపెనుఖలశృంఖలమయి * తన
కిరుగెలనన్ ॥ తృతీయకందము ॥ గిలిపెడుకనుగొలుకులఁ దగుఁ । బెలుచన్ఘ
నులనుగలయను* బెనఁకువఁగనుచున్ । గలుములఁదనిపెడుఖలశృం । ఖల

మయితనకిరుగెలనను* గనలుచుఁగొనబై ॥చతుర్థకందము ॥ కులఁదగుఁబెలుచన్ఘనులను । గలయుం బెనఁకువఁగనుచును* గలుములఁ దనిపెన్ । ఖలశృంఖలమయితనకిరు। గెలనను గనలుచుఁగొనబయి* గిలిపెడుకనుకొల్ ॥ పంచమకందము॥ ఘనులనుగలయం బెనఁకువఁ । గనుచుం గలుములఁదనిపెను* ఖలశృంఖలమై । తనకిరుగెలననుగనలుచుఁ। గొనబయిగిలిపెడుకనుకొలు * కులఁదగుఁబెలుచన్॥ షష్ఠకందము॥ పెనఁకువఁగనుచుంగలుములఁ। దనిపెను ఖలశృంఖలమయి * తనకిరుగెలనన్ । గనలుచుఁగొనబయిగిలిపెడు। కనుగొలుకులఁదగుఁబెలుచను*ఘనులనుగలయన్ ॥ సప్తమకందము॥ కలుములఁదనిపెనుఖలశృం। ఖలమయితనకిరుగెలనను* గనలుచుఁ గొనబై । గిలిపెడు కనుగొలుకులఁ దగుఁ। బెనుచన్ఘనులనుగలయను * బెనఁకువఁ గనుచున్ ॥ అష్టమకందము॥ ఖలశృంఖలమయితనకిరు । గెలననుగనలుచుఁగొనబయి * గిలిపెడుకనుగొ । లుకులఁ దగుఁబెలుచన్ఘనులను । గలయుం బెనఁకువఁగనుచును*గలుములఁదనిపెన్॥ కందద్వయసీసోత్పలమాలామణిగణనికరగర్భసరసిజవృత్తము॥ శ్రీవర్ధిష్ణుం బావనజీవు * న్జితభృగుతనయుని* సిరిగలుగుటకై। భావింతు న్సంభావితభావుం * బ్రతియుగసముదిత * బహుతనుమహితున్ । దేవేంద్రాది ప్రస్తుతదేవు * న్దితితనయతుహిన * దినకరకిరణున్। ధీవిద్యాద్యోతున్వసుదేవు*న్ధృతిమదగుణయుతుఁ * ఘృణితవిదురదున్ ॥ గర్భప్రథమకందము॥ శ్రీవర్ధిష్ణుం బావన । జీవున్జితభృగుతనయుని * సిరిగలుగుటకై । భావింతున్సంభావిత । భావుంబ్రతియుగసముదిత * బహుతనుమహితున్॥ గర్భద్వితీయకందము ॥ దేవేంద్రాదిప్రస్తుత। దేవున్దితితనయతుహిన*దినకరకిరణున్ । ధీవిద్యాద్యోతున్వసు । దేవున్ధృతిమదగుణయుతుఁ * ఘృణితవిదురదున్ ॥ గర్భసీసోత్పలమాల॥ శ్రీవర్ధిష్ణుంబావనజీవున్ । భావింతున్సంభావితభావున్ । దేవేంద్రాదిప్రస్తుతదేవున్ । ధీవిద్యాద్యోతున్వసుదేవున్ ॥ గర్భమణిగణనికరము ॥ జితభృగుతనయుని * సిరిగలుగుటకై । ప్రతియుగసముదిత * బహుతనుమహితున్ । దితితనయతుహిన * దినకరకిరణున్ । ధృతిమదగుణయుతుఁ * ఘృణితవిదురదున్॥ వాణీపద్మాంబారతిదరధ్వనితాళమధురగతిగర్భోత్పలమాలికావృత్తము ॥ శారదశాసితప్రసవచాపవిఖండనసామసన్నుతా । తారణదాసపోషధవ * తాపసమండనధర్మతత్పరా । వారణభాసురప్రభవ * ప్రాపకభండనవాసవానుజా । పారదవాసుదేవభవ * పాపవిదండనభర్గపూజితా ॥ గర్భవాణీవృత్తము ॥



శాసితప్రసవ * చాపవిఖండన*సామసన్నుతా । దాసపోషధవ * తాపసమండన* ధర్మతత్పరా । భాసురప్రభవ * ప్రాపకభండన * వాసవానుజా। వాసుదేవభవ * పాపవిదండన * భర్గపూజితా ॥ ౨౫౮ ॥ గర్భపద్మావృత్తము * సవచాపవిఖండన* సామసన్నుతా । ధవతాపసమండన * ధర్మతత్పరా । భవప్రాపకభండన * వాసవానుజా।భవపాపవిదండన * భర్గపూజితా ॥ ౨౫౯॥ గర్భాంబావృత్తము ॥ చాపవిఖండన * సామసన్నుతా । తాపసమండన * ధర్మతత్పరా । ప్రాపకభండన * వాసవానుజా । పాపవిదండన * భర్గపూజితా॥ ౨౬౦॥ గర్భరతీవృత్తము ॥ ఖండనసామసన్నుతా । మండనధర్మతత్పరా । భండనవాసవానుజా । దండనభర్గపూజితా ॥ ౨౬౧॥ గర్భదరధ్వనితాళము॥శాసితప్రసవ* దాసపోషధవ। భాసురప్రభవ * వాసుదేవభవ॥ ౨౬౨॥ గర్భమధురగతిరగడ॥ శాసితప్రసవ * చాపవిఖండన । దాసపోషధవ * తాపసమండన । భాసురప్రభవ * ప్రాపకభండన । వాసుదేవభవ * పాపవిదండన॥

## ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజగోత్ర కాకమెపల్లిపురమందిర నందనందన చరణారవింద వందనాభిలాషమనీషా ప్రాభవ వేంగళార్య తనూభవవిద్యావిశేష సురాచార్య కాకునూర్యప్ప కవివర్యవిరచితంబైన యాంధ్రశబ్దచింతామణియను వ్యాకరణశాస్త్రంబునందు మూలసూత్రంబులును-ఛందఃప్రభావంబును-ఛందోవ్యాపక సంప్రదాయంబును - ఛందస్స్వరూపంబును-నితిహాసాదిస్వరూపంబును-గద్యవచనంబులును-ప్రథమప్రత్యయోద్ధారణక్రమంబును-గణజననచ్ఛందంబులును-గురులఘునిర్ణయంబును-సర్వగణలక్ష్యంబులును-గణాధిదేవతాఫలంబులును- అష్టగణలక్ష్యంబులును-దేవతానరాంకితనియమంబులును-నాయకగణకూటంబులును-గృత్యాదిగణద్వయకూటంబులును-ప్రశస్తకూంటబులును-దోషాదోషబాహుళ్యఫలంబులును-గణద్వయయోగఫలంబులును-గణనాథయోగఫలంబులును-షట్ప్రత్యయంబులును-బద్యలక్ష్యోపయోగిసంజ్ఞలును-షడ్వింశతిచ్ఛందోజాతసమవృత్తంబులును-ముఖ్యగౌణవృత్తంబులును-మాలికావృత్తవివేకంబులును-జాత్యుపజాతులును-చిత్రబంధగర్భకవిత్వంబులును గల

చతుర్థాశ్వాసము - సంపూర్ణము.



శ్రీరస్తు.

# అప్పకవీయము - పంచమాశ్వాసము.



శ్రీకృష్ణాపూర్వతట । ప్రాకారప్రాంతకుతల * పరిశోభితవ ।
ప్రాకరకేతువరనగర । నాకారివిదిక్త్రియోజ * నస్థితభవనా ॥

క॥ అవధారుశబ్దశాసను । డవనిఁగలియుగమునఁ గాది * నారాజమ
హేంద్రవరంబునఁజెప్పినయుం । ధ్రవచోవ్యాకరణసూత్ర * తతిఁ
దెనిఁగింతుఁ ॥

ఆ॥ ఆంధ్రసంధులెల్ల * నష్టాదశార్యల । సుకవులౌనటంచుఁ * జో
ద్యమంద । చత్రితాద్రినాథ * శబ్దానుశాసనుఁ। డవనిఁ దేటపఱిచె
నతిముదమున ॥

సంధిపరిచ్ఛేదమూలసూత్రములు.

ఆర్యావృత్తశ్లోకంబులు.

తిజ్మధ్యశేషషష్ఠీ సుస్కర్మప్రవచనీయజవిభక్తీః । కిఞ్చిత్ప్రశంసనాద్భు తసన్తాపయదాతదాకిమేవాంశ్చ॥ ౧॥ క్త్వాకిలతూష్ణీమాద్యానభిజధతికలా ద్రుతోనయేషాంస్యాత్ ।అన్యేద్రుతప్రకృతయోయేన్వ్యర్థ్యానుజీవితద్రు తాసిత్యమ్॥ ౨ ॥ సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయంయస్యద్రుతప్రకృతికేభ్యః । లుక్సంశ్లేషౌనాచిద్రుతస్యసర్వత్రలుక్సమాసేషు॥౩ ॥సన్ధిర్నాచోకన్యనుతో వాతోనాదిషువిభక్తిషూతోవా।నిత్యమనుత్తమపురుషక్రియాస్వితఃపరిమి తౌసమస్తానామ్ ॥ నస్యాత్తద్ధర్మోతశ్చేర్వాస్యాద్వర్తమానవిహితస్య । తద్వత్తదాదిజస్యప్రాయస్తుస్యాత్కిమాదికస్యేతః ॥ ౫॥ అపిశబ్దేతోలుగ్వా స్యాదిచ్ఛవిభక్త్యన్తిమస్యజేరలిచ।శబ్దాత్తచ్ఛబ్దాతోలుగ్ధారార్థేతఉదపిశే షస్యేత్ ॥ ౬ ॥ సామానాధికరణ్యేషూవన్తానాంటుగాగమోకరిస్యాత్ । ధాతుపదసమ్భవానాం విశేషణానాముతస్తథానుమచి ॥ ౭ ॥ షష్ఠ్యాఉతో చినుమ్నేచాద్యస్యాత్రమేడితేకన్త్యలోపశ్చ । అహమాదీనాంద్విత్వేంలోపోన మఆదికేవిసర్గశ్చ॥ ౮ ॥ బోరద్భుతశబ్దార్థే పోశ్చతదాద్యర్థవాచకేషూతః । వికృతిపదేలాటోరప్యపధారేశ్చాపితశ్చలుగ్వాస్యాత్ ॥ ౯॥ పదమధ్యనరల



డానాముతశ్చ పూర్వప్రయోగసిద్ధానామ్ । లోపోవాస్యాత్తేషామితశ్చ తద్వత్త్రివిక్రమమతేన । కవిభల్లట్టి గ్క్రియాణాంనామ్నాముల్లోపఇష్య తేహ్యేషు । ప్రథమైకవచనమాత్రేవికృతౌనాన్తాదయోకపికథ్యన్తే ॥౧౧॥ ఔపవిభక్తికసంజ్ఞావర్ణాష్టింట్యాదయోభవన్తీహ । రుల్వాదేర్నామ్నాం స్యుస్తేహ్ంవిభక్త్యాసమాసేచ ॥౧౨॥ ప్రథమావైభక్తికమోర్లుక్ పూర్ణోవా పతిక్రియార్థేషు । తస్యసమాసేపుంపూనుమ్చోతోహల్యథర్వణార్యమతా త్॥ ౧౩॥ శత్రర్థేతూతశ్చానోన్తస్యస్యాచ్చపూర్ణబిన్దురపి।వాత్మాస్మదోర్ద్వి తస్యస్యాల్లుగ్వాక్యాన్తగతపదానాంచ॥ ౧౪ ॥ పరుషాద్రుతప్రకృతికాత్సర ళాస్స్యుస్తద్ద్విరితంచబిన్దుస్స్యాత్ । అవికారగతేతస్మిన్నపిసరళా ఏవసన్తి తేపరతః ॥ ౧౫ ॥ లుగ్వానప్రకృతిపదాత్పరతస్సరళేస్థిరేచనస్యస్యాత్ । అలు కిచసంశ్లేషస్స్యాద్బిన్దుంప్రవదన్తితంక్వచిత్కేచిత్ ॥ ౧౬ ॥ ప్రథమలుగపి ద్విర్నులోపోర్ద్విరితస్యసర్వత్రలుక్సమాసేషు । హేమోక్తేః పరుషాణాంగసడద వాస్స్యుః పదాద్ద్వన్ద్వే॥ ౧౭ ॥ గసడదవాస్స్యుఃప్రథమామాత్రాదాత్మాస్మ దోర్ద్వినాపరుషాః । నవికృతిశబ్దాత్పరతస్సంస్కృతికానాం భవన్తిగసడ దవాః॥ ౧౮॥ ఇతి సకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాన్ధ్రశబ్ద చిన్తామణౌ సన్ధిపరిచ్ఛేద స్తృతీయః ॥

వ॥ ఈశ్లోకంబులు పదునెనిమిదియును నలువదియెనిమిది సూత్రం బులయ్యె నవియెల్ల నిందు వివరించెద ॥

తే-గీ॥ హేమచంద్రత్రివిక్రమ*వ్యాఘ్రులాదిఁ। బ్రాకృతముత్రోవఁ జూపిరా * ప్రాకృతంబు । నందుభేదంబుగావున * నాంధ్రమునకుఁ। గలుగు లక్షణమెఱుఁగఁగ * వలయుఁగవులు॥౨౦॥ ఆ॥ తెలుఁగుబాసయెంత* దెలిసి యుండినదీనిఁ । జదువకున్నఁగవిత * చక్కఁగాదు । ఇంటిలోనహేమ * మెం తగల్గిననేమి । తొడవుసేయకున్నఁ * దొడుగరాదు॥ ౨౧॥ క॥ పదసంధులు చెడనడికినఁ । బదపద్యములార్యసభలఁ*బరువడిపోస్యా । స్పదములగుఁగా నవైకృత । పదసంధివిధములు తేట*పఱిచెదవరుసన్॥ ౨౨ ॥ క ॥ ఎనఁగవి సంధియునుమహా । విసంధియుఁగుసంధిదోష * విధమునుదుస్సం । ధిసమా ఖ్యయునననాల్గును । బొసఁగింపరుసంధిదోష * ములటంచుఁగవుల్॥ ౨౩॥ తే-గీ ॥ హరిముసలికిరిఅనుజుండు * అర్జునునకుఁ । జెలియనుచునిట్లుగుడుసు పై * శృంగముపయి। స్వరములకుసంధిగలుగక * సాగనేని । దానినివిసంధి యండ్రుస * త్కవులుగృష్ణ॥ తే-గీ॥ సాల్వభూమివరున్నండ * బధ్వజుండు ।

ధరణిఁ గూర్చెసురల్యద్భు* తంబు నొంద । ననుచుఁ బొల్లులవలపల * నచ్చులు న్న । జరుగును మహావిసంధిదోషంబ నంగ ॥ తే-గీ ॥ మగువ ప్రేక తెసారె తెల నాకు *మదుపులీయఁ । బోలఁ తోక తె తెల్ల సవరంబుఁ * బూనివిసరఁ। జేడొక తెచక్రితోనెత్తె * మాడెననఁ గు। సంధియగునిట్లు గలయని * సంధులదుక ॥ క॥ ఎందును దుస్సంధి సమా । ఖ్యందిరమగు నందునిందు *ననుచో నందు । న్నిం దున్నని పై నచ్చులు । పొందసముచ్చయనకార * ములు గృతి నూఁదన్ ॥ ౨౪ తే-గీ॥ తొలుతనీసంధిదోష * చతుష్టయంబు । చెందకుండఁగఁ గావ్యము * లొప్పవలయుఁ । గానఁ దెలియంగ సంధిల * క్షణము లెల్ల । విన్నవించెద గోపాల *విమలశీల॥ ౨౫॥ క॥ వుడు ములు ప్రథమై కో క్తికిఁ । గడఁ గూర్చినయది విభక్తి * కంబనఁ బడుఁ శా । ల్పడియవిచెందనినుడు గె । ప్పడునవిభక్తికము నామ * మనుననఁ బరగున్ ॥ క ॥ తరువనహారుఁడ నఁబురమనఁ । బరగనివివి భక్తికములు * బరువు పురుడు సుం । దరి దురమను నివి యెల్లను । నరసఖ యవి భక్తికములు *నాముములు నగున్ ॥ ఆ॥ వెనుక నున్న పదము * కొనయక్షరంబుతోఁ । బై పదంబు మొదలి * ప్రాణమునకు । సూత్రమున ననుసంధి * చొప్పడ కున్నన । ప్పట్లబుధులు ప్రకృతి * భావమండ్రు॥ ౨౬ ॥ క॥ తొలఁగిచనుఁ దొలఁగకుండును । గలుగును లేకుండునవును * గాకుండునుని । చ్చలు వచ్చునురాకుండును । జెలువార వికల్పమనుచుఁ * జెప్పెడుచోటన్॥ క॥ మొదలనుజెప్పినవిధమున । కొదవువికల్పంబు లేక * యొక్క తెఱఁగునన్ । బదపడి నిలిచిన దానిని। యదుగోత్రపవిత్ర నిత్య * మండ్రు సుధీరుల్॥ తే-గీ॥ పుడమిఁ దొల్లింటి రాజుల *వెడలనెత్తి । వారి నెలవులఁ దాముండు * వైరినృపుల । పగిది మునుపున్న ప్రాలను *బాఱఁదోలి। తామచట నిల్చు నాదేశ *నామకములు॥ తే-గీ॥ వెండికొండను నెలకొన్న *వేల్పు తేని । చెంత నత్యంత మైత్రి మైఁ* జేరియుండు । యక్షుగతి శబ్దమునఁ గల్గు* నక్షరంబు । పొంతను క్తానుగమము పొందఁ * బూనినిల్చు॥ ౨౭॥ తే-గీ॥ పదములను మున్ను గల ప్రాల *తుదిని దాము । నతికి కొనినిల్చులిపులు ప్ర * త్యయములయ్యె । మునుపదములఁ గలవర్ణ *ములు నిలుపక । తొలఁగిచనుట లోపంబని *పలుకఁబడును ॥

శబ్దానుశాసనమూలసూత్రము.

ఆర్యావృత్తశ్లోకంబులు ద్రుతప్రకృతికసంజ్ఞ.

తిజ్మధ్య శేషషష్ఠీసుస్కర్మప్రవచనీయజవిభక్తీః । కిఞ్చిత్ప్రోశంసనా మ్ఛతసన్నాపయ దాత దాకిమేవాంశ్చ । క్త్వాకిలతూష్ణీ మాద్యాసభి



దధితికళాద్రుతో నయేషాంస్యాత్। అన్యేద్రుతప్రకృతయోయేస్యు ర్హ్యానుజీవితద్రుతానిత్యమ్ ॥

క॥ వలసినచోఁ దుది ద్రుతములు। తలచూపెడుశబ్దములు ద్రు*తప్రకృతులనన్ । వెలయునవి ప్రౌఢమకుండెడు । తెలుఁగుపదంబులు కళాప్ర * దేశములయ్యెన్॥ ౩౦॥ తే-గీ॥ ధాతధాతను భూపతి * ధరణిపతిని । జనకుజనకు నిగనియొఁగ * నైనియెననుచుఁ । గడ ద్రుతములిట్లు లోపము*ల్గాంచివలయు। పట్లఁ గనుపట్టునవి ద్రుత * ప్రకృతులీశ॥ క॥ వికృతిపదంబులలోపల । నకారములువలయుచోఁ గొ*నలఁబొడము ద్రుత। ప్రకృతులసంఖ్యంబులు గొం । కకయవిమొన్నంగనలవి * గాదహిపతికిన్ ॥ ౩౧॥ తే-గీ॥ గూను నెమ్మేను మెడ నాను* మిూను పేను । మాను వరి చేను పులి బోను * మఱియునిట్లు । భువిన కారంబుతోఁ గూడఁ*బుట్టిశబ్ద । ములు ద్రుతప్రకృతులుగావు * మునిశరణ్య. తే-గీ॥ అన్ను బంగరు పొన్ను చా * యయగుతెన్ను । చెన్ను పులిజున్ను దొరపన్ను* జొన్న యెన్ను । మొదలుగా జడ్డలు నకార * ములకుఁ దుదిని । దనరు పదములు గావు ద్రు*తప్రకృతులు॥ ఆ॥ తన్ను నిన్ను నన్ను* విన్ను మున్నా మిన్ను । చన్ను కన్ను వెన్ను* శబ్దములకు । జడ్డలుండుఁ బోవుఁ * జర్చింపనివి ద్రుత। ప్రకృతులెపుడుఁ గావు*భక్తసులభ ॥

కళాప్రదేశములు.

సీ॥ ఇనుఁడు గోత్రము గోవు * జనుల నియిబ్బంగిఁ బలికెడు ప్రథమా విభక్తులందు । రాముఁ గూర్చి రణోగ్ర *భీముఁ గూర్చియటంచుఁ దెలిపెడు కర్మ ద్వి*తీయలందుఁ । గృష్ణునకై సుకో *విష్ణునికై యనితొడిఁబడనుడుగు చతుర్థులందు । బలునిఁ బట్టి మురారిఁ బట్టుండియనిపలికెడు పంచమీ విభ *క్తితుదలందుఁ ॥ తే॥ బద్మబాంధవసుతయొక్క * భద్రయొక్క । జాంబవతియొక్క యను శేష* షష్ఠులందు । క్షితిసముచ్చయములఁ దక్క* ద్రుతముగానఁ। బడదుగావునఁ బల్కఁగ*బడుఁ గళలని॥ సీ॥ సుగ్రీవుఁడే వాయుసూనుఁడే యనుచునే వార్థములు దెలుపు వ్యా * హారములును । నటియించె నఁటపాడె * నఁట కూడెనఁట యనులలితకిలార్థాను*లాపములును । వింటిమి కంటిమి * వేఁడిరటా చనీమాడ్కి నిబలుకుతి * ఙ్మధ్యములును । గాంచి విచారించి * కరుణించియని యెడు క్త్వాప్రత్యయాంతార్థ * వాచకములు॥ తే ॥ నుఱికమిన్నకసేయక * యెఱుఁగకయను । నట్టితూష్ణీంపదార్థవా * క్యములునాది । శబ్దముండుటచేతను * జనియెసుమ్ము । కనియెఁ గదయనునవియును * గళలుకృ

ష్ణ॥ ౩౬॥ తే-గీ॥ నవ్వుచున్నాఁడువచ్చుచు * న్నాఁడువాఁడు । మనఁగలఁడ న్నఁదిబ్బ్మధ్య * మంబులెందుఁ । గాకయునుప్రథమలలోనఁ*గలసిసరసి । జాతనేత్రక్శాప్రదేశంబులగును ॥ సీ॥ కటకటయక్కట * కట్టయయ్యోయని పరితాపమునఁబల్కు * భాషణములు । ఔరబళీమజ్జ * యయ్యారెయంచుఁబ్రశంసించునంధ్రభా * షాపదములు । నిదిక్రొత్తయిదివింత * యిదిలె స్సయద్దిరా యోహోహోయనుమహాద్భు * తోదితములు । నించుకగోరంత* యిసుమంత । చీమంతయావంతయనుకించి * దర్థములును॥ తే-గీ॥ హరిహ యాత్మజసఖయిప్పు * డప్పుడెప్పు । డనియెడుయదాతాద్యశ * బ్దార్థములును । నెద్దియెయ్యదియేది* యేమియనుకి । మర్థములునుగశాసంజ్ఞ * లంగజపిత॥ ౩౭॥ తే-గీ॥ ఇంతియేకావుతెనుఁగున* నిట్టికళలు । మధునిషూదనవెదకిన * మఱియుఁగలవు । వీనికొనలద్రుతంబులు* గానఁబడవు । తాపసమనోనివేశ*కామెపలీశ ॥

## సంధివివేకము.

క॥ వెనుకటిశబ్దమునకుఁదుది। దనరెడువర్ణమునుబైప*దమునకుమొదలం । గనుపట్టునక్షరంబును । సనకస్తుతకూర్చిపలుక * సంధియనఁజనున్ ॥ క॥ వినుప్రాణసంధులును వ్యం । జనసంధులు ననఁగ శబ్ద * సంధులు గృతులన్ । దనరారునిరుదెఱంగులఁ। గొనకొనితద్విధములెఱిఁగి*కూర్పఁదగుహరీ॥ ఆ॥ మీఁదిశబ్దములకు*నాదివర్ణంబులు।స్వరములైనఁబ్రాణ*సంధులయ్యె। హల్లులయ్యెనేని * వ్యంజనాక్షరసంధు।లయ్యెవాని తెఱఁగు * లరయువలయు॥ ౪౦॥ తే-గీ ॥ పొల్లులైహల్లులెల్లను * బుట్టెఁదపఁ । బ్రాణములఁగూడుకొనిబహు * భంగులైన । కతనహల్లులఁగలతలకట్లుగుడులు । మొదలుగానిన్నియునుస్వరం* బులునిజంబు॥ ఆ॥ ఎచటసంధిగలుగు* నచటఁ బూర్వపదాంత । హల్లుతోడఁ గూడి * నట్టిస్వరము । లోపముగనొనర్చి * యాపొల్లుతోమీఁది । యక్షరంబుగూర్ప* నయ్యెసంధి ॥ ౪౧

## స్వరసంధిలక్షణము.

క॥ అరయశకంధ్వాదిషుశేః।పరరూపంవాచ్యమనుచుఁ * బ్రక్రియలోనన్ । వరరుచివాక్యముకలిమిని । బరరూపమువికృతిఁగానఁ *బడుస్వరసంధిన్ ॥ తే-గీ ॥ కృష్ణుఁడవ్యయుఁడాద్యుఁడిభేంద్రవరదుఁ । డీశ్వరుండుత్తముండూర్జి* తేష్టఫలదుఁ । డేకపమఁడైంద్రదనఖుఁడోష*ధీశుఁడౌర్వ। శేయసుతుఁడనసంధులు*సెలఁగునిట్లు ॥



## ఆంధ్రపదాదియకారమునకు శబ్దానుశాసనమూలసూత్రము.

సర్వత్రాజ్వత్కార్యంజ్ఞేయంయస్యద్రుతప్రకృతికేభ్యః ॥

ఉ॥ ఆరయవైకృతోక్తులఁబ * దాదులయందుయకారముండదా । తిరుగఁబల్కవ్రాఁతగణు * తింపఁగనచ్చగుదానిదాపలన్ । నీరజనాభనాంతములు * నిల్చిననచ్చటఁబ్రాణసంధిచె । న్నారునితండుచైద్యవసు * ధాధిపునేపడఁగించనేఁడనన్॥ వ॥ నాంతములనఁగాద్రుతప్రకృతులపేరు॥ క॥ శృంగాంత్యవక్రయుగముల । సాంగత్యమువాకునాంధ్ర * సంస్కృతములనా। దింగలుగదట్టివ్రాఁతధ । రంగలయుద్రుతాంతములను * బ్రాణములట్లన్ ॥ ౪౪॥ క॥ ముంగాముఱువులునాలుగు । నుంగరములుమూఁడునేడు*నొడ్డాణంబుల్ । పొంగుచునొసంగహరియొక । యంగననురమించెనను * దాహారణంబుల్ ॥

## ద్రుతప్రకృతిస్వరసంధిలక్షణము.

### శబ్దానుశాసనమూలసూత్రము.

లుక్సంశ్లేషౌనాచిద్రుతస్యసర్వత్రలుక్సమాసేషు ॥

తే-గీ॥ అచ్చుపరమైననాంతప * దాంతమునకు । సంయుతమును లోపంబును * జగతిలేవు । సంయుతంబయ్యెనేనిదు * స్సంధియగును । లోపమైనగ్రామ్యంబగు * లోకవినుత॥ ఆ॥ చూచెనింతిననెడు*చోటఁజూచెన్నింతి । ననిసంధిదోష * మయ్యెఁగృతులఁ । బొడిచెనర్కుఁడనెడు * నెడఁబొడిచెర్కుండు । ప్రాచిననఁగగ్రామ్య*భాషయయ్యె ॥ ౪౫ ॥ క ॥ ధరణిద్రుతప్రకృతులపై । స్వరపూర్వపదములుగదిసి * సంధిగలయుచో । నరకానురదమనద్రుతా । క్షరములులోపములుగాక * కడపటనిలుచున్ ॥౪౬॥ క॥అవిభక్తికతత్సమములు। భువినటువలెనుండునాంధ్ర* ములునచ్చులపైఁగవసిననుబ్రకృతిభావము । లవుశృంగాంతములుదక్క * నహిపతిశయనా॥ఆ॥ హరియొసంగుమోక్ష*మాచక్రియంగన।యుందుభక్తినిలుప * నబ్బుసిరులు। నిక్కమనుచుదీని * ముక్కంటియెఱుఁగును । నలువయెఱుఁగుగట్టు * తులువయెఱుఁగు॥ ౪౭॥ తే-గీ॥ కుత్సనుతయవిభక్తిక * తత్సమాంత । శబ్దములరెంటికొమ్ముల * స్వరములదుకు।శీతరుక్కద్రిరాజేంద్ర * జిత్తనంగఁ । బచ్చవిలుదాలుపెక్కుఁడు * బంటనంగ॥ ౪౮॥

## వ్యంజనసంధి.

క॥ పొల్లులగువ్రాలకవతలి । హల్లులుద్విత్వంబులగుచు * ననురాంతక

సం। ధిల్లునువ్యంజనసంధులు । తెల్లమిగాఁదద్విధములు * తెలియఁగవల యుఁ॥ ౫౧ ॥ తే-గీ॥ ప్రాణపరుషాదిసంజ్ఞలు*పలికివాని । యందొకక్క రమునకుల * త్ర్యములుపలికి । దాని తెఱఁగుననాసంజ్ఞ* దనరుసట్టి। ప్రాల కెల్లనుబట్టింప * వలయునెందు ॥

అకారాదిసంధులు.

శబ్దానుశాసనమూలసూత్రము.

సంధిర్నాచోఽచ్యసుతః.

తే-గీ॥ పొల్లయగుపూర్వశబ్దాంత*హల్లుమీఁదఁ । బరపదాద్యచ్చు నిలిచెడుఁ*బ్రాణసంధి । కొమ్ముపైఁదక్కనితరస్వ * రమ్ముమీఁద । సచ్చు గదిసిననచటలే * దాంధ్రిమునకు ॥ సీ॥ కడులెస్సయగుపట్టు * కమ్మిపుట్టం బనజాళువారొఱపుప * చ్చడమనంగ । సిరియన్నఁబురణించు * చిన్నినె మ్మోమననలదునుమీఁయింత * వైరమనఁగ । జన్నెయావులపాల * చవి చెప్పరాదనరేమొండవిరహంబు * రేఁచుననఁగ । మైయొప్పచూపట్టెఁ * బైయంటవెదకినఁగలదొ యించుకలేదొ * కౌననంగ ॥ తే-గీ॥ ధనమొకో యింతులకుఁజక్కఁ * దనమనంగ । నలినమునివాసమామెల * నాగహారి కి। దేవియనసీపదింటిపైఁ * దెలుఁగులందు । స్వరములెదిరినఁబ్రకృతిభా* వంబెనిలుచు॥ ౫౩ ॥ క॥ ఒప్పగుపేరెదనొప్పల । కుప్పననారతమునుంచు* కొనుగోవిందుం । డెప్పుడుభోగించుననం । దప్పకకొమ్ముపయిసంధి* దనరు రమేశా ॥

అదంతసంధి-శబ్దానుశాసనమూలసూత్రము.

వాऽతః॥

తె॥ గీ॥ నెట్టనవికల్పమునఁదల * కట్టునకును । స్వరముపైనిల్చునప్పు డు * సంధిగలుగు । హరికిబలదేవుతల్లిపె * ద్దమ్మయనఁగ । నల్లపాండునిస తిమేన * యత్తయనఁగ॥

విభక్తిసంధి-శబ్దానుశాసనమూలసూత్రము.

అనాదిషువిభక్తిషూతోవా॥

తె-గీ॥ ప్రథమదక్కంగనితరవి * భక్తులందుఁ । దుదలఁ గొమ్ములుగలవి భ * క్తులకుషష్ఠిఁ । బలుకుకాగుడికినివిక * ల్పంబువలన । నిలద్రుతప్రకృతి త్వంబు * గలుగుచుండు॥ ౫౬॥ సీ॥ నిన్ను నేనెఱుఁగంగ * నేనెంతవాఁడనున న్నేలుకొనుముఘృ*ణాసముద్ర । సారెనీకొఱకునం * జలిమోడ్చెమొ్రెక్క



దనిమ్మునాకొఱకై హి * కమ్ములెల్ల । నీకునాశ్రితులువా * ణీనాథముఖ్యులు గణుతింపనాకేడు * గొడయునీవె । నిలువఁజేయుమునాకు * నీయందునతిభ క్తిస్వజనులందర్మిలి * నిజమునీకు ॥ తే॥ ద్రౌపదికినక్షయాంబర * దానమి చ్చి । సవ్యసాచికాయోధన * జయమొసంగి। ప్రోచుపగిదినిమమ్మునె * ప్పు డునుగావు। మయ్యశ్రీకృష్ణయనఁగల * త్ర్యంబులయ్యె॥ తే-గీ॥ రాముఁడధి కుండుతారక * బ్రహ్మమాశ్రి । తౌఘసురధేనువామేటి * యనుజులహిత । భంజనులటంచుఁబ్రథమావి * భక్తులందుఁ । గొమ్ములకుసంధివచ్చుని * త్య మ్ముగాఁగ॥ తే-గీ॥ కూర్చివిడిచిద్వితీయఁబ * ల్కునవిమూఁడు । నవతలివిభ క్తిఁదెలుపువా* క్యములునాల్గు । వలనకంటెలోపలనను * వచనములును బదివిభక్తులలోద్రుత* ప్రకృతులయ్యె॥ ౬౦ ॥ సీ ॥ తాటకనొకకోల * ధర ణిపైఁగూల్చెనుమొక్కలపునుశాహు* నుక్కడంచె । మానులనానంద * మగ్నులఁగావించెవారిచేనందెదీ* వనలుపెక్క । జనకునిచేతన * ర్చనములు గాంచెనుఘనతతోనధ్వరా * గారమునను। వరశక్తితోడనీ * శ్వరువిల్లువిఱి చెనునసులకంటెనమర్త్య * వరులుపొగడ ॥ తే-గీ॥ వెసవిదేహసివలనను * ర్వీతనూజ। మిథిలలోపలనుద్వాహ* విధినిజెందె । ద్యుమణికులుఁడనవివి భ *క్తులుపదియును। ధరణిద్రుతప్రకృతికలుని * త్యముగనగును॥ ౬౨॥

భూతార్థక్రియాసంధి-శబ్దానుశాసనమూలసూత్రము

నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః ॥

తే-గీ॥ వసుధనుత్తమపురుషైక * వచనమునను । దక్కభూత క్రియా పదాం * తములఁగల్గు। నిత్తులకుమీఁదనచ్చులు*హత్తునపుడు । నిత్యముగ సంధులుఘటించు* దైత్యదమన॥ తె-గీ॥పుడమిసూత్రోక్తముత్తమ *పురు షమనుచుఁ । దత్పురుషమెల్లఁగొనరాదు * తద్బహూక్తి । మున్నుతిజ్మధ్య ములతోడ * నెన్నకతన । నిత్యముగఁబ్రాణసంధిదా* నికిఘటించు॥ తే-గీ॥ వనినిదీవించిరఁటమునీ * శ్వరులునిన్ను । రవిజునేలితివఁటనీవు * రామచం ద్ర। మీఁదుగట్టితిగఁటకపు * లారజలధి । వింటిమీవార్తమేమన* వెలయుని ట్లు॥ క ॥ విరచించెనుశ్రీనాథుఁడు । ధరణినిశృంగారనైష * ధంబునఁగూ ర్పుం। గరియొండొరుసనికానక । పరపురుషక్రియలఁబ్రకృతి*భావముగలదే॥ వ॥ నైషధంబునగుడిమీఁదవిసంధిగాశ్రీనాథుఁడుచెప్పినపద్యము॥మ॥ బలభి ద్వహ్నిపరేతరాజసరుణు * ల్పర్యుత్సుకత్వంబుసం । ధిలఁగూర్చుండిరియొం డొరుంగదిసియ * ర్థించత్సిదేశంబున । న్నలనాలీకమృణాళనాళలతికా

నవ్యప్రణాళీమిళ । ల్లలనాలాపకథాసుధానుభవలీ * లాలోలచేతస్కులై ॥

క॥ గరుడధ్వజప్రథమోత్తమ । పురుషైకవచనములెల్ల * భూతార్థమునన్ । ధరనగుద్రుతప్రకృతులు । భరియించెనుపేంద్రుఁడేనుబ్రతికితిననఁగన్ ॥

వర్తమానక్రియాసంధి.

తే–గీ॥ వర్తమానత్రిపూరుష * వచనములకు । జరుగుస్వరసంధులని శబ్ద * శాసనుండు । చెప్పఁడయ్యెఁగొమ్ములసంధి * సిద్ధమగుటఁ । బ్రథమసూత్రంబునన కానఁ * బడుటఁజేసి॥ ౧౩ ॥ మ॥ చనుచున్నాఁడదెసీరిగోపకులుపజ్జంజీరుచున్నారహో । యనుచున్నావఘవైరిసీవరుగుగా * ర్యాంబేమనన్మీరలు। న్వినుచున్నారెఱంగింపుఁడెద్దియుసువా* నేచెప్పచున్నానిఁకన్ । జనులారాచోరనీయమాత్రవజముని * చ్చల్నిల్చుచున్నామనన్ ॥

భావిక్రియాసంధి.

తే–గీ॥ భావిపదములలోద్రుత * ప్రకృతిగాన । నూర్వఁగలననుత్తమోక్తిదక్కఁ । దక్కినవిశృంగములుతుదిఁ*దాల్చుకతన । స్వరపరములైననిత్యమై * సంధిఁజెంపు ॥ ౧౫ ॥ తే–గీ॥ కావఁగలఁడచ్యుతుఁడుమెచ్చఁ * గలరమరులు । తొడరఁగలవర్కనందను*తోడనీవు । మెలఁగఁగలరానదుషిఱుందమీరుభూమి । కాంతులారమేముచూడఁ * గలమనంగ ॥ ౧౬

పరిమాణసంధి–శబ్దానుశాసనమూలసూత్రము.

పరిమితౌనమస్తానామ్ ॥

సీ॥ కనిపెడుత్రవేలెడు * కమికెడుజేనెడుమూరెడుచేతెడు * బారెడనఁగఁ । జేటెడుపుడిసెడు * చేరెడుదోసెడుగంపెడుపుటికెడు * గాదెడనఁగఁ। జెంబెడుపుత్తెడు * చెరివెడుబిందెడుపఱఁకెడుకుండెడు * బానెడనఁగఁ । బారెడుచిట్టెడు * పడెడుసోలెడుతవ్వెడామానకుంచెడు * తూమెడనఁగఁ । నక్కెడనవిసెడననెక్క * చిక్కెడనఁగ । వాటెడసఘోమెడనఁ బెద్ద * వామెడనఁగఁ।బరిమితార్థంబుతుదినిల్చు*పట్లనిట్లు। ప్రాణములనెల్లఁదఱిమిడ * కములుబలయు ॥ ౧౭

తద్ధర్మార్థక్రియాసంధి–శబ్దానుశాసనమూలసూత్రము.

నస్యాత్తద్ధర్మోత్తేః ॥

తే॥ ఉర్విఁదద్ధర్మమునఁబ్రథమ*మోత్తమాఖ్య । పురుషములనేకవచనముల్* పోవవిడిచి । కడమపదములుతిజ్మధ్య * కములుగానఁ । గొమ్ములనుబ్రాణసంధులుగూర్చుటొప్పు॥౧౮॥ క॥ కాంతురజప్రభృతులునిను । సంతతమును



బ్రోతువీవు*సనకాదులమ । ర్దింతురభవుండునీవును । బంతంబులఖలులననుచుభావింతు మెవర్ ॥ క॥ వదలకతద్ధర్మములను । బాదలెడుప్రథమోత్తమాఖ్య * పురుషైకవచః । పదములుద్రుతప్రకృతులగుఁ । బదరుననతఁడోర్తునేను*బలుమఱుననఁగన్ ॥ ౨౧

వర్తమానార్థద్రుతప్రకృతులు. శబ్దానుశాసనమూలసూత్రము.

చోర్వాస్యాద్వర్తమానవిహితస్య.

తే॥ పదపదార్థమపేక్షింపఁ * బడినయట్టి । వర్తమానార్థమునషష్ఠ * వర్ణశృంగి । కంబుతుదిఁగల్గుపదమువి * కల్పమునద్రు। తప్రకృతియగుఁగైటభ*దర్పదళన॥ ౨౨ ॥ క॥ కేశవునెయ్యనదగ్గఱఁ । జేరుచునుగుముష్టిహాతికిఁ*జిక్కక వేగం । దారుచహంకృతిఁగ్రమ్మఱ । దూరుచధోక్షజుఁడుమల్లుఁ * ద్రుంచెననంగన్ ॥ ౨౩

తదాదులు–శబ్దానుశాసనమూలసూత్రము. తద్వత్తదాదిజస్య.

క॥ తుదిగుడులనమకునదియది । మొదలగుపదములవికల్ప * మునస్వరసంధు । ల్పదతియదెవ్వతెచూపుమ । యదియిదియనినన్నుఁబలుక * నన లక్ష్యంబుల్ ॥

కిమాదులు–శబ్దానుశాసనమూలసూత్రము.

ప్రాయస్తుస్యాత్కిమాదికస్యైతః ॥

క॥ కమలాక్షుయేమియనువా । క్యముమొదలగువానితుదలఁ * గలగుడులనుబ్రా * ణములందువికల్పంబున । హిమగిరియేమనియెనేమి * యిచ్చెమనకనన్ ॥ ౨౫

అపిశబ్దసంధి–శబ్దానుశాసనమూలసూత్రము

అపిశబ్దేతోలుగ్వాస్యాత్ ॥

క॥ ఏనియనుమాటకడపలఁ। గానంబడునిత్తుమీఁదఁ*గదిసినచోటన్ । బ్రాణములుసంధిగాంచును । బూనివికల్పంబువలనఁ * బుణ్యచరిత్రా ॥ తే–గీ॥ పలుకుచెలియనునాప్రాణ * భర్తయైన । వనజభవుఁడేనియహికుల * స్వామియేని । నీమహత్త్వంబువర్ణింపనేర్చునెట్లు । నానుదాహరణంబులు * దానవారి ॥

క్త్వాప్రత్యయాంతార్థసంధి.

ఆ॥ నారిజాతనేత్ర * క్త్వా ప్రత్యయాంతార్థ । ములువచింతుఁదెలుఁగు * పలుకులందను । బైస్వరంబులుండు * పట్టులఁబ్రకృతిభా । వంబుగానిసంధి*

వాటపడదు ॥ ౭౭॥ ఆ॥ కాంచియాలకించి* యెంచియాలోకించి। యెుఱపియాం డెయోడి * యొరగియెత్తెఁగి । యంటియెచ్చియిచ్చి * యనియాడుకొనికొ త్తి।యొనసియేగియాగి*యునఁగవచ్చు ॥ ౭౮

ఇకారాదేశవిభక్తులు-శబ్దానుశాసనమూలసూత్రము.

ఇచ్ఛవిభక్త్య న్తిమస్య ॥

క॥ లలినాదేశములగుసి । త్తులుసమసనములను జేత * తోడవలసలో । పలనకునివి మొదలగుపలు। కులతుదిఁదలకట్టులకువి * కంఠతనిరాజా॥ ౭౯॥ ఆ॥ కృష్ణువలనిబలిమి* కేశవుతోడిస । ఖ్యంబుశకటచాన * వారిచేతి । ప్రో పుభాగవతుల * లోపలిగణనయు । ధవళవాహనునకుఁ * దక్కఁగలదె ॥

అల్యాదేశము-శబ్దానుశాసనమూలసూత్రము.

జేరలిచ॥

ఆ॥ కడవిభక్తులైన * నుడుసులకలియను । నాగమంబువచ్చు * నంత్య ములను । సమసనమున శేష * శాయియందలిభక్తి । వ్రేడమునతఁడెలోక* పూజ్యుఁడనఁగ ॥

ఆదిలోపము-శబ్దానుశాసనమూలసూత్రము.

శబ్దాత్తచ్ఛబ్దాఽతో లుక్ ॥

తే-గీ॥ శబ్దముతుదనునదియను * శబ్దమునకు। నప్పుడదియనుపదమున కాదినుండు । నత్వమువికల్పమునలోప* మగునుగాన । నిదిప్రకృతిభావము ననుండు * నిందిరేశ ॥ ౮౧ ॥ తే-గీ॥ వానఁగులోపప్రకృతిభావ* ములనువ రుస ।బాపనదికోమటిదిమంచి *కాఁపదియన । మహినిబాపనయదియుఁగో* మటియదియును । గాఁపయదియుననఁగభ*క్తజనవరద ॥

ఉదాదేశరేఫాగమములు-శబ్దానుశాసనమూలసూత్రము.

బారాశ్లేతఉదపిరః ॥

తే-గీ॥ కొనలఁదలకట్లుగలసుగో * త్తులకుమీఁదఁ।గర్మధారయసమస న * కల్పనమున । నాలనుత్రిలింగదేశవా * క్యంబుగూర్ప । మహినుదాదే శరేఫాగ*మములువచ్చు ॥ ౮౩ ॥ ఆ ॥ బుద్ధిమంతురాలు * పుణ్యాత్మురాలు ద । యాసమగ్రురాలు * దానురాలు । వినుతశీలురాలు * ఘనురాలుగం భీరు।రాలువిష్ణుపెద్ద * రాణియనఁగ ౮౪

టుగాగమము-శబ్దానుశాసనమూలసూత్రము.

సామానాధికరణ్యేషూదన్తానాంటుగాగమోఽచిస్యాత్ ॥



క॥ శమితాఘ కర్మధారయ । సమసనమునఁదుదినిగొమ్ము * సంధిల్లెడు శ। బ్దములువికృతిబొల్లటకా। రము వెట్టుక సంధిఁజెందుఁ* బ్రాణముతోడన్ ౮౫॥ ఆ॥ అక్కజంపుటడవి * నలశూర్పణఖముక్కు । మెఱుఁగుటంపమొన ను * దఱిగివైచెఁ । జిగురుటాకుగోటఁ * జిదిమినచాడ్పునఁ । గఱకుటసురల లుక * గ్రహపకులుఁడు॥

విశేషణాంతద్రుతాగమము – శబ్దానుశాసనమూలసూత్రము

ధాతుపదసఃఖ్యవానాం విశేషణానాముత స్తథానగచి.

తే॥ గీ॥ క్షితినిబైపదములకువి * శేషణంబు। లగుక్రియాపదములతుది* నమరుశృంగ। మునకువచ్చు నాగమమయి * పొల్లనుతము। ప్రాణపదమైనఁ గర్మభా * రయుమునందు॥ క॥ అనుటయునతండుకవ్వడి । కనుఁగొనియెడు నతఁడుమాద్రిఁడపటికోడుకా। మొనసందునతఁడువడముడి। వెనుసనునతఁడ ర్కసు తుఁడు * విరథుఁ డనంగన్ ॥

షష్ఠీసమాసద్రుతాగమము-శబ్దానుశాసనమూలసూత్రము

షష్ఠ్యాఉతోకచినుమ్సేచ.

తే ॥ గీ ॥ కొమ్ముమీఁదషష్ఠీసమా * సమ్మునందు ।నచ్చెమురఁబొల్ల ద్రుత మగు * నాగమంబు । కొడుకునాలునేనుఁగునొడ* ల్తొడవుస్మెఱవు । రాజు నానతిధేనువు * నొజయనఁగ॥

ఆమ్రేడితసంధి – శబ్దానుశాసనమూలసూత్రము.

ఆద్యస్యామ్రేడితేక స్యలోపశ్చ॥

తే ॥ గీ ॥ ఒక్కమాటయెరెండుమా * ఱుచ్చరింప । దానిపేరార్యులా మ్రేడి * తంబటండ్రు । పృథివిఁదత్పదములలోనఁ * బ్రథమపదము । తుదిని సంధిఘటించునఁ* చ్చెదిరినపుడు॥౮౭॥ తే॥గీ॥ అచ్చటచ్చటనాడాడ*వచ్చునె క్కడఁ।డొక్కడఁయయ్యారయారెయో*హెహాహహొనందు। పట్టియనఁగనామ్రే డిత * పదములందు । మొదలిపదములతుదసంధి * గదియుఁగృష్ణ॥

అనుకారసంధులు-శబ్దానుశాసనమూలసూత్రము.

అహామాదీనాంద్విత్వంలోపోనమఆదికేవిసర్గస్య॥

సీ ॥ అనుకరించెడు చోట * నవ్యయాదులకొనఁగలబొట్టుగవకుదీ * ర్ఘం బులకును। వచ్చులోపము కేశ* వాయతుభ్యంనమయనఁగ రామోఽఘసం* హర్తయనఁగ। బూర్ణంబులకునోష్ఠ * భూతానునాసికశృంగంబుజడ్డను* జెందినిలుచు । నంబుజాతుతవదా * సోఽహమ్మనంగను బొల్లులకునుద్విత్వ*

ములుఘటించుఁ॥ ౯౦॥ ఆ॥ బండితోత్తములుగృ * పాసముద్రోముర।జిత్త
టంచుఁజదివి * చెప్పవినుచు। నసురవైరివిడిచి * యన్యదైవతములఁ॥ గొలు
చుమూఢమతులు * గలరెయనఁగ॥ ౯౧॥ వ॥ ఇవిస్వరసంధు లనంబడునింక
వ్యంజనసంధులెట్టివనిన॥

అద్భుతశబ్దసంధి-శబ్దానుశాసనమూలసూత్రము.

బోరద్భుతశబ్దార్థే.

ఆ॥ అద్భుతార్థవాచ * కాంధ్రశబ్దంబున । నడిమిరేఁతకొమ్ము * చె
డునునిలుచు। హరిధరించెఁగేల * నబ్బంపుగిరియనఁ। బ్రావెనబ్బురంపు* ద
వమునసఁగ॥ ౯౨॥

వుకారసంధులు-శబ్దానుశాసనమూలసూత్రము,

వోశ్చతదాద్యర్థవాచకేషూతః॥

తే॥ గీ॥ అప్పుడెప్పుడుకప్పరం * బిప్పుడనుచుఁ । బలుకుచోఁబిన్నవడిమి
ర్వాఁ * తలకుఁగలుగు । కొమ్ములుండునుబోవును * గొమ్మక్రప। మప్డుగాకె
ప్డుమేనఁబూ * యఁగలదనఁగ॥ ౯౩॥

ఌకారసంధులు-శబ్దానుశాసనమూలసూత్రము.

వికృతిపదేలోటోరపి.

ఆ॥ అవనిశృంగసహిత * మగుతృతీయాంతస్థ । మునకుడాపలించి * తె
నుఁగులందుఁ గలటకారశృంగ* ములువ్రాఁవునుండు।నిట్లనియెనిట్టులనియె*
ననఁగఁగృష్ణ॥ ౯౪॥

రేఫసంధిశబ్దానుశాసన మూలసూత్రము

ఉపధారేఫా చ్చితశ్చలుగ్వాస్యాత్.

క॥ కడమవర్ణమునకుదాపలి । కడరేఫముగుడుసులుక్కు * గాంచును
దనకుఁ । గుడినిచికారములుండెడు । నెడలవికల్పమునఁ బన్న * గేశ్వరత
ల్పా॥ ౯౫॥ క॥ పేర్చిరిపేరిచిరరిఁబరి । మార్చిరిపరిమారిచిరిగ్ర * మంబునధ
నముల్ ! గూర్చిరిగూరిచిరప్పులు।దీర్చిరితీరిచిరినాఁగఁ* దెల్లంబయ్యెన్॥ తే॥గీ।
మొదలరేఫాక్షరంబునా * పిదపచాని । జడ్డయునుగూర్చియొకటిగాఁ * జ
దువుకొనుచు। ముందుజడ్డయువెనరేఫ* మునకుబదులు। గిలుకవిభజించియు
లిఖింతు * రిలఁగుమతులు ॥ ౯౬ ॥ క॥ అరఁటులఁబరఁటులబరఁజెల । గరిఁ
జెలమొరిఁజెలనుగలర* కారములెల్లన్ ।ధరనెఱసున్నలునగున । య్యరఁటు
లబఱఁటులనుద్రుతము * లగువలసినచోన్॥ ౯౭॥



నరలడశృంగసంధులు-శబ్దానుశాసనమూలసూత్రము.

పదమధ్యనరలడానాముతశ్చ॥

పూర్వప్రయోగసిద్ధానాంలోపోవాస్యాత్

క॥ ధరఁబదమధ్యనరలడా । క్షరములకొమ్ములువికల్ప * కంబునవిద్యా
ధరసన్నుతలోపములగుఁ । బురాతనకవిప్రయోగ* ములఁగొన్నింటన్॥ ఆ॥
శాన్పుతూర్పుతెల్పు* గాడ్పుకానుపుతూరు । పచ్చతెలుపుగాడు * పనుచుని
ట్లు । కొమ్ములఁగునుండు * గొన్నింటఁదొల్లింటి । వారుకావ్యములను *
వాడుకతన ॥ ౯౮ ॥ క॥ పదమూనుమఁబదరుమఁబొద । లుపుఁబొడుదునను
చునిట్లు * లోకంబునను । ప్పిదములగుకొన్ని పదములఁ। గదలవునడికొమ్ము
లావి * కవులొడఁబడిరిన్ ॥ ౯౯ ॥ ఆ॥ వినుఁడుచొరుఁడుతలుఁడు*విడుఁడను
పలుకులు । చిఱుఁతబొట్లమీఁదఁ * జెందియునికి । సరసిజాతనేత్ర* నరలడా
క్షరముల । కొమ్ములడఁచిసంధి * గూర్పరాదు॥

త్రివిక్రమమతసంధులు- శబ్దానుశాసనమూలసూత్రము.

తేషామితశ్చతద్వత్త్రివిక్రమమతేన॥

ఆ॥ నడిమినరలడలకు * గుడులేగునుండును। ధరఁద్రివిక్రమునిమ* తము
నఁగొన్ని । పూన్కిగూర్మికల్కి* బుడ్పిపూనికిగూర్మి ।యనదుకలికిబుడిపి*
యనుచునిట్లు॥ ౯౯॥ చ॥ కొలఁదిగమున్ను చెప్పెఁజలి* కొండనృసింహుఁడు
వెల్లయంచునీ। వలనగసాలరుద్రపను* వాఁడును మొల్కలటంచుఁగూరిచెం।
దెలియకకొండజెట్లువిశ్ర* తింబదమధ్యమునన్నకారరే । ఫలదలపై యకా
రమును * బాపునురార్యులునవ్వునట్లుగన్॥ ౧౦౦॥ వ॥ ఇందులకునినకొండ
లోగుంటిపల్లిభాస్కరయగారి సముఖమందుఁగందుకూరిరుద్రయగారుచెప్పి
నపద్యము॥ చ॥ వెలగఁటవెల్లయంచునర * వింజలికొండ నృసింహుఁడాడఁ
గా। మొలకకుమొల్కయంచుఁగవి*ముఖ్యుఁడురుద్రపపల్కదోసమే।భళిభళి
మంచిమాటమెప్ర * బంధమనాజలరాశియందులో। పలనెరసుల్గ్రహింతు
రెయ * పారములొమణులెల్లనుండఁగన్॥

కవిభల్లటమతసంధులు-శబ్దానుశాసనమూలసూత్రము.

కవిభల్లటైః క్రియాణాంనామ్నాంచోల్లోపఇష్యతేహ్యేషు॥

ప్రథమైకవచనమాత్రేవికృతౌనాన్తాదయోకపికథ్యన్తే॥

తే॥ గీ॥ ధాతుపదములకడపటఁదనరురేఫ । శృంగములకులోపంబు
లు * చెల్లుచుండు । హల్లుపైకొన్నచోఁగవి * భల్లటార్య। మతమునవికల్ప

నంబునఁ * బతగగమన॥ ౧౦౩॥ తే॥ గీ॥ సర్వగతుఁడ విహారిసెన్ను * దుర్విబుధులు । పరమపురుషునిగాఁదలం * తురుతపసులు। శ్రుతిమయుండనిచెప్పు దు*మ్మ్యాసురులతని । బ్రహ్మమనుచును నెఱుఁగలే * ర్దనుజవరులు॥ సీ॥ భల్లటవిరచిత*పక్కి-బోసూత్రంబువలననుబై హల్లు*నిలుచునపుడు। ప్రథమైకవచనము *ల్వలికెడుచోటను సమసనములుగూర్చు*సమయమునను। దెనుఁగునామంబుల * కొననునుండెడునరలడలకొమ్ములువిక * ల్పంబువలనఁ। గాంచును లోపము * ల్గన్మా సెఁగనుమూసెగోర్నా టెఁజెక్కిటు * గోరునాఁటు॥ తే॥ గీ॥ మరుఁడువిల్బూనెవిలుపూనె * మధుఁడుజాతి । ననలవీడ్కొనియెనువీడు * కొనియెననఁగ । సానపాన్వయ వేంకట * త్మ్యాపదత్త । కామెపల్యగ్రహార న * గర్వభీశ॥ ౧౦౪॥ తే॥ గీ॥ కాంతచన్గవచనుఁగవ* కాల్రైఱుపులు। కాఱుమెఱుపులు వాల్గంటి * కలికివాలు । గంటిచేడ్పాటు చేడుపాటు * గాంచెననుచుఁ । దెలుఁగుసమసనములనిట్లు* పలుకవచ్చు॥ ౧౦౫॥ తే॥ గీ॥ చట్టజాతికిఁజట్రాయి* గట్టుఱేని। పట్టియనుచోటగట్టేనిపట్టియనుచు । సమసనములటకారశృం*గములునడఁగు । నాదిశబ్దంబుసూత్రంబు*నందుఁగలిమి॥ ౧౦౬॥

ఔపవిభక్తికములు-శబ్దానుశాసనమూలసూత్రము.

ఔపవిభక్తికసంజ్ఞావర్ణాష్టింప్ట్యాదయోభవస్తిహ। రుల్వా
దేర్నామ్నాంస్యుస్తేహివిభక్తౌ సమాసేచ॥

సీ॥ అవిభక్తికములగు * నాంధ్రనామములందుఁ బ్రథమావిభక్త్యేక * భాషణముల । కొననుండురుల్వాదు * లనుబాఱఁదోలివిభక్తులందునుసమాసోక్తులందు। నవనినాదేశంబు* లగుచుఁడింట్యాద్యక్షరంబులునిలుచుప*దంబులెల్ల । నౌపవిభక్తికాహ్వయములై కృతులను బహువిభక్తులనుజూ*పట్టుచుండు॥ నిపుడు చెప్పినరుల్వాది* లిపులుకొన్ని। యందునాదేశములు లేకయెప్పటట్లు । సమసనవిభక్తులనురెంట* నమరెనేని । యవియునౌపవిభక్తికా * హ్వయములయ్యె॥ ౧౦౭॥ సీ॥ రలవర్ణముఁ శృంగ * ములకునుగుడులకుడాలకొమ్ములకును* డీలువచ్చు । నీటికిఁదాఁకపం * దిటికిఁదోఁడేటికంబటికిఁగూటికిగుడి*పాటికనఁగ। జడ్డలుగలనలా* తురశృంగములకునుగొన్నిమాటలకులా* గుడుసులకును। గట్టిబొట్టులకుడి* కడడుకారములకుఁ*బూర్ణ యుక్తంబులై* పొందుఁడీలు । చంటికింటికిగొం.నగు * దంటికరఁటి। పంటికిఁమపాకిగుంటికి * రెంటికనఁగ । నిజ్జులకుఁది ఱ్ఱులగునూతి * కేటిమిర్తికనఁగపష్టినిగొన్నింటి * కమరునిట్లు॥ ౧౦౮॥ సీ॥ పాలేటికాలువ * పందిటిగుంజతాఁ బేటినోరంబటి * పిండికుండ । కాటిపాపఁడుబోటి * కాల్వయింటిమగండు గొడ్డంటిసఱుకుడు* గుంటికోవి । ముంజేతికంకణం * బులుచేతి సారకాయక్కొ త్రిప్పిపుఁడుపెద్ద * గొత్తిచెక్క.। నాఁపజొన్నలుకటి * వేఁపపూవులదండలలపాఁపమేతరి * యంపములుకు । లినుపపెనముఁబోసిన * మినుపదోసె। లనుపపప్పనుజొక్కెంపు* టెనుపనేయి । యనుచునిట్లుసమాసంబు*లందుఁగొన్ని। పలుకులనునిల్చునౌపవి*భక్తికములు॥ ౧౦౯॥

అనౌపవిభక్తికములు.

సీ॥ చూరుపెనుబిడారు * తొలకరిపుల్లరిచాలు పాలరవాలు * జగిలిమొగిలి। యీఁడుజోడునుగీడు * వెన్నుపన్నునుజెన్ను కల్లుజల్లునుబొల్లు * గాలిజాలి । చెండుదిండునుదండు * చేదోయిప్రోయివేయి కిఱ్ఱుఱ్ఱుతొఱ్ఱును * గేదెముఱ్ఱు। గీముతొల్లిటిజాము*మోముపున్నమనోముకొమ్మిమ్ముతలదిమ్ముఱొమ్ముసొమ్ము । మనుము మొదలగువికృతినా* మంబులొక్క। కొన్నితుదల రుల్వాదులఁ * గూడఁకొనియు। లలివిభక్తులనుసమాస * ములనురెంట। భువిననౌపవిభక్తికం*బులగుచుండు॥ ౧౧౦॥

ముviభక్తిలోపము- శబ్దానుశాసనమూలసూత్రము.

ప్రథమావైభక్తికమోర్బిందుశ్చ మహాన్వతిక్రియార్థేతు॥

తే॥ గీ॥ పడియెననుక్రియతుదినిల్వఁ * బడియెడునెడఁ । బ్రథమయగుమూఁకుసమసన * పదమునందుఁ । బెలుచనాదేశముగుఁబూర్ణ * బిందువదియు । లోపమునుజెందునువికల్ప* రూపములను॥ క॥ పడఁతిప్రియంపడియెభయం । పడియెసుఖంపడియెసంభ్రమం పడియెఁ బదం । పడియెఁగడుభయ । పడియెరమించిసుఖపడియె * భ్రమ పడియెనన్ ॥ ౧౧౩॥ తే॥ గీ॥ భ్రాంతిపడిచింతపడియును * పట్లపెద్ద । సున్నగలుగదుకొననుమూ * సున్నయగుట। బలముపడియెమదేభము * పడియెననిన। చెడిచనదుమూసమాసంబు* నుడుగుగామి॥

పువర్ణాదేశము—శబ్దానుశాసనమూలసూత్రము. తస్యసమాసేపుంపూ॰

క॥ ఆదివిభక్తిముకారము । యాదవవరకర్మధార* యసమాసమునన్। మేదినిపైఁజెందుఁబువ । ర్ణాదేశంబదిసబిందు * వగువలసినచోన్॥ తే-గీ॥ పడఁతియప్రపుటూరుల*ప్రంపుటూరు। లతివచోద్యపుటూరుచో*ద్యంపుటూరు । మగువసూక్ష్మపుఁగౌనుసూ*క్ష్మంపుఁగౌను । కలికిచొక్కపుమేనుచొక్కంపుమేను॥ ౧౧౪

అధర్వణమతసంధులు - శబ్దానుశాసనమూలసూత్రము.

నుమ్మోచ్చాతోహల్యధర్వణాచార్యమతాత్ ॥

తే-గీ॥ సమసనమున నామాంతశబ్దం * గముల కెల్ల । హల్లుగదియ స్వార్థంబునఁ * బొల్లద్రుతము। వికృతినాగమమై ద్రుత * ప్రకృతిపగిదిఁ । గాంచుసంధి నధర్వణ * కవిమతమున॥ ౧౧౫॥ క॥ చనుఁగవకుఁ జనుంగవ యపనఁ । దనరుఁ దలిరుఁజొంపమునకుఁ * దలిరుంజొంపం । బనవచ్చు ననుఁగు వెలఁదికి । ననుఁగు న్వెలఁదియనశ్లిష్ట * మగు స్థిరపరతన్ ॥

పదమధ్యద్రుతలోపబింద్వాదేశములు.

శబ్దానుశాసనమూలసూత్రము.

శత్రర్థేతూతశ్చైనో స్తస్యస్యాచ్చ పూర్ణబిన్దురపి ॥

ఆ॥ తెలుఁగువర్తమాన * ములషష్ఠవర్ణంబు । కొమ్మువిడుఁద ద్రుతము * కొమ్మమరినఁ । గొమ్ములోపమగు ద్రు * తమ్ము పూర్ణంబగు । క్షమనుగొన్నిట నువి * కల్పమునను॥ ౧౧౬॥ క॥ చనుచునుబూనుచు నెన్నుచు । ననుగొన్నిటఁ దక్కనంచు * ననుచు నుపించున్ । వినుచునుగనుఁగొంచునుగనుఁ । గొనుచు నుదించుఁ దినుచనఁగఁ * గూడును గృతులన్ ॥ ౧౧౭॥ తే-గీ॥ ధాతుపదములనడుమను * దటలపిడుఁద । వెలయు ద్రుతములు స్వరసమ * న్వితములగుచుఁ । దొలఁగితముచోట ఫూర్ణబిం * దువుల నిలుపుఁ । గొన్నిటను గనుగొందుఁ జే * కొంటిననఁగ ॥ ౧౧౮

ప్రథమైకవచనద్రుతప్రకృతులు- శబ్దానుశాసనమూలసూత్రము.

వాక్యాత్మస్మదోర్ద్రుతస్యస్యాల్లుక్ ॥

క॥ శ్యామాంగ నేను దానను । సీమాలల కొనద్రుతంబు * లేగు నిలుచుమహాల్లామీఁద నుండునప్పుడు । నేమను మను నేను మనుదు * నీకృపననఁగన్ ॥ తే-గీ॥ తాను నేనను పలుకుల * లోని ద్రుతము । లడఁగుచో మీఁదఁ బరుషంబు * లసురదమన । సరళలిపులగుఁ దద్ద్రుతా * క్షరములర్ధ । బిందులగుఁ దాఁ జనంగ నేఁ * బిలిచితనఁగ॥ ౧౧౯

పదాంతద్రుతలోపము-శబ్దానుశాసనమూలసూత్రము.

వాక్యాన్తగతపదానాంచ ॥

క॥ పసగలసీసాదికముల । వసుమతి నొక్కొక్కపదము * వాక్యమనంగా । నెసఁగుఁ దదంత్యపదము తుదఁ । బొసఁగు నకారంబు పొల్ల * పోవుస్సిలుచున్ ॥ తే-గీ॥ దానవారాతి కేళికో * ద్యానసీమ । నాకభూజంబు చెంతఁ గాంచితాలలామ । ననఘగుణధామ సత్యభా * మను బెరిమను। గలయు నిచ్చలు సనఁగలత్యంబులయ్యె॥ ౧౨౦॥



పదాంతప్రాణలోపము.

క॥ నాంతపదాంత ద్రుతమున । కెంతయుఁ బ్రథమాబహూక్తి * కే తెంచుతృతీ । యాంతస్థంబునకుం బ । ద్యాంతంబున స్వరములోప * మగుఁ గొన్నింటన్ ॥ క ॥ నలినాక్ష తెలుఁగు పద్యం । బులకడపల నుండు నలల * పొల్లులకు మహీ । స్థలిగుడుసులు శృంగములును । నిలుపరు చదువు నెడలాక్ష * ణికు లెచ్చోటన్ ॥ ౧౨౧

ద్రుతప్రకృతికాంతబిందుసరళాదేశము.

శబ్దానుశాసనమూలసూత్రము.

పరుషాద్రుతప్రకృతికాత్సరళాస్సు్యస్తద్ద్రుతంచబిన్దుస్స్యాత్.

సీ॥ ధర ద్రుతప్రకృతిశ * బ్దంబుల పైఁ బరుషంబులు నిజసర * ళంబులగును । ద్రుతములు ఖండబిం * దువులగు నాపట్లగాథేయముని వెంటఁ * గదలినడచెఁ । జరణపంకజధూళిఁ * జట్టునాతిగఁ జేసె వెసఁ డొక్కమసకుండ * విల్లువిఱిచె । ధాత్రీతనూభవఁ * దగ వివాహంబయ్యె గురువైభవంబునఁ * బురికివచ్చె ॥ ౧౨౨॥ ఆ॥ నినకులేంద్రుఁ డనఁగ * నివియుదాహరణంబు । లిట్టిచిన్నిసున్న * లెల్లఁ గుఱుచ । లిపులమీఁద నుండు * నపుడు గొప్పలునగు । గడమ వ్రాలమీఁదఁ * గావుగాని॥ ౧౨౩॥ ఆ॥ ముంగమురువుదాలి * చెంగాంతయ ననిట్లు । గొప్పసున్నలగును * గుఱుచమీఁద । రాఁజెనగ్నిగాలి * చేఁజాలన ననిట్లు । నిడుదమీఁదఁ గావుఁ * నిండుబొట్లు॥ ౧౨౪॥

ద్రుతప్రకృత్యంతసరళాదేశము.

శబ్దానుశాసనమూలసూత్రము.

అవికారగతేతస్మిన్నపి సరళాఏవసన్తితేపరతః.

సీ॥ అవని ద్రుతప్రకృ * త్యంత ద్రుతంబులు చెడి బిందువులుగాని * యొడలవాని । వలపలిపరుషము * ల్వరుసతో సరళంబులవుఁగాని యచటబిం * దువులులేవు । తండ్రిపంపుననుగాం * తారంబునకునేగి సమదవిరాధునిఁ * జావమొత్తె । సతివతోడ సుడేకు * టాకుటింటవసించెఁ గనకమృగంబును * దునిమివైచె॥ తే-గీ॥ భామినినిబట్టుకొనిబోవు * పక్షికంతు । నంతకునిఁ జేర్చెఁ బుత్రమిత్రాన్వితముగ । నగరమునకు మహీజాత * నుగొనివచ్చె। రాముఁ డర్కకులాంబుధి * సోముఁడనఁగ ॥ ౧౨౫

ద్రుతప్రకృతికాంతద్రుతలోపము.

శబ్దానుశాసనమూలసూత్రము.

లుగ్వాద్రుతప్రకృతికాత్పరతస్సరళస్థిరేచనస్యాస్యాత్ ॥

సీసమాలిక॥ సరళంబులునుస్థిరా * క్షరచయంబునుద్రుతప్రకృతిశబ్దం
బులపై నిఁగదియ । నపుడుతదంతద్రు* తాక్షరంబులువికల్పమునలోపంబు
లై *పరఁగుచుండు।జనియించెగరుడకే* తనుఁడుదేవకియందుఁబెరిగెనుగోపికి*
బిడ్డఁడనఁగ । నభినుతిఁగాంచెజం * భారిముఖ్యులచేతఁ బూతనను జయిం
చె * బురిటిలోన । ననుపమస్థితిడెంద * మునభీతినెందకచంపెను డింభుఁ
డై * శకటదైత్యు । నడఁచెనుష్పాత్తుఁదృ * ణావర్తుమెడఁబట్టితిగిచివ్రే
పల్లెను * దిక్కుఁజేర్చె । గర్గుచేబహునామ* కములుగాంచెనునెఱపెనుబాల
లీలలు* పెక్కుగతులఁ । బాడసూపెఖేచర * భూచరావలిఁదల్లికానసంబు
నను ఖ * గాలిమెచ్చఁ । గదలెఘోషాంగనా* సదనంబులకువెన్నద్రుచ్చి
లిమెనుగంట * ద్రోఁగకుండఁ । జేసెఛిద్రంబులు * క్షీరభాండంబులఁబలి
కెనుఫలవాక్య * ములవనితలఁ । బడవైచెఝంపాప్ర * భంజనుండనమద్దు
లరిగెనుఝిల్లీర * వాటవికిని । వదలకకాచెశే * వలువిరాఁజ్రేపులగోపకు
లనుతీవి* గూడిమాడి । తునిమెఘకక్కుఁజర్మ * మునకనోయనవత్సదనుజు
నిఘాతతోఁ*దలఁకకుండ।నిర్జించెధీరుఁడై నిలిచిబకాసురుసఘునిధాత్రినిగూ
ల్చె*నద్భుతముగఁ । గల్పించెనీరజ * గర్భుండుడాచినవలసుమిఱఁగనూత్న
వత్సములను । క్రీడించెఫలితశా* ఖిచ్ఛాయలనుమాళిఁజుట్టెనుపుల్లప్ర*సూ
నములను । నవలీలభంజించె * నావులఁగాయుచుగర్దభాసురునిభీ*కరశరీరుఁ।
గాళియుమర్దించి * కాళిందివెడలించిత్రావెనుమండెడు * దావవహ్ని । స
రసియాడఁ కేళి * సలుపుచుండంగఁజేకొనియెనుయువతుల* కోకలెల్ల । భు
జియించెరుచికరం * బుగవిప్రవనితలచేతను రాజాన్నజాతమెలమి । రక్షిం
చెలేఖభ * ర్తనుతింపనెల్లరహ స్తంబుననులీల * నచలమెత్తి । శరమునవ
రుణాకిం * కరుఁడెత్తికొనిపోవునందునివెదకిపం * తమునఁదెచ్చెఁ । దాల్చెశ
యాంబుజా * తంబునవేణువుపూరించెనుశిరీష * ములుచిగుర్పఁ । బాడెష
డ్జస్వర * ప్రభవగీతంబువిరాలిఁబెట్టెనుషట్పదాలకలను । జలమునసుందరీ
జనములఁగికురించి * చనియెనుసూనవృ * క్షములనడుమ॥ తే॥ గరుణహే
మాంబరంబుతోఁ*గానవచ్చి । మానమెల్లనుహరియించి * మరునికేళి । వా
నుదేల్చెను*వరుసకొలఁది । ననద్రుతప్రకృతులకుదాహరణములగు॥

తె



౧౩౧॥ తే॥ ధేనుపాలతవర్గద్వి * తీయమొకఁడు । మొదలియనునాసికంబు
లు* మూఁడులిపులు । నాంధ్రిసంస్కృతశబ్దాదు*లందులేమిఁ । జేసివానికి
లక్ష్యము * లెప్పనైతి॥ ౧౩౨॥

ద్రుతప్రకృతికాంత ద్రుతశ్లేషము.

శబ్దానుశాసనమూలసూత్రము.

అలుకిచసంశ్లేషస్స్యాత్॥

క॥ లలిసరళస్థిరములడా । పలినాంతపదంబులూఁది * పఱికెడుచోసం ।
ధులుగాంచునుడతవర్గం । బులునాఱిటి చెంతఁదక్కఁ * బొల్లులయిహరీ॥
క॥ టతవర్గంబులురెంటను । సతతముసరళాక్షరములుపు * సమలిలునుని।
ర్జితమురనాంతపదాంత। ద్రుతములనుంగూడుకొనవు * తుదిఁగదిసినచోన్॥
౧౩౪॥ మాలినీవృత్తము॥ నలువఁగనినవేల్పు * న్గంధవాహాటతల్పు । న్నల
కలిభయహర్త * న్జాంబవత్యాత్మభర్త । న్నలినదళసమాక్షు * న్బాణదై
త్యేంద్రశిక్షుం । దలఁతుననఁగఁజెందుం * దన్నకారంబులెందున్ ॥ మహా
స్రగ్ధర॥ నవతల్పాయందలంతు * న్ఖగపతిగమను * న్ఛత్రచిత్రధ్వజాంకు । న్న
వదర్పావతారు * న్ఫణిపతిశయను * న్ఖద్రసనాథేందునేత్రు । న్నవరత్నాం
చత్కిరీటు * న్ఝషపదజనకు * న్ఘర్మవస్త్రాభిధాను । న్నవనీతక్షీరచోరు *
న్నతజనసులభు * న్మానిహృత్పద్మవాసున్॥౧౩౫॥నరకపుష్పిణీవృత్తము ॥ న
రకభయసంహారు * న్యాదవాగ్రేసరు । న్నరకదనుజాంతకు * న్నారిహిణో
యానుజు । న్నరముఖసురార్చితు * న్లక్ష్మణావల్లభు । న్నరహరిఁదలంచెద*
న్వాంఛితార్థాప్తికిన్ ॥ ౧౩౬॥ స్రగ్విణీవృత్తము॥ నీరజాతేక్షణు * న్మేషసిం
హాసను । న్నారదాదిస్తుతు * న్షట్పదశ్యామలు । న్నారకాపద్ధరు * న్సామ
జేంద్రావను । న్నేరహస్యంబున * న్హృద్గతుంజేసెదన్ ॥౧౩౭॥

ద్రుతప్రకృతికాంత బింద్వాదేశము.

శబ్దానుశాసనమూలసూత్రము.

బిన్దుంప్రవదన్తితంక్వచిత్కేచిత్॥

తే॥ కడఁదృతీయచతుర్థవ* ర్గములఁగలుగు । సరళములుసమలిపులును*
బరములైన । తఱినినాంతపదాంతద్రు * తంబుపొల్లఁ। బెఱికిపైనిత్యముగఁ
బూర్ణ * బిందువగును ॥౧౩౯॥ క॥ నన్నయసూత్రమునక్వచి । త్తన్నదొకటిఁ
దక్కబొట్ల * కక్కరనియమం । బెన్నుటలేదాదికవుల్ । గొన్ని తెలుఁగులర
సితెలిసి * కొంటినివీనిన్ ॥ ౧౪౦ ॥ వ॥ అవియెయ్యవియనినఁదృతీయవర్గస

రళంబునకు రాచమల్లువారిషష్ఠస్కంధములోఁ బ్రయోగము-చతుర్థవర్గసరళంబునకు రాఘవపాండవీయములో భారతార్థమునందుఁ బింగలి సూరపరాజుప్రయోగము॥ టవర్గద్వితీయమునకుఁ ద్రైశంక్వోపాఖ్యానములోఁ గవిసింగనప్రయోగము॥ క॥ ఢుంఠీశుభై రవునిసితి। కంఠువిశాలాక్షిదండ*కరుజాహ్నవిపై । కుంఠపతిగుహునిలోలా । ర్యకంఠేవలుమీఁఱభావ*రుఁడుపాడగనియెన్॥ వ॥ టవర్గచతుర్థంబునకధర్వణాచార్యులవిరాటపర్వమునందు॥ తే॥ ఢాంఢమితభేరికాధ్వాన * ముంఢులెని। నాదమునుమిన్ను ముట్టన*నారతంబు పెక్కుగంధర్వపతులున ల్దిక్కులందుఁ । గాచుసౌగంధికంబుఁ దేఁ * గలరెయొరులు ॥ వ ॥ తవర్గంబునందుద్వితీయవర్ణముసంస్కృతాంధ్రశబ్దాదులందు లేదుగానఁ బ్రయోగంబుగలుగనేరదు ॥ చతుర్థాక్షరంబునకునసంతునిఛందమునందు॥ తే॥ పేర్చిపొల్లనకారంబు *బిందువగుచు। మీఁదనున్నధకారంబు * నూఁదిప్రాస । బంధమగుఁ గృష్ణుఁడుదయించి* సంధరిత్రి। యంతయును నిరుపద్రవం * బయ్యెననఁగ ॥౧౪౩॥ క॥ ముందరగజబమకారము। లొందిననాంతములతుదల * నుండుద్రుతములం । గ్రందుకొవికల్పంబున। బిందువులుగఁ జేసికృతులఁ * బెట్టుదురొకచోన్ ॥ ౧౪౪॥ సీ॥ అంగజకేళిఁ దే*ల్చెంగోపకాంతలనగముహస్తంబున* స్గరిమదాల్చె। గెంజిభోజధరావ*రుంజముకడఁ జేర్చెనరుఁబ్రోఁచెరణమున * స్జగమెఱుంగ । జాంబవంతునిగెలిచెంబంటుతనమునఁనజకేఁజక్రంబున * న్బాణుపాణు । లమ్మకుండలములి*చ్చెమ్మహీసుతుఁ జంపినాఁడెభూతలమున * న్మఘవతరువు ॥ తే॥ గీ॥ దైవమాత్రంబెదేవకీ* దేవిపట్టి। దేవదేవుఁడుఁ శ్రీవాసు * దేవుఁడనఁగ। గజమంబులడాపలఁగదియునట్టి। నాంతపదములకెల్లల * త్వ్యంబులయ్యె॥౧౪౬॥

సమకారద్విత్వమైత్రులు.

తే॥ గీ॥ తమకుఁ దాముద్విత్వంబులై* యమరునవియు। బిందువులుడాపలను వెలు *గొందునవియు । నొక్కరూపయిపూర్వప్ర* యోగసరణి। నములుప్రాసంబులకునిల్చుఁ * దమకుఁ దాము ॥౧౪౭॥ క॥ మిన్నే ఱుపాదమునధా । తన్నాభినిగుసుమశరునె * దంగాంచిననీ । సాన్నిధ్యము దొరకుట్కై । సన్నుతిసేయుదురునిన్ను * సనకాదులజా ॥క ॥ తమ్ములనుమల్లికాకుసు । మమ్ములమరువాదిపత్ర*మాలికలనుభ । క్తిమ్మురసంహారుపూజలు। సమ్మదమునసలుపఁగలుగు * సకలార్థంబుల్ ॥౧౪౮॥



పదాంతనులుకారద్విత్వలోపములు.

శబ్దానుశాసనమూలసూత్రము.

ప్రథమలుగపిద్వినులోప్వః॥

క॥ సమయునువికల్పకంబున । శమితదనుజ తమకుఁ దాము * జడ్డలయిపదాం । తముల వెలింగెడునులువ । ర్ణములనుబ్రథమాక్షరములు * రాజీవాక్షా ॥ ౧౪౯ ॥ తే॥ గీ॥ కన్నుమూసెనుగనుమూసెఁ * జన్నుదోయి । గబ్బిచనుదోయిమిన్నువాఁ * కమినువాఁక । ముల్లునాటెనుములునాటెఁ బల్లుగంటి । తరుణిపలుగంటికల్లుముంతకలుముంత ॥ ౧౫౦ ॥

ద్రుతలోప సమాసములు ॥

శబ్దానుశాసనమూలసూత్రము.

ద్రుతస్యసర్వత్రలుక్సమాసేషు॥

తే॥ గీ॥ వనధితనయేశయయిసటు * వంటియనుచుఁ । బరపదవిశేషణము తేట * పఱుచుకొనుచుఁ । దొలుతటిపదంబుకొననుండు * ద్రుతముగుడియు । సమసనమునందుఁ జెందులో * పములుగృతుల॥క॥ కడపలిద్రుతమునుగుడియును । బొడవడఁగినఁ బయినిబరుష * ములుసరళములౌఁ । జెడవ్రుపెఱహల్లులెల్లను । సడలకప్రాణంబులెల్ల*సంధులుగాంచున్॥ ౧౫౨॥ తే॥ జగతిఁ జప్పనికూరకుఁ * జప్పగూర । చనునుజక్కనిచాయకుఁ * జక్కచాయ। హెచ్చుపచ్చనితోటకుఁ * బచ్చతోట । గగిమఁ గమ్మనితావికిఁ * గమ్మదావి॥ ఆ॥ చల్లగాలితీయ * విల్లునాసరళస్థి। రాక్షరములుతొల్లి * టట్లనిలుచుఁ । బంచబాణజనక * పచ్చావునల్లావు । లనుచునచ్చులెల్ల * నదుకునిట్లు ॥ ౧౫౩ ॥

హేమాచార్యమతసంధులు.

శబ్దానుశాసనమూలసూత్రము.

హేమోక్తేఃపరుషాణాంగసడదవాస్స్యుఃపదాద్ద్వన్ద్వే॥

క॥ సుమనస్స్తుతద్వంద్వసమా । సమునను హేమోక్తినిబర * శబ్దాదిమవ । ర్ణములగుపరుషాక్షరములు । తమరూపులువిడిచిగసడ* దవలగువరుసన్ ॥ ౧౫౪ ॥ ఆ॥ కసవుగట్టెలనఁగఁ * గాలుసేతులనంగ । నిక్కడెక్కలితడు * నేరఁడనఁగ । నొప్పుదప్పులనఁగ * నూరువల్లెలనంగ । జరుగునిట్లుద్వంద్వ*సమసనమున॥ ౧౫౫॥

ప్రథమాంతగసడదవాదేశము.

శబ్దానుశాసన మూలసూత్రము.

గసడదవాస్స్యుః ప్రథమామాత్రాదాత్మాస్మదోర్విభక్తే॥

సీ॥ శుకముచిస్తుతద్రుత * ప్రకృతులౌనేను దానను రెండుదక్కంగ * న
వనిఁగలుగు । ప్రథమావిభక్తులపై నిదత్తుల్యశబ్దములమీఁదనుగను *పట్టు
నాంధ్రశబ్దాదిగతపరు*షముల కేనింటికిఁ గ్రమముదప్పక వచ్చు*గసడదవలు।
సిరిగలిగినవాఁడు * పురుషుండు సెలరేఁగి నిక్కంబు డెక్కలు * నెరపుఁ
గాని॥ తే॥ ప్రియముపలుకొత్తవర్థికిఁ*బెట్టలేఁడు। కలిమివ్రాయినసీగికిఁ*గ్రాం
తుఁ సేయు । నపుడుగలుగునే తనకుఁగా * సైననఁగ । నివియుదాహరణ
ములయ్యె * నెన్నిచూడ॥

శబ్దానుశాసనమూలసూత్రము.

నవికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాంభవన్తిగసడదవాః॥

సీ। పరమాత్మప్రథమావి * భక్తులమీఁదనుదత్సమానాంధ్రశ*బ్దముల
మీఁదఁ । గలసంస్కృతపదాది * గతపరుషంబులెల్లెడనిజరూపము * ల్చె
డకనిలుచు । గాదిలిజవరాలు * కమలనివాసినిచిఱుతముద్దులపట్టి * చిత్త
జాతుఁ । డనుఁగుఁజుట్టంబుటం * కాయుధహస్తుండుమక్కువమఱఁదితా *
మరసవైరి॥ తే॥ నిక్కమర్త్మలిమామపా * సీయరాశి । యరసిచూడంగనెవ్వ
ని * కట్టివేల్పు । నాఁడుకరుణించినాకుస్వ * ప్నమునవచ్చి। తెనుఁగుగావిం
పుమనియెను * దీనినఁగ॥

కల్పితకల్పవల్లీసమాసలక్షణ సీసమాలిక.

పంచదశవిధాంధ్రి పద్యగర్భితములై కరధృతకరుహాము * ఖ్యంబులగు
చుఁ । బరఁగుద్వితీయవి * భక్త్యేకవచనాంతసంస్కృతభాషాష్ట సమసనము
లు । వానికథ్యాహార్య * మైనామియనుధాతుపదముపై కొనుసభి * ప్రాయ
ములకు । సమసనాంతస్థితా*క్షరములపైఁగలతలకట్టులకుశృంగ* ములుఘ
టించి । బొట్టులవలపలఁ * బొదలువర్గాద్యక్షరములెల్లఁదత్సర*శములుచేసి।
యాదివర్గద్వితీ * యములదాపలనుంచుపూర్ణంబులకుఁబద్య *ములకుఁదుది
ని । దనరుసున్నలునుబొ * ల్లనకారములఁజేసి పఠియింపనగునాంధ్రి * ప
ద్యవితతి । తరువాతకందప * ద్యముతోడఁగులకమై తలచూపుదానికి *ధా
తుపదము । పరనవిలసితయు * గ్మంబయ్యెఁబదపదంబునను సప్తాక్షరం *
బులుగఁజనువ । నిపుడుచెప్పినవృత్త* మేయంగవిధులచేమధుమతివృత్తనా
మంబుగాంచుఁ । బాదపాదమునకుఁ * బదునాల్గువర్ణముల్గావింపఁ బ్రహరణ
కలితమయ్యెఁ । దొలుతటిసమసనం * బులద్రుతప్రకృతులె పెనుకసమ



సన * పదముఁగూడి । పంచాశదక్షరో* దంచితపదములై మణిగణనికరస
మాఖ్యఁజెందు । నష్టమాత్రావృత్త * యమళమయ్యెద్రుతాంతసమసనం
బొక్కొక్క * చరణమైన । నాంతసమాసద్వ * యంబొక్కపాదమైర
గడలలోమధు * రగతియునగుఁ । దలపోయనిటులవ్య * త్యయలేఖనక్రమవి
ధులుపోడశలఘు * వృత్తమంచురి। ద్విపదంబయ్యె * దీనికిఁగడపలం
జూపట్టుద్రుతమర * సున్నయైన । వెసద్రుతాంతంబులై * నసమాసము
లునాల్గుహరిగతికేతాంఘ్రి * యైతనర్చు । వేమఱుకడపల * వెలయుసమా
సంబు మొదలుగాఁమదయును * మొదలుగలయఁ । జమవృవేలఁదృతీయ*
సప్తమసమసన చరమబిందులుద్రుతా * క్షరములైనఁ । గనుపట్టునెనిమిది*
కందపద్యంబులుగఁ యతిప్రాసము*ల్కడమగాక॥ తే॥యిట్టిగర్భకవిత్వంబు*
లెఱిఁగిసీకుఁ । గవితఁరచియించువానిభా * గ్యంబుపొగడ । నమరనేతకుధా
తకు * నైనఁదరమె । సహ్యమీఁదక్షితిక్షైకయో * జననివేశ॥౧౬౨॥

అవతారిక.

అథేదానీం కాకునూర్యప్పకవివర్యః పంచాశదన్ధ్రి పద్యగర్భితాష్టస
మాసాన్ ప్రహరణకలితవృత్తేనసంగృహ్ణాతి ॥ కరధృతకరుహాం * కరిహీ
తకరణం । కరుహాసఖరుచిం * గరుడఖగరథం । ఖరఘనకరవిం * ఖరతర
కరగం । గరళముఖరిపుం * గరధరకరతం ॥ టీక॥ బాలానాంమందబుద్ధీనాం
సుఖావబోధార్థమేతదష్ట సమాసాంతర్గతశబ్దానాం క్రమేణార్థం దర్శయ
తి ప్రపంచయతి- కరధృతకరుహాం కంజలం-కంశిరోంబునోరితి నానార్థాభి
ధానాత్ - కేజలేరుహాతి ప్రాదుర్భవతీతి- కరుహామబ్జం శంఖమితియావత్ -
రుహాబీజజన్మని ప్రాదుర్భావేచఇతిధాతుః - కరోహస్తఃబలిహస్తాంశవఃక
రాఇత్యమరః - కరేణధృతంకరుహాం శంఖంయేనతం కరధృతకరుహాం-శం
ఖధారిణమిత్యర్థః । యద్వాకరేణ హస్తేనధృతం కరుహామంబుజం యేన
తంకరధృతకరుహాం - పద్మస్యాంభోరుహత్వేన కరుహాత్వస్యవక్తుంశక్య
త్వాత్ - తథాచ- హస్తధృతాంభోరుహామిత్యర్థః - శంఖచక్రగదాపద్మ
ధారిణం వనమాలినమితి - ధ్యానాన్తరప్రసిద్ధేః॥ ౧॥ కరిహీతకరణం-కరో

హ_స్తఃసో౽స్యాస్తీతికరీమతంగజః కుఞ్జరోవారణః కరీత్యమరః - కరిణో
హితం మోక్షణంకరిహితం - కరిహితేకరణః సాధనభూతః - తంకరిహి
తకరణం - అత్రకరణాధికరణయోరితి కరణార్థేల్యుట్ నచసాన్యత్పదంతస్య
పుం_స్త్వంశంకనీయం - నారాయణఇత్యాదౌపుం_స్త్వస్యాపిప్రసిద్ధేః । వి
ష్యంలోకాశ్రయత్వాల్లింగస్యేతిజనపదాదిషుపూ_ర్వైరభిహితత్వాత్ -పు
రాకిలపాండ్యరాడిన్ద్రద్యుమ్నాఖ్యరాజర్షిరగ_స్త్యశాపవశాద్గజేన్ద్ర త
మాపన్నస్సన్ కదాచిత్తృష్ణావశాద్దుగ్ధోదధిమధ్య త్రికూటాచలాగ్రవ
రుణోద్యానాంతరసరోవరం సమాగత్య దేవలశాపాగతగ్రాహరూపిణ
హూహూగంధర్వేణగ్ర_స్తఃప్రా_క్తన జన్మతపోవిశేషవిజ్ఞానసంపన్నస్సన్
రమేశ్వరముద్దిశ్యస్తోత్రంచ కారసైకుంఠభవనస్థోవాసుదేవ_స్తత్సమీపం ప్రా
ప్య మోక్షయామాసేతిసుప్రసిద్ధంభాగవతే॥ కరుహాసఖరుచిం కేజలేరు
హా_న్తికరుహాణ్యమ్భోజాని-కరుహాణ్యమ్భో జాకరుహాణాంనీరజానాంసఖ
హితః కరుహాసఖస్సూర్యః అత్రరాజాహస్సఖిభ్యష్టజితిటచ్ప్రత్యయః -
రుహాసఖస్య సూర్యస్యరుచిరివరుచిర్యస్యతంకించ యథాభాస్వాన్తమో
వ_ర్తయన్లోకందీపయత్యేవంవిష్ణురప్యజ్ఞానరూపతమోనివ_ర్తయన్ లో
దీపకత్వా_త్తస్యభాస్కరతేజోవ_త్త్వంయు_క్తం-యద్వా- కరుహాణ్యుత్పల
ని - తేషామపిజలరుహత్వస్య వక్తుంశక్యత్వాత్ - కరుహాణాముత్పలానా
సఖాహితః కరుహాసఖశ్చంద్రః - కరుహాసఖస్య భూషణమయచన్ద్రస్య
చిర్యస్యతం బాలభావే హారిణార్ధచన్ద్రాకారభూషణధారణస్యకర్ణామృ
షూ_క్తత్వాత్ - యద్వా - సూర్యకోటిప్రతీకాశం చన్ద్రకోటిసమప్రభః
తిప_ద్మపురాణే భగవద్ధ్యానాంతరస్యసత్త్వాచ్చ - అస్మిన్నర్థేకరుహాసఖేత
త్రబహువచనతయాసమాసోజ్ఞేయః-బహుత్వస్యత్రిత్వాదిసాధారణత్వా
త్ - అథవా - కరుహాణీస్త్రీసరాణి - తేషాం సఖాహృదయభూతా తుల
రూపిణీత్యర్థః - తాదృశీరుచిర్యస్యతం శైత్యంహియసత్వా ప్రకృతేర్జలసే
త్యాదివద్భిన్నలింగానామపి విశేషణవిశేష్య భావస్సమ్పద్యతే॥ ౩॥ గరు
ఖగరథం - గరుడోగరుత్మాన్గరుడ స్తార్క్ష్యఇత్యమరః - గరుడఇతిఖగఃప



రుడఖగః గరుడఖగఏవరథోవాహనం యస్యతం - యద్వా-ఖేగచ్ఛన్తి
రన్తీతిఖగాఇతి వ్యుత్పత్త్యాఖగశబ్దస్య దేవతావాచకత్వస్యాపివక్తుంశక్య
త్వాత్ - గరుడఖగోగరుడదేవః - సఏవరథోయస్యతం - అథవాగరుడఏ
ఖగరథోవ్యోమసంచారణపటురథోయస్యతం - కించ- ఖగస్సూర్యః-శ
ర్కవిహగాఃఖగాఇత్యమరః - సూర్యశబ్దస్యశ్రేష్ఠవాచకత్వస్యాపివక్తుం
శక్యత్వాత్ - గరుడానాంపక్షిణాంశ్రేష్ఠః - గరుడఖగఃసఏవరథో యస్య
తం ॥ ౪ ॥ ఖరఘనకరవిం - ఖరఃఖరాసురః - ధేనుకవనవాసీ గర్దభాసురః-
అథవా దండకారణ్య నివాసో రావణజ్ఞాతిః ఖరాసురఃసఏవఘనః మేఘః-
ఘనజీమూతముదిరేత్యమరః - కఃవాయుఃమారుతే వేధసిబ్రధ్నేపుంసిక
ఇత్యమరః - కానాంవాయూనాం - రవిఃశ్రేష్ఠశ్చణ్డమారుతఇతియావత్ -
ఖరఘనస్యకరవిః - తంఖరసమానఖరాసురప్రళయవాయుస్వరూపఅస్మిన్
అర్థేభాగవతరామాయణప్రసిద్ధిర్ద్రష్టవ్యా ॥ ౫ ॥ ఖరతరకరగం - ఖరతరా
స్తీక్ష్ణతరాః - తిగ్మంతీక్ష్ణంఖరం తద్వదిత్యమరః । కరాఅంశవోయస్యసః -
ఖరతరకరస్సూర్యః - తంగచ్ఛతీతి - ఖరతరకరగః-తం-ధ్యేయస్సదాసవితృ
మణ్డలమధ్యవ_ర్తీతిధ్యానశ్లోకప్రసిద్ధత్వాదిత్ -యద్వా-ఖరతరోదర్దురఃకరో
యస్యసఃఖరతరకరః - కుంజరః సఇవగచ్ఛతీతిఖరతరకరగః-తంమ_త్తమాతం
గవిక్రమమితి రామాయణేబాలకాండేవాల్మీకివచనప్రసిద్ధేః - నచాత్రవిక్ర
మపదస్యపరాక్రమార్థపరతాశ్రయణీయా - తద్వ్యాఖ్యానేతత్పదస్య క్ర
ముపాదవిక్షేపణ ఇత్యస్మాద్ధాతోర్గమనార్థకత్వస్యో_క్తత్వాత్ ॥ ౬ ॥గరళము
ఖరిపుం-గరళంవిషంముఖేయస్యసఃగరళముఖః- కాళీయఃతస్యరిపుః శత్రుః
తంకాళీయమర్దనమిత్యర్థః - అత్రభగవాన్యమునాహ్రదస్థం కాళీయా
ఖ్యం మహోరగంశిక్షితవానితి పూర్వభాగవతప్రసిద్ధేః ॥ ౭ ॥ గరధరకర
తం ధరతీతిధరః - ధృఞ్ ధారణే ఇతిధాతుః - గరస్యకాలకూటస్యధరో
గరధరస్సదాశివః - సఏవగరధరకః - స్వార్థేకప్రత్యయఃతస్మిన్రతంప్రీతిమం
తంనారాయణప్రియఃపరంగ మదాపహారమితిస్తోత్రాత్ - యద్వా - కశ
బ్దస్య బ్రహ్మవాచకత్వాత్ - గరధరశ్చకశ్చగరధరకౌ- తయోఃరతంప్రీతి
మంతం యదపినారాయణస్యసర్వసమత్వమేవవ_క్తవ్యం । తథాచలౌకికసా

మ్యాత్పురాణప్రసిద్ధేశ్చతద్వదుక్తిరితిజ్ఞేయమ్ ॥ అత్రనామాత్యర్థవ్యాఖ్యానేన తథావిధం గోపాలం నౌమీత్యర్థః - యద్వాగరధరకరతమిత్యత్ర గరేతిధరేతి కరతమితి పదత్రయంద్రష్టవ్యం - తథాచ - హేగరవిషస్వపృష్ఠపటిష్ఠేతియావత్ - కేబ్రహ్మణిరతం ప్రీతిమంతం పూర్వోక్తవిధం దేవం ధరహృదిధ్యాయ స్వేత్యర్థః - అత్రకృష్ణస్యగరుడఖగరథమితివిశేషణాద్వయసామర్థ్యాత్తద్భజనేనాస్యపాపరోగో భవిష్యతీతితథోక్తిరితిజ్ఞేయమ్॥

వ॥ సప్తాక్షరైకపాదంబైనగర్భమదనవిలసితవృత్తద్వయము॥

కరధృతకరుహున్ - గరిహితకరణున్ - గరుహాసఖరుచిన్ - గరుడఖగరథున్ ॥

గర్భద్వితీయమదనవిలసితవృత్తము.

ఖరఘనకరవిన్ * ఖరతరకరగున్ * గరళముఖరిపున్ * గరధరకరతున్

వ॥ కొందఱీరెండువృత్తములుమధుమతివృత్తమందురు॥

చతుర్దశాక్షరైకపాదంబైనగర్భప్రహరణకలితవృత్తము

కరధృతకరుహున్ గరిహితకరణున్ । గరుహాసఖరుచిన్ గరుడఖగరథున్ । ఖరఘనకరవిన్ ఖరతరకరగున్ । గరళముఖరిపున్ గరధరకరతున్॥

పంచదశాక్షరైకపాదంబైనగర్భమణిగణనికరవృత్తము.

కరధృతకరుహునిగరిహితకరణున్ * గరుహాసఖరుచిని గరుడగరథున్. ఖరఘనకరవిని ఖరతరకరగున్ * గరళముఖరిపుని గరుడఖగరథున్ ॥ ౧౮౩॥

అష్టాక్షరైకపాదంబైనయష్టమాత్రావృత్తద్వయము.

కరధృతకరుహుని*గరిహితకరణుని*గరుహాసఖరుచిని * గరుడఖగరథుని॥

గర్భద్వితీయాష్టమాత్రావృత్తము.

ఖరఘనకరవిని*ఖరతరకరగుని*గరళముఖరిపుని*గరధరకరతుని॥ ౧౮౪॥

షోడశాక్షరైక పాదంబైనగర్భమధురగతిరగడ.

కరధృతకరుహుని * గరిహితకరణుని*గరుహాసఖరుచిని * గరుడఖగరథుని। ఖరఘనకరవిని*ఖరతరకరగుని * గరళముఖరిపుని * గరధరకరతుని॥

వ॥ కొందఱుదీనినేషోడశలఘువృత్తమందురు॥



పంచదశాక్షరైకపాదంబైన గర్భద్విపదము.

కరధృతకరుహుని*గరిహితకరణున్ * గరుహాసఖరుచిని*గరుడఖగరథున్ ఖరఘనకరవిని*ఖరతరకరగున్ *గరళముఖరిపుని*గరధరకరతున్ ॥ ౧౮౬

ద్వాత్రింశదక్షరైకపాదంబైనగర్భహరిణగతిరగడ.

కరధృతకరుహుని * గరిహితకరణుని * గరుహాసఖరుచిని*గరుడఖగరథున్ । ఖరఘనకరవిన్ * ఖరతరకరతున్ * గరళముఖరిపుని * గరధరకరతున్ ॥

గర్భప్రథమకందము.

కరధృతకరుహున్గరిహిత । కరణున్ గరుహాసఖరుచిని * గరుడఖగరథున్। ఖరఘనకరవిన్ ఖరతర।కరతున్ గరుడముఖరిపుని*గరధరకరతున్॥

గర్భద్వితీయకందము.

గరధరకరతున్గరధృత । కరుహున్గరిహితకరణుని* గరుహాసఖరుచిన్ । గరుడఖగరథునిఖరఘన । కరవిన్ఖరతరకరగుని * గరళముఖరిపున్ ॥

గర్భతృతీయకందము.

గరళముఖరిపుంగరధర । కరతున్గరధృతకరహుని * గరిహితకరణుం*గరుహాసఖరుచిన్గరుడఖ । గరథున్ఖరఘనకరవిని * ఖరతరకరగున్ ॥

గర్భచతుర్థకందము.

ఖరతరకరగున్గరళము । ఖరిపుంగరధరకరతుని * గరధృతకరుహుం । గరిహితకరణుంగరుహాస । ఖరుచింగరుడఖగరథుని * ఖరఘనకరవిన్ ॥

గర్భపంచమకందము.

ఖరఘనకరిహితఖరతర । కరగుంగరళముఖరిపుని * గరధరకరతుం । గరధృతకరుహుంగరిహిత । కరహుంగరుహాసఖరుచిని * గరుడఖగరథున్ ॥

గర్భషష్ఠకందము..

గరుడఖగరథున్ఖరధర । కరవిన్ఖరతరకరగుని * గరళముఖరిపున్ । గరధరకరతుంగరధృత । కరుహుంగరిహితకరణుని * గరుహాసఖరుచిన్ ॥

గర్భసప్తమకందము.

కరుహాసఖరుచిన్గరుడఖ । గరథున్ఖరఘనకరవిని * ఖరతరకరగున్ । గరళముఖరిపుంగరధర । కరతుంగరధృతకరహుని*గరిహితకరణున్ ॥

గర్భాష్టమకందము.

కరహితకరణుంగసహాస । శరుచిగరుడఖగరథుని * ఖరఘనకరవిర్ । శ
తరకరగుణగరళము । శరిపుంగరధరకరతుని * గరధృతకరుహార్ ॥

పదప్రకాశితకందము.

క॥ కామెపలినామపురిసు । త్రామసరోజాప్తకోటి * ధాముజలధర ।
శ్యాముయమసోముదనుజవి।రాముస్వరిజస్త్రీమనోభి*రాముందలంతుర్

ఆశ్వాసాంతగద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్రభరద్వాజగోత్రకామెపల్లిపురమందిర
నందనందన చరణారవింద వందనాభిలాషమనీషా ప్రాభవ
వేంకటార్య తనసాభవ విద్యావిశేష సురాచార్య
కాకునూర్యప్పకవివర్యవిరచితంబైన యాంధ్ర
శబ్దచింతామణి యను వ్యాకరణశాస్త్రం
బునందష్టాదశార్యావృత్తంబులు సప్త
చత్వారింశత్సూత్రంబులుం గల
సంధిపరిచ్ఛేదము ను,

అప్పకవీయము - పంచమాశ్వాసము.

సంపూర్ణము.



